# శైవసర్వస్వము

## ప్రమాణపరిచ్ఛేదము.

గ్రంథకర్త :

పండిత, ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు

ఈమని.

ప్రకాశకులు :

శ్రీయుత, పసుమర్తి వీరభద్రస్వామిగారు, B. A., M. L. C.

శ్రీయుత, పెన్నం నారాయణగార్లు.

ప్రథమ ప్రచురణము.

శ్రీ కన్యకా పరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు ముద్రితము,

విజయనగరం.

1942.



మూల్యము 1-0-0.

# విషయసూచిక.

## 1. శాంభవదీక్ష.


| | |
|---|---|
| శివతత్త్వము | 1 |
| పతిపశుపాశవివరణము | 18 |
| శాంభవదీక్ష యననేమి | 23 |
| షడధ్వన్యాసాదివివరణము | 34 |
| శాంభవదీక్షావిధి | 66 |


## 2. ఆవరణాచారదీపిక.


| | |
|---|---|
| భస్మము | 51 |
| రుద్రాక్ష | 58 |
| గురువు | 63 |
| మంత్రము | 67 |
| లింగము | 76 |
| పాదోదక ప్రసాదములు | 103 |
| భక్తుడు | 109 |
| శివాద్వైతము | 117 |
| పంచాచారములు | 120 |
| దశావధానవిశేషములు | 123 |


## 3. శాంభవీయ ధర్మసూత్రావళి.


| | |
|---|---|
| వర్ణాశ్రమ ధర్మావశ్యకత | 125 |
| ఆచమనవిధి | 127 |
| ఆహ్నికవిధానము | 128 |
| భక్తి | 130 |
| సోమవారవ్రతము | 131 |
| పూజార్హపత్రపుష్పములు | 132 |
| శివశాస్త్రప్రశంస | 133 |
| రంగవల్ల్యాదినిర్ణయము | 134 |
| నమస్కారవిధి | 135 |
| ప్రతిష్ఠాధికారము | 135 |
| పూజాదికవిశేషములు | 136 |
| రంగవల్లీవిధానము | 142 |
| శివమేధము | 147 |
| శివనామమాహాత్మ్యము | 149 |
| ఉపసంహారము | 151 |



శ్రీ పసుమర్తి వీరభద్రస్వామిగారు బి. యే. యమ్. యల్. సి.

విజయనగరము.



శ్రీ పెన్నం నారాయణగారు, విజయనగరం.

# తొలిపలుకు



శైవమహాజనులారా!

శివస్య తత్త్వం శివఏవ వేత్తి నందీశ్వరో వా నగజాకుమారః।

(పండితసూక్తి)

శివతత్త్వ మవాఙ్మానసగోచరము 'యతో వాచో నివర్తంతే' శివఏకో ధ్యేయః, విశ్వాధి కోరుద్రో మహర్షిః, శివాదన్యం నకించన, ఇత్యాదులగు వేదోపనిషత్తులును, అష్టమూర్తి మృత్యుంజయ మహాదేవాది శబ్దంబులును సర్వజ్ఞతాది షడంగకలితుండై సర్వభూత గుహాశయుండునగు శివుని పరబ్రహ్మముగ నిర్ణయించినవి.

సర్వమునకుఁ బతియయి పాశబద్ధులును పశువాచ్యులునగు బ్రహ్మాదిజీవులచే నుపాసింపబడు శివుఁడే సంసారమోచకుఁడగుచున్నాడు.

ఇట్టి సర్వేశ్వరునుపాసింప సాంప్రదాయసిద్ధమై నిగమాగమ ధర్మసమ్మతమును, కర్మజ్ఞాన సముచ్చయమునగు శాంభవదీక్ష గైకొన్నవారె శైవులు.

ఉపనయనానంతరమే లింగము ధరింపుటయు, నిత్యనైమిత్తిక ధర్మాచరణమును అష్టావరణ పంచాచారానుష్ఠానమును, సోమవార వ్రతాది నియమంబును. షట్కాల శివపూజయు, దేహావసానంబున సమాధ్యాచారము. గణార్చనము మొదలగునవి శైవధర్మములయి యున్నవి.

శైవసిద్ధాంతము శివాద్వైతము పండితత్రయమునందలి మల్లికార్జునపండితులీవిషయమును స్వకీయ శివతత్త్వసారమున సిద్ధాంతీకరించియుండెను.

ఏతద్ధర్మబోధకములై శ్రీకరప్రస్థానత్రయము, క్రియాసారము, ధర్మసంగ్రహము, చంద్రజ్ఞానోత్తరము వాతూలోత్తరము సిద్ధాంతోత్తరకౌముది, విద్యాస్థానవినిర్ణయము పంచజాబాలములు, లింగధారణ చంద్రిక, దీపిక, బ్రహ్మతర్కస్తవము, శైవసిద్ధాన్తదీపిక, శివతత్త్వసారము కాళహస్తి దీక్షితీయము, ద్వాదశారాధ్యచరిత్రము మొదలగునవి శైవమతసిద్ధాంతగ్రంథములగుచున్నవి.

శివధర్మవిజ్ఞానమును సప్రమాణముగ వివరించిన యుత్తమ గ్రంథములలో నీ శైవసర్వస్వమొక్కటి సాంప్రదాయకానుష్ఠాన సిద్ధములగు ననేక శైవధర్మములిందు సుబోధకముగ వివరింపబడినవి. శైవ మహాపీఠసమావేశములందీ గ్రంథభాగములు ప్రకటింపబడి పండితమన్ననలకుఁ బాత్రములయినవి. శైవధర్మబోధకమగు నిట్టి యమూల్యగ్రంథము శైవమహాజనుల తదభిమానుల సంపూర్ణాదరణమంది గ్రంథకర్తకు విశేషఖ్యాతిని చేకూర్చుననుటలో విశేషములేదు. పలు గ్రంథముల నవలోకించి శ్రమించి శైవసర్వస్వమను నీ గ్రంథమును రచించి శైవమండలికి నుపాయనముగ సమర్పించిన మతాభిమానులు, ఉద్భటారాధ్యపీఠసాంప్రదాయక ప్రవర్తకులు శివగీతాసంగ్రహాద్యనేక గ్రంథకర్తలు, కవివతంసులు, బ్రహ్మశ్రీ లోకారాధ్యులగు పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు, గుంటూరు మండలమునందలి ఈమని గ్రామము వీరి జన్మభూమి. జననీజనకులు జ్వాలాంబా, వీరభద్రారాధ్యులు, విజ్ఞాననిధులును విఖ్యాతచరిత్రులునగు మల్లికార్జునరావు, బసవయ్యగార్లు వీరి సోదరులు.

శాస్త్రిగారు ఆంధ్రగ్రంథరత్నభాండారమనుపేర నొక గ్రంథమాలను స్థాపించి చాణక్యనీతి, శివగీతాసంగ్రహము కృష్ణామాహాత్మ్యము మొదలుగాగల గ్రంథముల ప్రకటింపుచు భాషాసేవ యొనర్చుచున్నారు. స్వగ్రామమున శ్రీసనాతనశైవ సమాజమను నొక మతసంస్థను స్థాపించి స్వమతాభ్యుదయమున కన్నివిధముల తోడ్పడుచున్నారు. దుర్గా బసవేశ్వర ధర్మసత్ర నిర్మాణమునకు వీరొనర్చిన కృషి అపారము. శైవ మహాపీఠగురుమండలి సభ్యులగు వీరికి ఆంధ్రదేశమున పలుప్రాంతములందనేకులు శిష్యులుగలరు.

దయామయుడగు పరమేశ్వరుడు శాస్త్రిగారి కాయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించి రక్షించుగాక.

ఇట్లు

ముదిగొండ వీరేశలింగశాస్త్రి,
విద్వాన్. సాహిత్య విద్యాప్రవీణ
ఇస్మానియా ఇంటర్‌మీడియేట్ కాలేజీ లెక్చరర్.

వరంగల్,
16—4—42,

# విజ్ఞప్తి.

చతుర్విధఫలపురుషార్థసిద్ధికి బరమేశ్వరారాధనకంటె మార్గమింకొకటిలేదని సర్వశాస్త్రములందునను నిర్ణయింపబడినది. అన్యోన్యాశ్రయములగు భక్తిజ్ఞాన క్రియాదు లిందుకు సాధనములనకతప్పదు. ప్రప్రథమమున లోక కళ్యాణమునకిట్టి పరమాత్మసృష్ట మార్గబోధకములగు వేదాగమాదులు కృపానిధియగు భగవంతునిచే బ్రసాదింపబడినవని యార్యుల విశ్వాసము. విజ్ఞానధనులైన యార్యులు దైవదత్తములు-నపారములును సకలధర్మబోధకములు నగు నాపెన్నిధుల నాదరించి కృతకృత్యులై భావిసంతతుల యైహికాముష్మిక భాగ్యోదయమునకు హేతుభూతములగు చక్కని త్రోవల సిద్ధపరచి తదనుష్ఠానమునకు వలయు నవకాశములగూడ చేర్పగలిగిరి. భిన్నభిన్నములగు కట్టుబాట్లకు లోనగుచు దత్పరత్వముననున్న సంఘమువారలే యాస్తికమతానుగాములై - యుపాస్యోపాసకధర్మమున శైవాదిమతములవారను సంజ్ఞకుబాత్రులై భగవదనుగ్రహప్రాప్తి కర్హులగుచున్నారు.

శైవసర్వస్వమను నీగ్రంథమునందలి ప్రమాణ సంగ్రహమంతయు వేదాగమోపనిషత్పురాణాదులనుండి గ్రహింపబడినది. మఱియు లింగధారణ చంద్రికాదీపికాది గ్రంథములనుండియు - శ్రీకంఠ శ్రీకర భాష్యములనుండియు - మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే బ్రకటింపబడిన శైవగ్రంథములనుండియు - శైవప్రచారిణి గ్రంథములనుండియు గ్రహింపబడినది. పూజ్యులగు నాగ్రంథకర్తలకును ప్రకటనకర్తలకును నా నమస్కృతులు.

స్వభాషయందు శైవధర్మములను వివరించుటయు తద్వారా మతధర్మప్రచారమునకు దోడ్పడుటయు నీగ్రంథ రచనోద్దేశ్యమై

యున్నది. శైవధర్మప్రతిపాదకములగు నిందలి కొన్ని వ్యాసముల కరపత్రరూపకముగను - కొన్ని వ్యాసముల శైవమహాపీఠ సమావేశములందునను బ్రకటించియుంటిని. బుధులావ్యాసముల నాదరించి గ్రంథరూపముగ బ్రకటింపుడని కోరియుండిరి. వారి యుద్బోధనమే నేటికిట్టుల గ్రంథరూపముగ వెలువడగలిగినది.

అవ్యాజానురాగముచే నన్నన్నివిధంబుల గౌరవింపుచు సంపూర్ణాదరంబున నీగ్రంథ ముద్రణభారమును వహించి తమ సహజౌదార్యమును బ్రకటించిన లోకవిఖ్యాతులును - శ్రీయుతులును-మచ్ఛిష్యవరులు విజయనగర పురపాలకాధ్యక్షులు నగు మహారాజశ్రీ పసుమర్తి వీరభద్రస్వామి B.A.,M.L.C. పెన్నం నారాయణగార్లకు సర్వశుభములననుగ్రహింప బరమేశ్వరుని సర్వదా ప్రార్థించుచున్నాను. ప్రాజ్ఞులుఅగాధమగు నీధర్మసంగ్రహము నిట్లు ప్రకటింప సాహసించిన నా అవజ్ఞతను మన్నింతురని నమ్ముచున్నాను. ఈగ్రంథప్రకటనమునకు నాకన్నివిధముల సహాయులగు వారికెల్లరకు నాకృతజ్ఞతను దెలియజేయుచున్నాను.

గ్రంథకర్త.

శ్రీ మేధాదక్షిణామూర్తి గురవేనమః.

# శైవసర్వస్వము, ప్రమాణపరిచ్ఛేదము,

## శాంభవదీక్ష.



### శివతత్వము.



శ్లో॥ యస్మిన్వోనామ రూపాభ్యాం। యాదేవి సర్వమంగళా।
తయోస్సంస్మరణాత్పుంసాం। సర్వతో జయమంగళ.॥

శ్లో॥ దూర్వాస కౌశిక సుకేశి మృకండుపుత్ర
దేవేంద్రబాణవిధిశేకి దధీచిరామాన్।
కావ్యాత్రిదేవగురు కుంభజగౌతమాదీన్।
పుణ్యానిమాన్పరమపాశుపతాన్స్మరామి॥

శ్లో॥ సదాశివసమారంభాం ఉద్భటారాధ్యమధ్యమాం।
అస్మదాచార్యపర్యంతాం వందేగురుపరంపరాం॥

శ్వేతాశ్వతరోపనిషత్తునందు 'శివ ఏవ కేవలః' శివుఁడొకఁడే కలఁడని నిశ్చయింపఁబడినది. 'నకించన శివాదన్యం నకించన శివాత్పరం శివాతిరిక్తం నహించ సర్వం శివమయం జగత్' శివునికంటె నన్యమును బరమునతిరిక్తమునగునది యెద్దియునులేదు సర్వము శివమయమని స్కాందమహాపురాణమందలి శివతత్వసుధానిధియందు వచింపఁబడినది.

'నసన్నచాసచ్ఛివ ఏవకేవలః' యను వేదవచనము సృష్టికి బూర్వము సత్తుగాని - అసత్తుగాని యుండలేదు. శివుఁడొక్కఁడే కలఁడని చెప్పుచున్నది. ఎయ్యది సృష్టికంటెను బూర్వమునఁగలదో

యదియే సర్వమునకుఁ గారణమగుచున్నది. కానసే
పరబ్రహ్మాభిధమగుచున్నది. ఈ విషయమునుగూర్చి వ
బ్రహ్మలక్షణ నిరూపణావసరమున 'యతో వా ఇమా
జాయంతే, యేనజాతానిజీవంతి, యత్ప్రయన్త్యభిసంవిశంతి,
స్వతద్బ్రహ్మ' ఎవ్వనివలన నీభూతములన్నియుఁ బుట్టు
పుట్టియే మహానీయుని కారణమున జీవింపుచున్నవో, మఱి
మందు నెందు జేరుచున్నవో, యాతఁడే జిజ్ఞాసకు యో
బ్రహ్మయునగుచున్నాఁడని వివరింపఁబడినది. వ్యాసభగ
'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యను బ్రహ్మసూత్రమున బ
యొక్క కర్తవ్యమునుపదేశించి రెండవదియగు 'జన్మాద్య
యను సూత్రముచే జగజ్జన్మాది కారణత్వమే బ్రహ్మల
స్మరించియుండెను. జగజ్జన్మాది కారణత్వమే బ్రహ్మల
గలుగుటకతన బూర్వోక్తమయిన 'నసన్నచా సచ్ఛివ
యను శృతియందా బ్రహ్మమే శివునిగా నిరూపింపఁబడినది.
చేతనము 'అసత్' అచేతనములని చెప్పఁబడుచున్నవి.
కములగు నీరెండు నెప్పుడులేవో, యప్పుడు శివుఁడు మాత్ర
డెనని వచింపఁబడుట కార్యోత్పత్తికి బూర్వమెవ్వఁడు
యుండునో యాతఁడే యాకార్యమునకు, గారణరూపు
కతన చరాచరములకుఁ బూర్వమందున్న యాతఁడే వ
కారణమునై యుఁడవలయును. ఇద్దాన జగజ్జన్మాది కా
మగు బ్రహ్మము శివుఁడే యని సిద్ధమగుచున్నది.

బ్రహ్మయు విష్ణువును జగత్కర్తృత్వమునుగూర్చి
జగత్కర్తా మయ్యే వేదం జగత్స్థితం' నేనే జగత్కర్తను
యీ సర్వమును గలదని కలహించుకొనసాగిరి. పర
వారి శక్తిని హరించెను. వారొక్కమారుగ వివశులయిరి
నిధియగు నందీశ్వరుఁ డటకరుదెంచి 'ఓవిష్ణు బ్రహ్మముఖదేః

మహానుభావుఁడగు శివుఁడే సర్వమునకు గర్తయై యున్నాఁడు. సర్వసాక్షియు మహానందుఁడును బరబ్రహ్మయునగు నాతఁడు సర్వాత్మగతుఁడై యున్నాఁడు. సర్వనియంతయగు నాతని యనుగ్రహలేశమే యీ విష్ణ్వాదిపదములకుఁ గారణము. ఆమహాత్ముని సంకల్పములేక యేదియుఁ గాఁజాలదు కావున భ్రాంతిని వీడి మహేశ్వరు శివుని శరణంబు వేఁడుఁడని శివపరంభావమును బోధించుటయు వారీశ్వరుఁబూజించి శివప్రసాదమున లబ్ధజ్ఞానులయి యిష్టార్థముల నందిరని సూతసంహితయందుఁగలదు.

'ఋతగ్ం సత్యం పరంబ్రహ్మపురుషం కృష్ణపింగళం ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వైన మోనమః' 'ఈశానస్సర్వవిద్యానా మీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధి పతిర్బ్రహ్మణోధిపతిర్బ్రహ్మ శివోమే అస్తు సదాశివోం' అను మొదలుగాఁగల శ్రుతిసంచయము పరబ్రహ్మముగ శివుని నుతించి తృప్తినందియుండెను.

యోగసూత్రములయందు 'తస్యవాచకః ప్రణవః' యని పరమేశ్వరుఁడు ప్రణవవాచకుఁడని యనువదింపఁబడినది. ఈ యర్థమునే శివపురాణము 'ప్రణవోహి పరబ్రహ్మ ప్రణవః పరమంపదం, ప్రణవో వాచకస్తస్య, శివస్యపరమాత్మనః' యని ప్రణవమే పరమేశ్వరుఁడనియు నయ్యదియే పరమపదమనియు పరమాత్మయగు శివునకది వాచకమనియుఁ బ్రకటించినది. ఇట్లగుట శివుఁడు పరబ్రహ్మమనియు బ్రణవస్వరూపుఁడనియు నిర్ధారితమగుచున్నది.

శివగీతాశాస్త్రమందలి విభూతియోగమున 'ఆసంప్రథమమే వాహంవర్తామిచ సురేశ్వరాః। భవిష్యామిచ లోకేస్మిన్ మత్తో నాన్యోస్తికశ్చన। వ్యతిరిక్తం నమత్తోస్తి నాన్యత్కించిత్సురేశ్వరాః' దేవతలారా! నేబురాతనుఁడను. నేనే ప్రథమంబునఁ బ్రవర్తింతును. నాకంటె నితరుఁడు మఱియొకఁడు లేఁడు. ఇతరమగు వస్తువును లేదని శివునిచే వచింపబడియె. మఱియు నేగుహాశయుండ నిష్కళంకుఁడ,

నద్వితీయుండను, "శృత్వేతి దేవామద్వాక్యం కైవల్యంజ్ఞానము త్వ
జపంతో మమనామాని మమధ్యాన పరాయణాః! సర్వేతే
దేహాంతే మత్సాయుజ్యం గతాస్సురాః। అతోయే పరిదృశ్య
పదార్థాః మద్విభూతయః' సకలదేవతలును మద్వాక్యములు
నాధ్యానమందే నిమగ్నులై నా సాయుజ్యమునందుదురు. దృ
మానంబులగు పదార్థములన్నియు నా విభూతులు. ఇట్లని వచిం
నటులఁగలదు. ఈ యర్థమే 'అహంప్రథమమాసం వర్తామిచ భ
ష్యామిచ నాన్యః కశ్చిన్మత్తో వ్యతిరిక్తః' యని శృతియు 'జడభూ
ప్రపంచేస్మిన్ శివచైతన్యయోగతః సర్వం శివమయంభాతి' జడభూ
మగు నీసర్వప్రపంచమంతయును శివచైతన్యముండుట కతన నంతర
శివమయమై ప్రకాశింపుచున్నదని శివమహాపురాణ వాయవీయ
హితయందును గలదు.

'ఏకోరుద్రో నద్వితీయాయతస్థే' 'విశ్వాధికో రుద్రోమహర్షి
'శివఏకోధ్యేయః' అను మంత్రోపనిషదాదికములగు వాక్యము
రుద్రుని విశ్వాధికునిగ నద్వైతునిగను ధ్యానయోగ్యునిగ ననేక
ముల బ్రశంసింపుచున్నవి. రుద్ర శబ్దార్థమును శివతత్వసుధా
యిటుల పరిష్కరించినది 'రుచ్ఛబ్దేచ సంసారదుఃఖం ద్రావయ
ప్రభుః। రుద్రఇత్యుచ్యతే వేదైరపి వేదాంతవేదిభిః। రుద్రఏవశి
ప్రోక్తః। రుద్రఏవసదాశివః। రుద్రయేవ పరంజ్యోతి రుద్రో
ఏషవాక్యతః। సంసారదుఃఖమును హరించు నాతఁడు రుద్రుఁడ
చున్నాఁడు అతఁడే పరంజ్యోతియగు శివుఁడని చెప్పఁబడును.

'సర్వేషామేవ తత్వానాం మూలం శివఇతిస్మృతః' అ
తత్వములకును శివుఁడే మూలము వాతూల శివాగమునందు
'యచ్చకించిజ్జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతే పివాతత్సర్వం శం
కస్యాజ్ఞా బలేన సమధిష్ఠితం' జగమునందేది చూడఁబడుచున్నదో
ఎయ్యది వినఁబడుచున్నదో యా సర్వము నీశ్వరాజ్ఞాబలమున

సమధిష్ఠితమైనదని వాయవీయసంహితయందును 'అండం హిరణ్మయం మధ్యేసముద్రం రుద్రస్య వీర్యాత్ప్రథమం బభూవ। అండాద్విష్ణుర్బ్రహ్మ జాతవేదాశ్చతన్మేమనశ్శివ సంకల్పమస్తు' బ్రహ్మవిష్ణ్వాది జనకకారణము శివుఁడగునని యు, 'పరాత్పరతరో బ్రహ్మ తత్పరాత్పరతో హరిః యత్పరాత్పరతః శంభుః తన్మేమనశ్శివ సంకల్పమస్తు' శివుఁడే పరాత్పరుఁడనియు శివసంకల్పోప నిషత్తుయందుఁ జెప్పఁబడినది.

స్కాందమహాపురాణమున 'బ్రాహ్మణానాం శివోదేవః। శివోఽగ్నిః కర్మదైవతం శివఏవ పరబ్రహ్మశివోవేదః శివోగతిః। శివో గురుర్జగతాంశివః పశుపతిఃప్రభుః। శివాంగభూతాః విష్ణ్వాద్యాః తస్మాద్విప్రశ్శివంయజేత్' సమస్తమును శివస్వరూపమైయున్నది. శివునినుండియే విష్ణ్వింద్రాది సమస్తదేవతులును జనించిరి. సర్వమునకుఁ గారణమై బ్రాహ్మణ దైవమగు శివుని సదా యర్చింపవలయు ననియు నాదిత్య పురాణమున 'బ్రహ్మవిష్ణ్వర్క శక్రాగ్ని ధర్మదైత్య పురోగమాః సురాసురా స్సంప్రసూతా స్వత్తస్సర్వేమహేశ్వర బ్రహ్మ విష్ణు సురేశానాం స్రష్టాయః ప్రభురవ్యయః బ్రహ్మాదయః పిశాచాన్తాః యస్య కింకరతాంయయుః' మహేశ్వరా! నీవలన బ్రహ్మ విష్ణ్వాదులును శక్రాది దిక్పాలకులునుఁ బుట్టిరి. బ్రహ్మాది పిశాచాంతగణమంతయు నీకింకరులైయున్నారు. నీవు ప్రభుఁడవు నవ్యయుడవై యున్నావని శివునికిఁగల సర్వాధిక్య సర్వకారణత్వ సర్వజ్ఞత్వ సర్వాధీశ్వరత్వములు ప్రశంసింపఁబడియున్నవి.

'ఏకఏవమహావిష్ణుశ్శివ జ్ఞానమహోదధిః' శ్రీ విష్ణువొకఁడు మాత్రమే శివజ్ఞానమును గుర్తెగియున్నాఁడని శ్రీ మహావిష్ణువు యొక్క శివోపాసనాదృఢత్వము ప్రశంసింపబడుటయు సత్యసంధునకు వరదానానంతరమున 'నాహంసంసారమగ్నానాం సాక్షాత్సంసారమోచకః। బ్రహ్మాదిదేవతాశ్చాన్యాః నైవసంసారమోచకాః। శివ

ఏవహి జంతూనాం మహాసంసార వర్తినాం। సంసార మోచకః సాక్షాత్ సర్వజ్ఞ స్సాంబ ఈశ్వరః। అతఃపూర్ణప్రసాదాయ సత్యసంధ మమప్రియ। మహాదేవం మహాత్మానం భజకారుణికోత్తమం' నేను గాని బ్రహ్మాదులుగాని నిన్నుఁదరింపఁజేయుగల శక్తిగలవారము కాము అట్టి శక్తిమంతుఁడంబికాధవుఁడును, సర్వజ్ఞుఁడును మహాదేవుఁడునగు నీశ్వరుఁడొక్కఁడే. సత్యసంధా! ఆమహనీయుని ముక్తికై ప్రార్థింపుమని నారాయణమూర్తి సెలవిచ్చినటులను - సూతసంహితయందుఁ బ్రసక్తింపబడినది.

స్కాంద మహాపురాణ కాళికా ఖండమందలి వ్యాసవిష్ణు సంవాదమున విష్ణువచనమిట్లు గలదు. 'కర్తాహం సర్వజగతాం మమకర్తా మహేశ్వరః। తస్యదేవాదిదేవస్యకర్తా కోపినవిద్యతే యజ్ఞకర్తాచ దేవేంద్రః, వేదకర్తాచ వాక్పతిః। అహమేవ జగత్కర్తా మమకర్తా। మహేశ్వరః। వర్ణానాం బ్రాహ్మణోదేవో। బ్రాహ్మణానాంచ దేవతాః। దేవతానాం మహాదేవో దేవోస్మాకం మహేశ్వరః।' నేను సర్వమునకుఁ గర్తను - నాకు మహేశ్వరుఁడు కర్త। ఆమహాత్మునకుఁ గర్తలేడు. యజ్ఞకర్త శచీపతియు వేదకర్త బ్రహ్మయు నేను జగత్కర్తయు నగుచున్నాము. నాకు మహేశ్వరుఁడే కర్త. వర్ణములకు బ్రాహ్మణుఁడును బ్రాహ్మణులకు దేవతలును. నాకును దేవతలకును శివుఁడే కర్తయైయున్నాఁడు.

'లోకనాథ పరానంద నిత్యంమే వర్తతేమతిః। వాసుదేవ పరా దేవవాఙ్మనః కాయకర్మభిః। యథాత్వం దేవదేవస్య భవస్య పరమాత్మనః। తథాభవామ్యహం విష్ణోతవదేవ జనార్దన' వాసుదేవా! నాచిత్తము మనోవాక్కాయ కర్మములు యుష్మత్పరాయణములై యున్నవి. తామెట్లు పరమాత్మయగు బరమేశ్వరునకుఁ బరమ భక్తులై యుంటిరో, ఓజనార్దనా! నేను నట్లేయున్నానని లింగ పురాణోత్తరభాగమునఁబంచ మాధ్యాయమున భక్తశిఖామణియగు

ష్ణుఁడు వాసుదేవునిఁ బ్రార్థించినటులఁగలదు. పూర్వోక్తమగు
గముల వలనఁ బరమేశ్వరునియందు శ్రీ మహావిష్ణువునకుఁగల
ర్ణమగు భక్తిభావము ప్రకటితమగుచున్నది.

మహాభారత సౌప్తిక పర్వమున 'అహం యథావ దారాధ్యః
క్లిష్టకర్మణా। తస్మాదిష్టతమః కృష్ణా దన్యో మమ నవిద్యతే'
ాధిగా నన్నారాధించిన నక్లిష్టకర్ముఁడగు కృష్ణునికంటె నాకిష్టు
లేరను నీశ్వరవచనమున శ్రీకృష్ణునకు శివుని యందుఁగల
భావము తెల్లమగుచున్నది. మఱియు భగవద్గీతయందు.
సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి భ్రామయన్ సర్వ
యంత్రా రూఢానిమాయయా। తమేవ శరణంగచ్ఛ సర్వ
భారత' ఓయర్జునా! సర్వభూత హృదయ కమలములనుండి
యచే నీ భూతజాలమంతటి నీశ్వరుఁడు త్రిప్పుచున్నాఁడు.
శ్వరుని సర్వవిధముల శరణువేడుమని శ్రీకృష్ణ భగవానుఁడుప
తనయాత్మ నిశ్చయమును లోకమునకుఁ బదర్శించెను. భారత
వలి ద్రోణపర్వమునను "ఈశానం వరదం పార్థ దృష్టవానసి
। తంగచ్ఛ శరణం దేవం వరదం భువనేశ్వరం తస్మైనమస్తు
తు దేవా స్తిష్ఠంతుశ్చ దివి! యేచాన్యే మానవాఃలోకే యేచ
నరాః। యేభక్తా వరదం దేవం శివంరుద్ర ముమాపతిం।
భావేన సదా సర్వేశం సముపాసతే' పార్థా! వరదుండు
ండునగు శంకరునిఁ గాంచితివి. భువనేశ్వరుఁడగు నాతనినే
ొమ్ము. ఆ పరమేశ్వరుని నమస్కరించుచు దేవత లంత
ననున్నారు. ఏనరులు స్వర్గమును జయించువారలో వారెల్ల
వరదుఁడును మాపతియు సర్వేశ్వరుఁడగు శివుని ననన్యభక్తి
మున భజింపుచున్నారని పార్థునకు వ్యాసుఁడుపదేశించి యుసం
వనోకాంతేయా! 'ప్రపద్యే శరణం దేవం శరణ్యం చీరవాసినం'

నేను మహాదేవుఁడగు శివునే శరణము వేఁడుచున్నానని వచించుట
శిష్టులకు గల దృఢతమమగు శివప్రపత్తి నిరూపింపఁబడుచున్నది.

'నామతశ్చార్థతో వాపి మహాదేవో మహేశ్వరః। త
కేవలందేవాః మహాదేవ నతేనఘాః। మహాదేవం వినా యో
భజతే శ్రద్ధయాసహ। నాస్తితస్య వినిర్మోక్షః సంసారా జన్మ కోటిశ
నామార్థముల రెంటను మహేశ్వరుఁడే మహాదేవుఁడని చెప్పఁబడు
ఇతర దేవతలందరును కేవలము దేవశబ్దవాచ్యులు ఎవరు మహాదే
వీడి నన్ను మాత్రమే సేవింపుచున్నారో వారు జన్మ కోటిశతం
కైనను విముక్తులు కానేరరని సూత సంహితయందలి యజ్ఞవై
ఖండమున విష్ణువచనము పరమేశ్వరు సర్వాధిక్యతను దెలియఁజే
చున్నది

శైవసిద్ధాంత శిఖామణి యందీయర్థమే 'శివఏవ సమస్తా
శరణ్యశ్శరణార్థినాం। సంసార రోగ దష్టానాం సర్వజ్ఞ స్సర్వదో
శరణార్థులందఱకు శివుఁడే శరణ్యమగునని చెప్పఁబడియె

కవికులమండనుఁడగు కాళిదాస మహాకవి 'మహేశ్వర త్ర్య
బక ఏవనాపరః' మహేశ్వరుఁడు త్ర్యంబకుఁడగు నీశ్వరుఁడే యను
ప్రాయమును వెలిబుచ్చెను. ఆచార్యశంకరులు "సాంబోనః కు
దైవతం" అంబికాధవుఁడగు నీశ్వరుఁడే మా బ్రాహ్మణకులమున
దైవతమనియు క్షుద్రఫలప్రదాతలగు దేవులనేకులున్నారు; స
మందయిన వారిచ్చు ఫలములఁగాని వారలఁగూర్చిగాని నేనాసించు
లేదు; ఈశ్వరా! బ్రహ్మవిష్ణ్వాదులకు సహితము లభ్యము ప భవ
పాదభజనము మాత్రమే యాచింపుచున్నాను;' 'యథాబుద్ధిశ్శు
రజతమితి కాచాశ్మని మణిర్జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలి
తథా దేవభ్రాంత్యా భజతి భవదవ్యం జడమతిః మహాదేవేశం తా
నసి చ సమత్వా పశుపతే' ఓ యీశ్వరా! ముత్యపుగుల్లను
రింతి...డను - గాజుపెంకును రత్నమనియు - పిండినీటిని పాలని

నెండమావులను జలమనియు లోకము భ్రమించులాగున మూఢుడు నీకంటె నితరుని మహాదేవుడని భ్రమచెందుచున్నాడనియును వచించి 'సత్యంబ్రవీమ్యఖిలలోకహితం బ్రవీమి సారంబ్రవీమ్యుపనిషద్ధృదయం బ్రవీమి సంసారముల్బణమసారమవాప్యజంతోస్తారోయ మీశ్వరపదాంబురుహాస్యసేవా' సర్వహితమును సత్యమును నుపనిషద్ధృదయమును జెప్పుచున్నాను, అసారమగు సంసారబంధితులకు నీశ్వరపాదసేవనమే తారకమని స్మరించి, లోకమును శాసించియుండిరి.

"విష్ణ్వాదిదేవసంఘానాం రక్షకత్వాత్సదాశివః" విష్ణ్వాది సర్వదేవతలకును రక్షకుడగుట సదాశివుడయ్యెనని క్రియాసారమునం గలదు.

సాయణాచార్యులవారును 'శివఃకల్యాణరూపస్స్వయం నిష్కల్మషః' యని శివుని నిష్కల్మషుడగు కల్యాణ స్వరూపునిగం దెలిపియున్నారు.

కూర్మపురాణమున 'సేతుమధ్యే మహాదేవమీశానం కృత్తివాససం। స్థాపయామాస వై లింగం పూజయామాసరాఘవః। తస్య దేవో మహాదేవః పార్వత్యా సహశంకరః। ప్రత్యక్షమేవ భగవాన్ దత్తవాన్ వరముత్తమం' 'సేతుమధ్యమున శ్రీరాముడు పరమాత్మయగు శివలింగమును స్థాపించి పూజించి యిష్టార్థముల నందినటులం దెలుపబడియున్నది. మఱియు నీయర్థమే పద్మపురాణమున 'రామః పుష్పకాదవరుహ్య మహాదేవం ప్రతిష్ఠాపితవాన్ సోస్మైప్రసన్నోభూత్' పుష్పకమునుండి దిగి శ్రీరాముడు శివలింగమును బ్రతిష్ఠించెను. పరమేశ్వరుడు ప్రసన్నుడయ్యెననియు వచింపబడినది. వాల్మీకమునందు నీయర్థమే 'అత్రపూర్వం మహాదేవః ప్రసాదమకరోత్ప్రభుః' అని గలదు. మఱియు నందే 'నాన్యం పశ్యామిభైషజ్య మంతరేణ వృషధ్వజం। నాశ్వమేధాత్పరోయజ్ఞః ప్రియుశ్చైవమహాత్మనః' వృషధ్వజుడగు శివుని విడచి సంసారవైద్యునితరునిం జూడను. అట్టిమహాత్ము

నకు నశ్వమేధముకన్న ప్రియమగు యజ్ఞములేదని తానాచరిం
యశ్వమేధముచేత శివుఁడే యారాధనీయుఁడను దనయాశయ
శ్రీరామచంద్రుడు ప్రకటించినటులఁ బ్రదర్శింపఁబడియెను.

'వృక్షస్యమూలసేకేన శాఖాః పుష్యంతి వైయథాతథా
స్యధ్యానేన దేవా స్తృప్తాభవంతిహి' వృక్షమూలమును దడుపు
దచ్ఛాఖలన్నియుఁ బుష్పించునటుల శివధ్యానముచేతనే సకలదేవత
తృప్తినొందుదురనియు 'సర్వాననశిరోగ్రీవః సర్వభూతగుహాశ
సర్వవ్యాపీచ భగవాన్ తస్మాత్సర్వగతశ్శివః' యని శివుని సర్వవ్యా
కత్వమును గూర్చియు శివమహాపురాణమునఁ జూడంబడుచు
మాండూక్యోపనిషత్తు 'చతుర్థం మన్యంతే శివమద్వైతం' శివునిఁ
యునిగను నద్వైతునిగను వచించినది. ఈతనికంటె నుత్కృష్టుఁడ
వాడులేఁడు. ఈమహాత్ముఁడే సర్వాధిపతి. ఆదిత్యమండలాంతర్గతుం
తమస్సుకంటెఁ బరమందు వసింపువాడునై యున్నాడు.

ఆదిత్యపురాణమందలి వర్ణాశ్రమధర్మ వివేచనమందు 'వి
శ్వేశ్వర ముమాకాంతం విశ్వాంతర్యామినం శివం। నబ్రహ్మాద్యైస్స
బ్రూయాత్' ఉమాకాంతుఁడును విశ్వాంతర్యామియునగు శి
బ్రహ్మాదులతో సముఁడని వచింపఁదగదని పరమేశ్వరుని సర్వాధిక
ప్రకటింపఁబడెను. కల్పభేదంబులచే బ్రహ్మాదులకంటె రుద్రున
జెప్పంబడిన హీనభావము సంహారరుద్రుని విషయమును - సంహా
రుద్రుని యవతారవిశేషములగు నీలలోహితాది రుద్రవిషయము
నగును.

అట్టిహీనతయు బ్రహ్మాదుల ననుగ్రహించుటకే ప్రవర్తిం
యుండెను గాని రుద్రమూర్తులకు బ్రహ్మాదులకంటె హీనభావ
ప్రకటించువిషయమునకై యగుటలేదు.

శివమహాపురాణమున విద్యేశ్వరసంహితయందు అనంతం
ననిర్వాచ్యంబు నక్షయమునగు పరబ్రహ్మమే ప్రవృద్ధమంబున శి

నామంబునఁ బ్రసిద్ధంబయ్యెను. ఆతడే విష్ణు మొదలగువారిని సృజించి పాలించుచుండును. భక్తోపచార గ్రహణంబునకా దేవుడు రుద్రాది నామంబుల విఖ్యాతుండయ్యెను. భక్తవత్సలుఁడగు నారుద్రుఁడు సాక్షాచ్ఛివరూపంబగుచున్నాఁడు. బ్రహ్మ మొదలుగ జనియించిన వారందఱును కాలానుసారంబుగ లయమందుదురు గాని రుద్రుండు మాత్రమట్లుగాక శివునియందు విలీనుఁడగును. బ్రహ్మాదులు కేవల ప్రకృతియందే లయముగాంతురు. రుద్రుండు బ్రహ్మాదులతోఁ గలసి లయుండుగాడని శ్రుతిప్రసిద్ధము. సమస్తలోకములు రుద్రుని భజియించునుగాని రుద్రుఁడెవ్వరిని భజియించుటలేదు. మరియు నీవిషయమునుగూర్చియే శివపురాణమునజ్యోతిర్లింగ ప్రాదుర్భావసందర్భ కథనమున ప్రసన్నమూర్తియగు శివుఁడు 'ఓవిష్ణూ! ప్రజాపతీ! మీరు కలహమునువీడి కారణకారణుండనగు నన్ను శరణము వేడుటచే నేను మీయెడఁబ్రసన్నుండనయితి నిజము చెప్పుచున్నాను మీరుభయులును ప్రకృతినుండి వెలువడి మరియు నందెలయమందుచున్నారు మహేశ్వరుఁడు మాత్రమట్లగుటలేదు ఆతడు నాయంశమగుట నాయందే చూడబడి నాయందే చేరుచున్నాడు నేనే సర్వమునకును ప్రభువును నాశక్త్యంశమే 'ఉమ' యగుచున్నది నేతురీయుఁడనై చతుర్థంమన్యంతే శివమద్వైతం మొదలుగాగల మహావాక్యాదుల నిక్కారణమునఁ గీర్తింపబడుదునని చెప్పినటుల గలదు.

సృష్టిస్థితిలయకారణత్వము బ్రహ్మ విష్ణు రుద్ర సాధారణమే యయినను పంచకృత్య కారణత్వము పరమేశ్వర సాధారణ లక్షణమై యున్నది. త్రిమూర్తులకుఁగల సృష్ట్యాది యేకైక కారణత్వము పరమేశ్వరునిచే నాజ్ఞారూపమున దత్తమయినదియు పంచకృత్యంబులు పరమేశ్వరునకు స్వతస్సిద్ధంబులు నగుచున్నవి.

ప్రకరణవిభాగముల ననుసరించి రుద్రాదిశబ్దములతోఁ జెప్పఁబడిన విష్ణ్వాదులకంటె శివునకుగల హీనత నీలలోహితాది రుద్రుల

విషయమును- ఈశానాదికములగు శబ్దములతోఁ జెప్పంబడిన మోక్షప్రదత్వ-సర్వజ్ఞత్వ-సర్వాధికత్వాదు-లుపరశివవిషయములుగ శాస్త్రములందు సమన్వయింపబడి సార్థకములగుచున్నవి. నారాయణాద్రుద్రోజాయత' ధ్యాయీతేశానం' మొదలుగాగలవాక్యసంచయము లిట్టివిషయమున కుదాహరణములు.

శైవసిద్ధాంత దీపికయందు బ్రహ్మము సమస్తమగు సంసార దోషములు లేనిదియు, సకలమాంగళ్యగుణముల కాధారభూతమైనదియు నగును. ఇట్టి బ్రహ్మమే జగమునకు నిమిత్తకారణము నుపాదానకారణము నగును. సూక్ష్మచిదచిత్తులతోఁ గూడిన బ్రహ్మము కారణంబును, స్థూలచిదచిత్తులతోఁ గూడిన బ్రహ్మము కార్యంబు నగును. ఈజగత్తుపరమేశ్వరునకు శరీరమగును. పరాశక్తి చేతనా చేతనాత్మకమగు సకలప్రపంచమైయున్నది అట్టి పరమశక్తికలిగిన పరమేశ్వరుఁడొక్కఁడే యుండునని నీలకంఠాచార్యులవారు సిద్ధాంతీకరించి యుండిరి.

చంద్రజ్ఞానాగమమున 'బిందునాదాత్మకం సర్వం జగత్థ్సావర జంగమం| బిందుశ్శక్తిః శివోనాదః శివశక్త్యాత్మకం జగత్' జంగమ స్థావరాత్మకమగు సకల జగంబును బిందునాదరూపమేయగును. బిందువు శక్తియు నాదమే శివుఁడగుట జగమంతయు శివశక్త్యాత్మకమై యున్నది. నాదాధారమునంది బిందువును-బిందువే జగమునకాధారము నగును. కాన బిందునాదములు జగమున కాధారములగును. బిందునాద సమ్మేళనమున జగమేర్పడుచున్నది గాన బిందునాదాత్మకుఁడగు శివుఁడే జగత్కారణమని చెప్పఁబడుచున్నది.

'ఆదిదేవస్య శంభోశ్చ పురాణపురుషస్యచ| తస్యశక్తిర్గుణమయీ రజస్సత్వతమోన్వితా| ఆదిశక్తిర్మహామాయా సచ్చిదానంద రూపిణీ| చిన్మయీచిత్ప్రిభాశాంతా శంకరస్యానపాయినీ| శక్తిస్సాక్షా న్మహాదేవీ మహాదేవస్సశక్తిమాన్| తయోర్విభూతిలేశోవై సర్వమేత

చ్చరాచరం। యథాశివస్తథా దేవీ యథాదేవీ తథాశివః। నానయో
రంతరం వింద్యాచ్చంద్ర చంద్రికయోరివ। చంద్రోఽప్యఖిలు భాత్యేవ
యథాచంద్రికయావినా। నభాతివిద్యమానోపితథా శక్త్యావినాశివః।
ఏవం పరస్పరాపేక్షా శక్తి శక్తి మయోస్థితః। శివేన నవినాశక్తిః నశ
క్త్యాచ వినాశివః, యమాహురఖిలేశస్య తై స్తైరనుగుణై ర్గుణైః। స
మానధర్మిణీ సైవశివస్య పరమాత్మనః। సైకాపరాచచిద్రూపశక్తిః
ప్రసవధర్మిణీ। విభజ్యబహుధావిశ్వం విదధాతి శివేచ్ఛయా”

మహాదేవుడు శక్తిమంతుఁడు మహాదేవి సాక్షాచ్ఛక్తిస్వరూపిణి। చరాచరంబగు జగంబంతయు వారలవిభూతిలేశము. శివశక్తులకుఁ జంద్రకౌముదులంబోలె నెట్టిభేదంబునులేదు. అట్టి శివశక్తియగు నద్వితీయ పరాశక్తి యాద్యాశక్తి నామంబునఁ బ్రసిద్ధమయినది. ఆశక్తి శివునికనురూపగుణంబులచే విభూషితయై యుండుటచే శివసహధర్మిణిగా నాశక్తినిఁబండితులు ప్రశంసించుచుందురు. అద్వితీయయు చిత్స్వరూపియు ప్రసవధర్మిణియు పరాస్వరూపిణియునగు నాశక్తి శివేచ్ఛాక్రమంబున విశ్వంబును బహువిధంబులుగ రచించుచుండును. అదియే మూలప్రకృతి. అదియే త్రిగుణాత్మకయగు మాయ అదియే సహస్రానేకంబులగు రూపంబుల భాసిల్లుచు పరమేశ్వరు నాజ్ఞాస్వరూపిణి యగుచున్నదని శివపురాణమునఁ గలదు.

మూలప్రకృతిశివాశ్రియయ్యు పశులోకంబున మాయయనఁ బ్రకాశింపుచు ప్రకృతి ప్రధానావ్యక్త మాయయనెడు నామంబులు గలిగి యణురూపమయ్యు నఖిలాత్మలకుపాదానకారణంబై యనభివ్యక్తయయ్యు నిమిత్తంబుల నభివ్యక్తమై వెలుంగునని స్కాందమహాపురాణమున గలదు,

శక్తియందు పరమాత్మాంశ ముండుటచే నది పరాశక్తి నామముకలది యగుచున్నది. ఆశక్తియే యీశ్వరేచ్ఛానో విశ్వసృష్టి గావించునని శివపురాణమున గలదు. ‘పరాస్యశక్తిర్వివిధంబున

విధైవశ్రూయతే స్వాభావికీజ్ఞానబలక్రియాచ' ఈశ్వరునందలి స్వాభావికయు, జ్ఞానబలక్రియారూపియునై యున్నది. పరాశక్తి ప్రే బుననే యిచ్ఛాశక్తి కార్యాకార్యనియమంబు సేయుచుండును. శక్తి యిచ్ఛాశక్తి సంబంధములగు కార్యకరణ ప్రయోజనంబు సాధింపుచుండును క్రియాశక్తి యిచ్ఛాశక్తిననుసరించి జగత్కా ములం గల్పింపుచుండుననియుం గలదు.

కూర్మపురాణమున 'వ్యోమసంజ్ఞా పరాకాష్ఠా జ్ఞానరూ లాలసా। స్వాభావికీచ తన్మూలాప్రభా భానోరివామలా। ఏకామహే శ్వరీశక్తి రనేకోపాధియోగతః। పరాపరేణరూపేణ క్రీడతేతస్య సన్ని సేయంకరోతి సకలం తస్యాకార్య మిదంజగత్। నకార్యం నాపికర యీశ్వరస్యేతిసూరయః అనయాపదయా దేవస్స్వాత్మానందం శ్నుతే। తయాసర్వమిదం ప్రోతమోదం చైవాఖిలంజగత్। ఏకా శ్శివాకారాశక్తి మానుచ్యతేశివః। శక్తిశక్తి మతోరైక్యంవదంతి మాత్మనః। అభేదం చానుపశ్యంతి యోగినస్తత్స్వచింతకాః।' వ్యో సంజ్ఞ గలిగి పరాకాష్ఠయు జ్ఞానరూపాతిలాలసయునగు స్వాభావకి సూర్యునియొక్క స్వచ్ఛమగు కాంతివలె యీశ్వరుండే కారణము గలది యగుచున్నది. ఆయొక్కటియగు మహేశ్వరీశక్తియే యనే యుపాధిసంబంధముల ననుసరించి పరాపరరూపములచేం బరమే సన్నిధియందు విరాజిల్లుచున్నది. సమస్తమూశక్తియే చేయుచున్న ఈసర్వప్రపంచము శక్తియొక్క కార్యస్వరూపమేయగును కార్యక ములు పరమేశ్వరునకు (స్వప్రయోజనములకు) గావు. ఈపరా వలననే యీశ్వరుడు స్వాత్మానందమనుభవించుచున్నాడు. శక్తిచే సమస్తజగము సంరక్షింపంబడుచున్నది. శక్తి శివాకారము గ శివుండు శక్తిమంతుండు శక్తికి-శక్తిమంతునకు నైక్యమున భేదము పరమేశ్వరోపాసకులగు యోగీశ్వరులు చెప్పుచున్నారు.

పరిమళము వీడి పుష్పముండనటుల శక్తిరహితుండై శివుండు లేడు. స్వశక్తిక్షోభమాత్రమున లీలాభిముఖుండైన శివునిచేఁ బ్రేరేపింపఁబడిన పరాశక్తి కార్యములఁ జేయుచున్నది. లీలాంతమునం దయ్యది యాశివతత్త్వముననే లీనమగుచున్నది. కాలయోగమున బీజమెటుల యంకురించి పల్లవించి పుష్పించి ఫలించుచు ననేక విధములుగఁ గన్పడుచున్నదో యటులనే శివునియందు శక్తియోగమున ననంతములగు మూర్తులు ప్రకాశింపుచున్నవి. తత్త్వమొక్కటి యయ్యు చిత్రములగు ననంతశక్తులఁగూడి శివసంజ్ఞ కలదియై ప్రకాశింపుచున్నది. ఇద్దాననే భేదంబు లనేకములు గల్పింపఁబడినవి.

శివజ్ఞానశేఖరమున 'రాజులకు భుజశక్తియు - బలవంతులకు బలశక్తియు నెటుల స్వతస్సిద్ధముగానున్నదో యటులనే యీశ్వరునకుఁగూడ స్వతస్సిద్ధమగు శక్తిగలదు. శక్తిచలనముఁగలిగిన వెంటనే సృష్టిలీలాభిముఖుండైన శివునిచేఁ బరాశక్తి ప్రేరేపింపఁబడి సర్వకార్యములను జేయును. ఎపుడాతని లీల యంతమగునో యపుడాతని యందది లీనమైయుండునని గలదు.

'మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం' ప్రకృతి మాయాస్వరూపిణి. ఇట్టి మాయగలవాఁడే శివుఁడని చెప్పఁబడెను. సర్వమును దానయై తన మాయాబలముననే పరమేశ్వరుఁడు సమస్తమును ద్రిప్పుచున్నాఁడనుట నిర్వివాదాంశము.

సకల కల్యాణగుణాంబుధియు ననంతమహిమాన్వితుండును విశ్వాధికుండును విశ్వతోముఖుండును విశ్వతశ్చక్షుండును విశ్వతోహస్తుండును విశ్వనాథుండును సర్వజ్ఞుండును సర్వకర్తయు సర్వపూర్ణుండును పరంజ్యోతియు పరబ్రహ్మయు లింగస్వరూపియు పంచకృత్యపరాయణుండును అనాదిమలముక్తుండును వ్యాపకమూర్తియు పశుపాశహర్తయు పతియు కార్యకారణుండును షడధ్వాతీతుండును॥ నగు

పరశివుడు శివ సదాశివ మహేశ్వర తత్త్వభేదమున లోకానుగ్రహార్థము ధ్యానయోగ పూజాదులకై మూడువిధములగుచున్నాడు.

అందు శివతత్త్వము నిష్కలమనియు - సదాశివతత్త్వము సకలనిష్కలమనియు - మహేశ్వరతత్త్వము సకలమనియు వచింపబడెను. శివతత్త్వ మొకవిధమనియు - సదాశివతత్త్వ మయిదు విధములనియు మహేశ్వరతత్త్వ మిరువదియైదు విధములనియు జెప్పబడినది. ఈ ముప్పదియొక్క తత్త్వములును పరశివునియందు నాభావముననున్న శక్తిక్షోభమాత్రమున సహస్రాంశగలిగి పరశక్తియు - పరాశక్తి సహస్రాంశమున నిచ్ఛాశక్తియు ఇచ్ఛాశక్తి సహస్రాంశమున జ్ఞానశక్తియు - జ్ఞానశక్తి సహస్రాంశమున క్రియాశక్తియు జనించినవి.

ఈశక్తి పంచకమునుగూడి షట్త్రింశత్తత్త్వములుగ వచింపబడెను. సదాశివతత్త్వము సదాశివ - ఈశ - బ్రహ్మేశ - ఈశ్వర ఈశాన భేద ముల పంచవిధంబులు. ఇవియే శివసాద - అమూర్తసాద - మూర్తసాద - కర్తృసాద - కర్మసాదములనంబడు. సాదవ స్వరూపమగును. కర్మసాదము పూర్వముఖమగు తత్పురుషరూపమనియు - కర్తృసాదము దక్షిణముఖమగు అఘోరస్వరూపమనియు మూర్తసాదము పశ్చిమముఖమగు సద్యోజాత రూపమనియు అమూర్తసాదముత్తరముఖమగు వామదేవ ముఖమనియు - శివసా మూర్ధ్వమగు ఈశాన రూపమనియు నుడువంబడియెను. పంచవక్త్ర సహితమై పంచస్వరూపమగునదియే సదాశివతత్త్వమగును.

మహేశ్వరతత్త్వ మిరువదియైదు విధములు. ఈతత్త్వము త్రినేత్రము ఏకముఖము సర్వాభరణములుకలిగి మహేశ్వరుండ చెప్పంబడును. చంద్రధారణ - ఉమామహేశ్వర - వృషభవాహ నటేశ్వర - వైవాహిక - భిక్షాటన - కామారి - కాలారి - త్రి రారి - జలంధరారి - గజారి - వీరభద్ర- హరిధ్వంసి - అర్ధనారీశ్వర

కిరాత-కంకాళధర- చండీశానుగ్రహ - విషాపహరణ - చక్రప్రదాన - విఘ్నప్రసాద - ఉమాస్కంద-ఏకపాద - సుఖావహ-దక్షిణామూర్తి - ఉరులింగోద్భవములను పంచవింశతి లీలల నీ మహేశ్వరుఁడు ధరించెను.

ఇద్దానసే జీవభావని వృత్తిద్వారా పరమేశ్వరాను సంధానమునకై నాదబిందుకళావిధాన రూపకమున విధింపబడిన శివమేధమునందునుపితృపితామహ ప్రపితామహవృద్ధ ప్రపితామహులు మహేశ్వర, సదాశివ శివ పరశివులను నాల్గువ్యూహములుగ నెన్నబడి క్రమముగ మహేశ్వరాది పితలు పరశివతత్త్వము నలయింపఁబడుట ద్వారాచతుర్థ పురుషనివృత్తి సూచింపఁబడుచున్నది. ఈయర్థమే.

చంద్రజ్ఞానాగమమున పితరస్త్వర్మహేశశ్చ సదాశివశివా, మహేశ్వర సదాశివశివులు పితృపితామహ ప్రపితామహులగుచున్నారనియు, తత్త్వసంయోజనమున మృతునకు మహేశ్వరత్వాదులు సిద్ధించుననియు, పరశివతత్త్వ సంయోజనమున చతుర్థ పురుషుఁడు నివర్తించుననియు, గలదు. నాదబిందు కళావిధానమనగా అంగము బిందువు నాదము లింగము లింగాంగసంయోగమే కళయగుచున్నది.

మహేశ్వరుడిరువదియైదు తత్త్వములును నిరువదియారు కళలను, సదాశివుడు పదితత్త్వములునుఁ బదునొకండు కళలను, శివుండొక్క తత్త్వంబును నొకేకళయుఁ గలిగియుందురని శైవాగమముల చెప్పంబడుచున్నది.

'అథర్వశిరమునందు 'కింతద్ధ్యానం - కోవాధ్యాతే - కశ్చధ్యేయః' అను ప్రశ్నలకు సమాధానరూపకమగు 'ధ్యాయీతేశానం ప్రధ్యాయితవ్యం సర్వమిదం బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాప్రసూ ప్రసూయంతే సర్వాణి చేంద్రియాణి సహభూతైర్న కారణం కారణానాం ధ్యాతాకారణంతుధ్యేయః సర్వైశ్వర్యశ్శంభురాకాశమధ్యే...'...... ఈశానునేధ్యానము చేయవలెను సర్వ ప్రపంచమును బ్రహ్మ విష్ణు

రుద్రేంద్రాదులు. నాతనివలననే గలుగుచున్నారు. అతఁడెవరి వల్లను బుట్టుటలేదు, సర్వేశ్వరుఁడగు నాతఁడే హృదయాకాశమున ధ్యానింపఁదగినవాఁడు. అన్యదేవతలనువీడి యతనినే ధ్యానింపుఁడని వివరింపఁబడినది.

## పతిపశుపాశ వివరణము

'బ్రహ్మాద్యాస్స్థావరాంతశ్చ దేవదేవస్యశూలినః। పశవః పరికీర్త్యంతే సంసారవశవర్తినః। తేషాం పతిత్వాద్దేవేశః శివః పశుపతిస్స్మృతః। మలమాయాదిభిః పాశైః సంబధ్నాతి పశూన్ పతిః। సఏవమోచకస్తేషాం భక్తానాం సముపాసితః।' సంసారవశవర్తులగు బ్రహ్మాది స్థావరపర్యంతముగల సకల జీవులును మహాదేవునకుఁ బశువులని చెప్పఁబడుదురు. వారికందఱికిని బతిగావున నీశ్వరునకుఁ బశుపతినామము ప్రసిద్ధంబైనది. శివుఁడు బ్రహ్మాది పశుసముదాయమునంతను మలమాయాది పాశములచే బంధించి తదుపాసితుండై తన భక్తులగువారి నాపాశములనుండి ముక్తులఁజేయుచుండు నని శివపురాణ వాయవీయ సంహిత యుందలి పాశుపత జ్ఞాననిరూపణమున వివరింపఁబడియున్నది.

ఈయర్థమే స్కాందపురాణ కాళికాఖండమునను 'బ్రహ్మాద్యాస్స్థావరాంతశ్చ పశవః పరికీర్తితాః। తేషాంపతిత్వాద్దేవేశః భవః పశుపతిస్స్మృతః' యని గలదు. 'ఏషామీశానో పశుపతిః పశూనాం చతుష్పదా ముతద్విపదాం రుద్రః పశూనామధిపతిః। ఉమాపతయే పశుపతయే' మొదలుగాగల శ్రుతిసంచయము మీశ్వరునకుంగల పశుపతిత్వమును ఘంటాపథముగ వెల్లడించుచున్నవి.

శివుఁడు పతియును-జీవుఁడు పశువును - పాశము బంధమునగుచున్నవి. సృష్టిస్థితి సంహారతిరోభావానుగ్రహములను నైదు కార్యములును పతికార్యములుగ శాస్త్రములయందు నిర్దేశింపఁబడియున్నవి.

వాయవీయ సంహితయందు 'అజడంచ జడంచైవ నియంతా చతయోరపి। పశుః పాశః పతిశ్చేతి కథ్యతేత్రితయం క్రమాత్। అక్షరంచ క్షరం చైవ క్షరాక్షరపరం తథా। తదేవం త్రితయంభూయః కథ్యతే తత్త్వవేదిభిః॥ పశువు అజడుఁడు అక్షరుఁడనియు పాశము జడముక్షరమునియు, పతియగు నియంతక్షరాక్షర పరుఁడును - పతియు నగుచున్నారని గలదు. పాశయుక్తోభవేజ్జీవః పాశముక్తోభవేచ్ఛివః॥ పాశబంధితుఁడు జీవుఁడు పాశముక్తుఁడు శివుఁడు నగుచున్నారు

ప్రపంచమునఁ దెలివిలేనిచో నెంతటివాఁడైనను బశువనియే యౌపచారికముగఁ జెప్పుచున్నారు. కాని స్వభావమువలననే యందఱు పశువులని వ్యవహరింపఁబడుదురు. పాశములచేఁ గట్టఁబడి స్వకర్మఫల మనుభవింపుచు ననాది మలములతోఁ గూడుకొని జడత్వమునొందుచుఁ గించిజ్ఞుఁడై పతిస్వాధీనుఁడై యుండువాఁడే పశువు. పరాఖ్య సూత్రమందుఁ బశులక్షణమిట్లు చెప్పఁబడినది. 'దేహాన్యో నశ్వరోవ్యాపీ విభిన్నస్సమలోజడః। స్వకర్మఫల భుక్కర్తా కించిజ్ఞస్సేశ్వరః పశుః' పశువు దేహముకంటె నితరుఁడు-నిత్యుఁడు-వ్యాపకుఁడు విభిన్నుడు-మలముతోఁగూడినవాడు-నజడుఁడు - తానుజేసిన సుకృత దుష్కృత భోగముల ననుభవించువాడును - కించిజ్ఞుఁడును-గర్తతోఁ గూడియుండినవాఁడు నగుచున్నాఁడు స్వాయంభువమునందు 'అచేతనో విభుర్నిత్యోగుణహీనో క్రియాప్రభుః। వ్యాఘాతభోగసక్తశ్చ శోధ్యోబోధ్యోకలః పశుః' చైతన్యరహితుఁడై-వ్యాపకుఁడై - నాశరహితుఁడై సత్వరజస్తమోగుణ కార్యములయిన సుఖదుఃఖ మోహములులేనివాఁడై సూక్ష్మకళారహితాత్ముఁడై-దేహేంద్రియాంతఃకరణాదులయందుఁ బ్రవృత్తి క్రియాశూన్యుఁడై మలశక్తిచే నిరోధింపఁబడిన జ్ఞానక్రియాశక్తి గలిగి (అనగా మలప్రభావాతిశయమున జ్ఞాన క్రియాశక్తి లేనివాఁడై) మలశక్తినిఁ బోఁగొట్టుటకుఁగాని శివత్వమును

వ్యక్తీకరించుటకుఁ గాని యసమర్థుఁడై - యీశ్వరానుగ్రహ శక్తి వ్యాపారమయిన దీక్షచే మలశక్తి నిరోధమును బోగొట్టి శోధించుటకును - శివత్వమును వ్యక్తీకరించి బోధించుటకును దగినవాఁడై పశుత్వమున జీవుఁడు ప్రవర్తింపుచుండునని పశుస్వరూపమిట్లు నిరూపింపఁబడినది.

విజ్ఞానాకలులు, ప్రళయాకలులు (కేవలులు) సకలులని బంధభేదముచే పశువులు త్రివిధములుగఁ జెప్పఁబడుచున్నారు. మలముతోఁ గూడినవారు విజ్ఞానాకలులును - మలకర్మములతోఁ గూడినవారు ప్రళయాకలులును - మాలమాయాకర్మలతోఁ గూడినవారు సకలులు నగుచున్నారు.

విజ్ఞానాకలులు మలసహితులు. మలరహితులు నని రెండు విధములుగనున్నారు. మలరహితులు నయోనిజులునగు అనంతేశాదులు వారలకు శివుండు విద్యేశ్వరత్వాధికారం బొసంగెను. ఇందలి మలయసహితులగు జీవాత్మలను బరమేశ్వరుఁడు మంత్రిస్వరూపులుగఁ జేయుచున్నాఁడు. కర్మయు-శరీరములేనట్టి కేవల మలరూపపాశబంధితులగు నీజీవాత్మలేడు కోట్లు మంత్రి స్వరూపులై యితర జీవాత్మలమీఁద కృపారసంబును జూపుచుందురు.

ప్రళయాకలులు:- ఆణవ-కార్మిక (మల-కర్మ) బంధబద్ధులై పక్వమలులు అపక్వమలులని రెండువిధములుగ నుందురు. అందు మలకర్మలు నశించిన పక్వమలులు ముక్తినందుచున్నారు. కొందఱు భువనాధిపత్యము బొందుదురు. ఇతరులగు నపక్వమలులు కర్మవశమునఁ బుర్యష్టకదేహముఁ సూక్ష్మదేహముతోఁ గూడుకొని సకల యోనులయందును జనింపుచుందురు. ఈపుర్యష్టకదేహము సృష్టి మొదలుకొని ప్రళయమువఱకుగాని మోక్షమువఱకుఁగాని యుండును.

సకలులు పక్వకలుషులు-అపక్వకలుషులు నని రెండువిధములగనున్నారు. ఇందు మలమాయాకర్మలు పక్వముచెందినవారలు

నూటపదునెనిమిదిమంది మంత్రేశ్వరులై యేడుకోట్ల మంత్రస్వరూపులయందధికారము కలిగియుందురు. నూటపదునెనిమిది మందిలో నూర్గురు రుద్రులును మండలేశ్వరు లెనిమిదిమందియు క్రోధేశ్వరుడు మున్నగు వారెనిమిదిమందియు శ్రీకంఠ వీరేశ్వరులిద్దరును గలరు. వీరేశ్వరుఁడు బ్రహ్మాండరక్షకులగు నూర్గురు రుద్రులకుఁ గర్త. అధోభువన కర్త శ్రీకంఠేశ్వరుడు. ఈమంత్రేశ్వరులకంటె భిన్నముగా నుండి మల-మాయాకర్మల పక్వముచెందిన వారలను పరశివుఁడు గురుమూర్తియై శక్తిపాతమునఁ బాశమును దొలగించి దీక్షనొసఁగి నుత్కృష్టమగు పదము నందించుచున్నాడు. మలమాయాకర్మల పరిపాకములేని యాత్మలను మలపరిపాకముకొఱకు నాపరశివుఁడు సర్వకర్మఫల భోగమునకై ప్రపంచమునందు మానవ యోనుల యందుఁ బుట్టించుచున్నాడు. విద్యారణ్యస్వామి సూతసంహితయందలి పాశుపతవ్రత మహాత్మ్య విషయిక దీపికా వ్యాఖ్యయందును పశు నిర్వచనమునుగూర్చి 'మలమాయా కర్మలక్షణ పాశబద్ధాజీవాః పశవః। తత్ర మలపాశమాత్రబద్ధా విజ్ఞానకలాః। తేద్వివిధాః। సమాప్తకలుషా అసమాప్తకలుషాశ్చ। ఆద్యావిద్యేశాః। ద్వితీయాస్సప్తకోటి మహామంత్రాత్మకాః। మలకర్మలక్షణ పాశద్వయబంధాః ప్రళయాః తేపిసకలకర్మణోః పరిపాకాభావా భావాభ్యాం ద్వివిధాః ఏషాం తత్పరిపాకోనాస్తితే కర్మవశా నానాయోనిషుజాయంతే। యేషాంతు మలపరిపాకోస్తి తేషుకేషువి దీశ్వరానుగ్రహాత్ భువనపతయోభవంతి। పాశత్రయబద్ధాస్సకలాది యోగాత్సకలాః తత్రాష్టాదశసంఖ్యాకా శ్శివానుగ్రహా త్తత్తన్మంత్రేశ్వరాః భవంతి। తత్ర శతరుద్రాః। మండలినోష్టౌ। క్రోధాదయోష్టౌ శ్రీకంఠ వీరేశౌ చేతి। తద్వ్యతిరిక్తానాం మధ్యేఏషాం మలత్రయ పరిపాక స్తానాచార్య రూపేణ శివపవదీక్షయా అనుగృహ్ణాతి। అపరిపక్వమలాంస్తు మాలపరి

పాకార్థం భోగార్థం నానా యోనిషువినియుంక్తే। ఏతే సర్వేపిపశవ
యిట్లు వచించియుండెను.

సకలులకు సంబంధించిన నూటపదునెనిమిది మంత్రేశ్వరులల
నూర్గురు రుద్రులును క్రోధేశ్వరుఁడు మొదలగు వారెనిమిది మ:
లేశ్వరులును వీరితో సమాను లెనిమిదిమంది వీరేశ్వరులును వీరే
రుఁడు శ్రీకంఠేశ్వరుఁడును గలరని శివజ్ఞానశేఖరమందుఁ దృతీం
ప్రకరణమునఁ జెప్పఁబడినది. పాఠాంతరమున 'శ్రీకరవీరేశౌ' అనుట
బదులుగా "శ్రీకంఠవిశ్వేశ్వరౌ' అని చెప్పబడియున్నది.

శివజ్ఞానశేఖరమందు 'పాశమనగా బంధము. శివానం
విర్భావమునకు విరోధియైన వస్తువు'గఁ జెప్పఁబడినది.

మలతిరోధాయిపాశము-శక్తిపాశము-బిందుపాశము - మాయ
పాశము- కర్మపాశము అని పాశము లైదువిధములు. గ్రంథా
ంతమున ఆణవ-కార్మి[illegible]యిక - మాయీయ - బైందములని ప
నామములు వచింపఁబడినవి. మలతిరోధాయి పాశమునకు ఆ
మలమనియు అనాదిమలమనియు శక్తిపాశమునకు మాయికమని
రోధశక్తియనియు నామాంతరములు. బిందుపాశము బైందవము
మాయాపాశము మాయీయమును కర్మపాశము కార్మికము న
చున్నవి.

జీవున కనాదినుండివచ్చు మలమే యాణవమలము. శివ
యిక జ్ఞానము గలిగినప్పుడు యీమలము (అనగా అజ్ఞానము) అ
నిని కప్పివేయుచు జీవులను దుష్కర్మలయందుఁ బ్రవేశపెట్టుచున్న
ఇదియే మలతిరోధాయిపాశము. ఈబంధము జీవులయొక్క స్వరూ
మును జ్ఞానక్రియల నావరించునదియై ప్రతిజీవునందు వేర్వేరుగను
స్వపాకాంతమున వ్యాపించునదియు ననేక శక్తిసహితమైనదియు ని
మైనదియు వ్యాపకమయినదియు జడద్రవ్యంబు నగును.

శక్తి పాశము:- శివేతరమగు వస్తువంతయు సత్యమను భ్రాంతిని గల్గించి జనన మరణాది దుఃఖముల ననుభవింపజేయును. అజ్ఞానమును వృద్ధిచేయునది యగుటవలన శక్తిపాశమని వ్యవహరింపబడుచున్నది. అగ్నియందు జ్వలనశక్తియు జలమందు శీతలశక్తియు తేజమందు ప్రకాశశక్తియు అంధకారమందు వస్తువును గప్పివుచ్చు శక్తియు నుండునటుల నీపాశమందజ్ఞానశక్తిగలదు. ఈశక్తి యాత్మయొక్క స్వరూపమును గప్పియుండును గాని రోధశక్తి'యనియుఁ జెప్పఁబడును. రోధశక్తి రూపమగు నీపాశము మాయీయము - కార్మికము-ఆణవము - బైందవమునను నాల్గు పాశములకు, అనాది ధర్మమునకును గారణమగును. శివశక్తియే ఔపచారికముగా పాశమని వ్యవహరింపఁబడుచున్నది.

బిందుపాశము:- మనస్సును పాపకార్యములందుఁ దగుల్కొనఁ జేయును. విషయసుఖములనిది కలుగఁజేయును. అనుభవింపఁదగిన భోగముల ననుభవింపఁజేయును. బైందవమను నీబంధము విద్యాతత్త్వమునకు విద్యేశ్వరులు మున్నగువారి శరీరమునకు గారణమై సకలులను జీవులయొక్క భోగమునకు సాధనమై సూక్ష్మము మొదలుకొని వైఖరిదనుకనున్న శబ్దమునకు హేతువునగును.

మాయాపాశము శివజ్ఞానమునుగాని శివభక్తినిగాని యెప్పుడు గల్గునటులఁజేయును. మాయీయమను బంధము 'కలమొదలుకొని పృథివివఱకు గల తత్త్వములు భువనములు - భువనపదార్థములునను నవియే, రూపముగాగలది

కర్మపాశము పెద్దలు చెప్పునట్టి సద్విషయముల విన నడ్డు పెట్టును జన్మమును భోగము నాయువును గర్మయే యొసఁగును. ఆధిభౌతికమని ఆధ్యాత్మికమని ఆధిదైవికమని కర్మకు మూడు సాధనములుగలవు. వీటికే తాపత్రియమనిపేరు. తాపత్రియరూపమగు నీకర్మ యనుభవించినగాని నశించదు. గ్రంథాంతరమునఁ గ

ఆగామిసంచిత ప్రారబ్ధములని మూఁడు విధములుగాఁ గన్పడుచున్నది. ఆగామిసంచితములు పుణ్యకర్మలవలన నశించునుగాని 'ప్రారబ్ధం భోగతోనశ్యేత్తని' యనుభవించినఁగాని ప్రారబ్ధము నశింపదు. కార్మికమను బంధము జ్యోతిష్టోమము మొదలగు సుకర్మలచేతను బ్రహ్మహత్య మొదలగు దుష్కర్మలచేతను బుట్టి యపూర్వమను సంస్కారమే రూపముగా గలదియై పుర్యష్టకము నడుమనున్న బుద్ధి తత్వము నాశ్రయించి సుఖమును దుఃఖమును మోహమును గలిగించునదియై యుండును. పుర్యష్టకమనగా లింగశరీరము.

శైవసిద్ధాంతదీపికయందిట్లు గలదు. బైందవము మాయీయమునను పాశములాగంతుకములు కర్మపాశమనాదియు భోగముచే నంతమొందునదియు నగును. ఆణవపాశమైననో యనాదియు స్వపరిపాకమునందుఁ బరమేశ్వర ప్రసాదరూపమగు దీక్షచే నివర్తించునదియునగును. కార్మిక మను పాశమైననో జ్ఞానము యోగము సన్న్యాసము నను వానిచేఁగాని భోగముచేఁగాని నశించును.

జీవజాలముల జీవిత పరమావధి మోక్షమైయున్నది. మోక్షప్రాప్తికిఁ బరమేశ్వరోపాసనము సాధనమని యాస్తికమతము వారెల్లరును నిర్వివాదముగా నంగీకరించియున్నారు. నిగమాగమములీవిషయమును సహస్రధాస్థిరీకరించినవి.

శివజ్ఞానశేఖరమందు 'క్షరంమాయాచాక్షరం జీవరూపంక్షరాత్మానాదిశతే దేవఏకః తస్యధ్యానాద్యోజనాత్తత్వభావాద్భూయశ్చాంతే విశ్వమాయానివృత్తిః' క్షరముమాయ, అక్షరము జీవుఁడు ఇట్టి క్షరాక్షరముల నాదేశించు మహానుభావుని సర్వదా ధ్యానించుటవలనను తత్త్వభావనవలనను మాయానివృత్తి గలుగును. మరియు 'జ్ఞాత్వాదేవం సర్వపాశాపహానిః క్షీణైః క్లేశైర్జన్మమృత్యుః ప్రహాణిః తస్యధ్యానాత్ మూలమాయాఽభేదే విశ్వైశ్వర్యం యాతికైవల్య రూపం ఏతత్ జ్ఞేయం నిత్యమేవాస్త సంస్థం నాతః పరంవేదితవ్యంహి

కించిత్' యిట్టి సర్వేశ్వరునిఁ దెలిసుకొనుటవలన సర్వపాశములు నశించును. సర్వక్లేశములు తొలంగును. మాయానివృత్తిగలిగిన కైవల్యదాతయగు విశ్వేశ్వరుని దయకుఁ బాత్రుఁడగును గాన యాత్మయందు వసించు నీతనిఁదెలుసుకొనవలెను. ఇంతకంటె నెవ రును దెలుసుకొనఁదగినవారులేరు. 'విశ్వస్యజగతః కర్తాపశోరన్యః పరశ్శివః। తమేవ పరమంజ్ఞాత్వామృత్యు పాశాద్విముచ్యతే' పశుపాశ విలక్షణుఁడును జగత్కర్తయుఁ బరశివుఁడగు నాతనిఁదెలుసుకొనుట వలనఁ బ్రాణులు మృత్యుపాశమునుండి విముక్తులగుచున్నారని గలదు.

'జ్ఞాత్వాశివంశాంతి మత్యంతమేతి। ఈశంతంజ్ఞాత్వా అమృతా భవంతి' అట్టి యీశ్వరునిఁదెలుసుకొని జీవులు ముక్తులగుచున్నారు. 'యదాచర్మ వదాకాశం వేష్టయిష్యంతిమానవాః తదాశివమవిజ్ఞాయ దుఃఖస్యాంతోభవిష్యతి' చర్మమువలె నాకాశము చుట్టబడినచో శివునిఁదెలియక మోక్షము చెందవచ్చును. అనగా నాకాశము చర్మ మువలె చుట్టఁబడదు. శివునిఁదెలియక మోక్షము కలుగనేరదని వేదశిఖలయందు స్మరింపబడినది మఱియు 'వరంవరేణ్యం వరదం పురాణం నిజ ప్రభాభాసిత సర్వలోకం। సంకల్పితార్థ ప్రదమాది దేవం స్మృత్వా వ్రజేన్మోక్షపదం మనుష్యః' సర్వవ్యాపియు పురా ణుండును శ్రేష్ఠుఁడును ఆదిదేవుఁడునగు శివుని జిజ్ఞాసయొనర్చి మాన వుఁడు మోక్షమును బొందుచున్నాఁడనియుఁ జెప్పఁబడినది.

సిద్ధాంతశిఖామణియందు 'వినాప్రసాదమీశస్య సంసారో ననివర్తతే' యీశ్వరానుగ్రహములేక భవమువశించ నేరదనిగలదు. అద్దాన ననంత జన్మ మరణ కారణులై పాశబద్ధులగు జీవులకుఁ బర మేశ్వరోపాసనయే ప్రధానతమ మనియు నెంతదనుక పతియగు నా మహనీయుని యనుగ్రహమునకుఁ బశువులగు జీవులు గురికాకుందురో

యంతదనుక సంసారవశవర్తనులై దుఃఖభాజనులగుట తప్పదనియు నేర్పడుచున్నది.

శాంభవదీక్ష యననేమి ?

బృహజ్జాబాలమున 'వ్రతమేతచ్ఛాంభవం సర్వేషు వేదేషు వేదవాదిభిరుక్తం భవతి తత్సమాచరే న్ముముక్షుర్న పునర్భవాయ' శాంభవమను నీదీక్ష సర్వవేదములయందును - వేదవిదులచే తను ప్రశం సింపఁబడినది. మోక్షముగోరునాతఁడు జన్మ రాహిత్యమునకై యిద్దాని నాచరింపవలయుననియుఁ గాలాగ్నిరుద్రమున 'వ్రతమేతత్పాశుపతం తత్సమాచరే న్ముముక్షుర్న పునర్భవాయ' పాశుపతమను నీవ్రతమును ముముక్షువు జన్మరాహిత్యమునకై యాచరింపలయునని చెప్పఁబడియున్నది.

'అనంత జన్మమరణ కారణాత్పాప సంచయాత్ ముముక్షు రాచరేద్దీక్షాం శాంభవీం పాశకృంతనీం' జన్మమరణ కారణమగు సం సారమునుండి కడతేరి జన్మరాహిత్యముందుటకు శాంభవదీక్ష నవలం బింపుమని శివాగమములయందు వచింపఁబడినది. ఇట్లుపదేశించుటఁ జేసి శాంభవ పాశుపతాది శబ్దితమగు నీవ్రత మీశ్వరోపాసనారూపక మగుట కతన పాశహరమై మోక్షసాధనమగుచున్నది.

పరమేశ్వరుని దేవి మోక్షధర్మములఁ బ్రశ్నించుచు 'జ్ఞానా దేవతు కైవల్యం జ్ఞానమువలనగాని కైవల్యము కలుగదని సెలవిచ్చి యుంటిరి. మఱియు శాంభవదీక్షవల్లనే ముక్తిగలుగునని చెప్పు చున్నారు. జ్ఞానములేక ముక్తిలేదుగాన నీదీక్షతోఁ బనియేమి? ఇది మోక్షసాధనమెట్లగున'ను దేవి ప్రశ్నములకు 'దీక్షాసంస్కారము లేక యపవిత్రముగల చిత్తముగలవానికి జ్ఞానముపదేశింపఁబడియు మరుభూమియందు విత్తిన విత్తనమువలె జ్ఞానముదయింపఁజాలదు. దీక్షాసంస్కారముచే నిర్మలమయిన చిత్తమున నిలుపఁబడిన నాజ్ఞా

ఁ (శివజ్ఞానము) నిశ్చయముగ మోక్షమునొసంగును. నా
నుగ్రహము లేకున్న సంసారమునుండి జీవులకు ముక్తి సంభవింపదు
ననుగ్రహము నా జ్ఞానములేక కలుగదు. ఈదీక్ష గ్రహించి
నా జ్ఞానము సులభసాధ్యమగును. కావున నీదీక్ష మోక్ష
కమగున'ని పరమేశ్వరుఁడనియెను.

అందులకాదేవి 'యీ దీక్షవలన జ్ఞానలాభమగునంటిరి.
ద్వారా యీదీక్ష మోక్షప్రదమని చెప్పుటచే నీదీక్ష జ్ఞానసాధనమే
పుచున్నది. ఈదీక్షను గ్రహించినవాఁడు జ్ఞానాభ్యాసిగాక రాగ
షాదియుతుఁడగుచో నాతనికి ముక్తి కలదా? అట్టివానికి ముక్తి
ంచినయెడల జ్ఞానాపేక్షలేక దీక్షగ్రహించిన మాత్రముననే ముక్తి
ంచు గాన జ్ఞానాపేక్ష వ్యర్థమగును. ముక్తి లభింపకున్నచో
తోఁబనియేమి? దీక్షయుండియు జ్ఞానాపేక్షలేని కారణమున
క్తి లభింపలేదు. కాఁబట్టి దీక్ష వ్యర్థమగుచుండలేదా?' యనియెను
ంభవవ్రతుఁడు మూఢుఁడయినను ప్రాణోత్క్రమణవేళయందు
రణాసియందువలె నాస్వరూపమును దెలియఁగల జ్ఞానముపదేశిం
సును. ఆజ్ఞానముచే మానవుఁడు నాయనుగ్రహమునంది ముక్తుఁ
ను. శాంభవవ్రతుఁడు నాయనుగ్రహముచే జన్మబాధలనందఁ
యీశ్వరుఁడు కారణోత్తరమునఁ జెప్పుటవలన శాంభవమును
హాదీక్షనంది తద్ద్వారా మానవుఁడు మోక్షమునందగలఁడనుట ప
దాంశము.

'అత్యాశ్రమం పాశుపతం శాంభవం వై శిరోవ్రతం। ఇతీదం
మభిః పుణ్యైర్నిగమాంతేషుగీయతే' అత్యాశ్రమము పాశుపతము
ంభవము శిరోవ్రత మను బుణ్యనామములచే నీవ్రతము వేద
నాంతాగమములయందు వివరింఁబడినది. బ్రహ్మచారియు గృహ
ఁడుడు వానప్రస్థుఁడును యతియు స్త్రీయు నీవ్రతము వరిగ్ర
ంపవచ్చును.

'వైదికం తాంత్రికంచేతి వ్రతమే తద్ద్విధాభవేత్। ద్విజానాం వైదికంప్రోక్త మన్యేషాం తాంత్రికం స్మృతం।' వైదికమనియు తాంత్రికమనియు నీవ్రతము రెండువిధములుగ విభజింపఁబడెను. ద్విజులు వైదికముగను ద్విజేతరులు తాంత్రికముగ నీవ్రతము నవలంబింపవలయునని కారణోత్తర దివ్యాగమమునఁగలదు ఇట్లు విధి-వుట వలన నెల్లఱు మోక్షసాధనమును బరమేశ్వరానుగ్రహకారణము నగు నీవ్రతమును గ్రహింప వర్హులని తెలియుచున్నది. ఈమహావ్రతము నందు, ఆణవ కార్మిక మాయికములను పాశములను క్షయింపుటం జేసి యిష్టప్రాణభావములను మూడులింగములయొక్క సంబంధ మొసఁగబడుచున్నది గాన దీనికి దీక్షయను నామము సార్థకమగు చున్నది. మఱియు నీదీక్ష శివసంబంధమయినదగుట కతన శివదీక్ష యనియుఁ జెప్పఁబడును. శ్రీకృష్ణాద్యనుష్ఠితమై కాలాగ్నిరుద్ర వాయవీయ సంహితాదులయందుఁ బ్రకటింపఁబడిన యీ శాంభవ వ్రతము కేవలము భస్మధారణ రూపమయినదని కొందఱభిప్రాయ పడుచున్నారు. అథర్వశిరమున నీవ్రతమును జెప్పెటి సందర్భమున 'ఇష్టమూర్గంతుపసానియచ్ఛత' ........'వ్రతమేతచ్ఛాంభవం' అని యిష్టలింగ విధాయికమగు వాక్యము యిష్టలింగధారణమును 'నమో బ్రహ్మణేధారణంమేఅస్తు' "అమృతస్య దేవధారణో భూయాసం' 'సర్వలింగగ్ స్థాపయతి పాణిమంత్రం పవిత్రం' అను వచనములం బోలె విధింపుటంజేసి లింగధారణమును పాశుపతదీక్షాంగమగుట శాంభవ పాశుపతాది శబ్దములచేఁ గీర్తింపఁబడిన యీవ్రతము (దీక్ష) భస్మరుద్రాక్షలింగధారణ లింగార్చనాది రూపమయిన దనుటలో సందియము లేదు.

శివానుభవ సూత్రమున నిష్టలింగ నిర్వచన సంగతియందు 'ఇషమూర్జం తపసానియచ్ఛత' యను పూర్వోదాహృత వచనము నకు సర్థరూపమగు 'ఇష్టమూర్జంతుతపసా మనుయచ్ఛతి సర్వదా

తదిష్టలింగమిత్యాహుస్తస్మాదాథర్వణీ శ్రుతిః' యను వాక్య మిష్ట లింగధారణపరముగా సిద్ధాంతీకరింపఁ బడియుండెను. లింగాంగ సంబంధమే సంసార పాశబంధమును భేదింపఁజాలినదగుట మోక్షసాధనమగు నీదీక్షకు లింగధారణము ప్రధానాంగమగుననిగూడఁ దెలియుచున్నది.

కొన్నిచోట్ల నీవ్రతము భస్మరూపముగను గొన్నిచోట్ల రుద్రాక్షధారణ రూపముగ సంకొకచో రుద్రాధ్యయనము లింగార్చనము మొదలుగాఁగలిగి వచింపఁబడుచుండుటకతన శాంభవ పాశుపతాది శబ్దితమగు నీమహాదీక్షకు మోక్షసాధనములయిన భస్మరుద్రాక్ష లింగధారణ లింగార్చనాదులంగ భూతములనియు నందుఁ బశువుల మలత్రయమును హరించి పరబ్రహ్మమగు లింగమునందంగసంబంధ సంధానకమగు లింగధారణమగు నీదీక్ష ప్రధానాంగమనుటలో విశేషమేమియులేదు. కాననే యీమహావ్రతమునుగూర్చి ,వేధామను క్రియాభిజ్ఞ దీక్షాత్రయ సుశోభితం। షడధ్వశుద్ధికలితం గురుకారుణ్య సంభృతం। భస్మరుద్రాక్ష శ్రీలింగ ధారణాత్మక ముత్తమం। శాంభవ వ్రతమేతద్ధి వేదశాస్త్రైకచోదితం' యీశాంభవవ్రతము వేధామను క్రియలను మూడు దీక్షలతోఁ గూడినదియు షడధ్వశోధనచే నొప్పునదియు గురుకటాక్ష ప్రాప్తమగునదియు భస్మరుద్రాక్ష లింగధారణాత్మకమై వేదశాస్త్ర విహితమై శివానుగ్రహ కారణమైనదని చంద్రజ్ఞానోత్తరమున వచింపఁబడి ,ఇదం...భవవారణం' యిదియే జన్మరాహిత్య కారణమైనదని వచింపుటతో ముగింపుచేయఁబడినది.

,తితీర్షుర్జన్మవారాశిం నానాదుఃఖగ్రహాకులం నిగమాగమాంతవిదితం శాంభవ వ్రతమాచరేత్' నానాదుఃఖగ్రహసంకులమయిన జన్మ సముద్రమును దాటవలయుననిన నీవ్రతమునే యనుష్ఠింపవలయుననియు ,శాంభవవ్రత మాహాత్మ్యేయోర్థవాదం హిమన్యతే ససర్వయాతనాభోగీ. భవత్యేవ నసంశయః' యెవఁడు శాంభవ

వ్రతము నర్థవాదముగా తలంచుచున్నాఁడో, యాతఁడు నిశ్చయముగ సర్వయాతనల ననుభవింపుననియు శాంభవవ్రత మాహాత్మ్యమున శాసింపఁబడినది. 'వ్రతమేతత్ప్రకుర్వీత సతువై నైష్ఠికస్మృతః। సోత్యాశ్రమీచవిజ్ఞేయో మహాపాశుపతస్తథా సఏవతపసాం శ్రేష్ఠ సఏవచ మహావ్రతీ। నతేన సదృశః కశ్చిత్ కృతకృత్యోస్తి ముముక్షుషు' శాంభవదీక్షితుని నైష్ఠికుఁడనియు అత్యాశ్రమియనియు మహాపాసుపతియనియు ముముక్షువులలో నాతనితోఁ దుల్యుఁడగు కృతకృత్యుఁడు లేఁడనియు శివపురాణము ప్రశంసించినది.

సూతసంహితయందలి యజ్ఞవైభవఖండ చతుస్త్రింశాధ్యాయ వ్యాఖ్యానమున విద్యారణ్యులవారు 'జంతోరపశ్చిమతనోస్సతి కర్మసామ్యేని శ్శేషపాశపటలచ్ఛిదురానిమేషాత్। కల్యాణదేశిక కటాక్షసమాశ్రయేణకారుణ్యతో భవతి శాంభవవేధ దీక్షా' యిట్లు శాంభవమగు నీ వేధాదీక్ష ముక్తినొసంగునని నిర్ణయించియున్నారు. భవరోగమున కింతకంటె దివ్యౌషధములేదు కావుననే శిష్యుఁడు కృతాంజలియై గురుంజేరి 'కల్యాణద మహాభాగ దేశికః కరుణానిధే। ఆచార్యవర్య - - - రక్షమాం భవరోగిణం' యని జన్మనివారకమగు నీదీక్షౌషధము నభ్యర్థించుట రూపకమగు ప్రసంగము దీక్షాప్రారంభమున నడుపఁబడుచున్నది.

ఈదీక్షయందు శిష్యుని శిరమున హస్తమునుంచి గురుఁడనుగ్రహ దృష్టితోఁ జూచినదియే వేధాదీక్షయు-శిష్యుని చెవియందు మంత్రము నుపదేశించినది మంత్రదీక్షయనియు శిష్యుని హస్తమున లింగము నిడునది క్రియాదీక్షయనియుఁ జెప్పఁబడును.

పూర్వోక్తములగు వేధమను క్రియాత్మికములగు త్రివిధ దీక్షలయందు నొకొక్కటియు నేడవాంతర దీక్షల నమరియుండుట నీమహాదీక్ష యిరువదియొకటియగు సమయ - నిస్సంసార-నిర్వాణ - తత్త్వ-అధ్యాత్మ-తత్త్వశుద్ధి-తత్త్వోపదేశిని-ఏకాగ్రచిత్త - దృఢవ్రత -

పంచేంద్రియార్పణ-అహింస-లింగనిష్ఠ - లింగరూప మనోలయ-సద్యో
ముక్తి-ఆజ్ఞ-ఉపమ-అభిషేక-స్వస్తికారోహణ - భూతిపట్ట - ఆయత్త
స్వాయత్తలను నవాంతర దీక్షలచే నొప్పారుచున్నది.

ఆజ్ఞాదీక్షలో సదాచారములను వీడనను ప్రతిజ్ఞచేయించుట
యందును ఉపమదీక్షలో శిష్టాచరణ రూపకములగు వర్ణాశ్రమాది
వ్యవస్థాపోషణమందును భూతిపట్టాఖ్యలో భస్మధారణ భస్మావకుంఠన
భస్మోద్ధూళన భస్మస్నాన కర్మలయందును ఆయత్తదీక్షలో శక్తిపాత
వశమగు దశావధానములయందును సమయదీక్షలో భక్తగణభ్రాంతి
యందును నిస్సంసార దీక్షలో శివపూజోపచారమే సంసారమని భావిం
చుటయందును నిర్వాణదీక్షలోఁ బ్రాకృత శరీర నిరాసయందును
తత్త్వోపదేశినిలో శివైక్యవిచారమందును తత్త్వదీక్షలో తత్త్వమసి
వాక్యానుసంధానరూపకములై ముప్పదియారగు తత్త్వములఁ
దెలియఁజేయుటద్వారా లింగాంగ సంయోగ విధియందును ఏకాగ్ర
మతిలో నన్యదేవతా పూజనాదిక త్యాగమునందును అధ్యాత్మలో
లింగాంగ సాహిత్యమందును తత్త్వసంశోధనలో షట్లింగాంగ వివేక
మందును దృఢవ్రతములో శరీరపాతపర్యంత మీవ్రతానుష్ఠాన విష
యమందును పంచేంద్రియార్పణలో సర్వకర్మల నిష్కామియై శివా
రాధన రూపముగ నర్పించు విషయమునందును అహింసాదీక్షలో
దద్ధర్మాచరణమందును లింగనిష్ఠాదీక్షయందు శివోహమను శివాద్వైత
జ్ఞానవివరణమందును లింగమనోదీక్షలో సమనస్క విచారమందును
సద్యోముక్తిలో విగతసంశయుఁడగుటకై శివజ్ఞానోపదేశమందును
స్వాయత్తదీక్షలో మాంసపిండనివృత్తి ఫలకమగు షడధ్వశోధనమం
దును కలశాభిషేచనలో స్వదేహాగత పంచభూత పరిశుద్ధియందును
శిక్షితుఁడగుటయేగాక యష్టావరణ పంచాచార ధర్మములందును
సుశిక్షితుఁడై శిష్యుఁడు పరమగురు కారుణ్యపాత్రుఁడగుచున్నాఁడు.

శివజ్ఞానశేఖరమందు శాంభవదీక్ష సర్వోత్తమమయినదనియు మలత్రయమును నశింపఁజేసి శివసంబంధము కలుగజేయు నీదీక్ష సాధార నిరాధారయను రెండు భేదములు గలిగియున్నదనియు ప్రత్యక్షుఁడై ప్రసన్నుఁడయిన శివునిచే నొసంగఁబడినదీక్ష నిరాధార దీక్షయనియు గురుస్వరూపముచే నొసగఁబడినదీక్ష సాధారదీక్షయనియు వచింపఁబడినది.

స్కాందపురాణమున 'సముద్రతీరే నద్యాంవా గోష్ఠే దేవాలయేశుచౌ। దేశేగురుగృహే క్షేత్రే దీక్షాకర్మసమాచరేత్' సముద్రతీరమందుఁగాని నదీతీరమునఁగాని పశువుల గోష్ఠమందుఁగాని దేవాలయమందుగాని శుచియగు దేశమునఁగాని గురుగృహంబునఁగాని క్షేత్రమునందుఁగాని దీక్షాకర్మ నొనర్పవలయునని గలదు

వేధామనుక్రియాత్మకమగు శాంభవదీక్ష పురుషుల కుపనయనానంతరమునను స్త్రీలకు వివాహానంతరమునను కర్తవ్యముగ శైవశాస్త్రముల నిర్ణయింపబడినది.

పరమపవిత్రమగు నీదీక్షారంభమునకు వైశాఖ శ్రావణ ఆశ్వీజ కార్తిక మార్గశిర మాఘ ఫాల్గుణమాసములు శుభావహములగుచున్నవి. జ్యేష్ఠంబునఁ బండ్రెండు దినంబులును చైత్రంబున నిరువది దినంబులును ఆషాఢంబున పదునైదు దినంబులును భాద్రపదంబున నైదురాత్రులును పుష్యమాసంబునఁ బదమూఁడు దినంబులును మాసాదియందు వదలి యాపైదినంబుల గురుఁడు శిష్యుని దీక్షితునిగఁ జేయవలయును. శుక్లపక్షమందలి చవితి నవమి షష్ఠి అష్టమి చతుర్దశి పూర్ణిమతిథులు విసర్జింపవలయును. మాసశివరాత్రియందు దీక్షయాచరింపవచ్చును. ప్రతిపత్తుసంవయ్యాది యనర్థదాయకమగును. సోమ బుధ గురు శుక్రవారములు దీక్షాకాలమునకు శ్రేష్ఠతమములుగఁ బేర్కొనఁబడినవి. అందు సోమవారమత్యుత్తమమగును. సూర్యచంద్రగ్రహణసమయములందును విషు

యుగ్మంబున సర్వోదయ మహోదయములయందును మకరసంక్రాంతి యందును శిష్యుని జన్మనక్షత్రమందును దీక్షనందుట యుత్తమమగు చున్నది. అశ్విని రోహిణి మృగశిర ఆరుద్ర పునర్వసు పుష్యమి ఆశ్లేష మఖ ఉత్తర హస్త స్వాతి అనూరాధ జ్యేష్ఠ మూల ఉత్తరాషాఢ శ్రవణం శతభిషం పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతి యీ నక్షత్రములు శుభకరమనియు బవ బాలవ శకుని భద్ర గరజి తైతుల యను నీకరణములు శుభప్రదములనియు జెప్పఁబడుచున్నవి. కన్యా వృశ్చిక మేష వృషభ కుంభలగ్నములు త్యాజ్యములగు చున్నవి. గురుమూర్తి కరుణచే సిద్ధమయిన కాలమున కేంధమయిన విచారములేదు. ఇట్లు కాలశుద్ధినిగూర్చి జ్యోతిషమాధవీయాదుల యందుఁ జెప్పఁబడినది.

మలత్రయ రహితుండై యిష్టాదిలింగ త్రితయానుసంధాన ద్వారా ముక్తుఁడగుటకుఁగాను శిష్యునకు గురువు షడధ్వపూర్వక శాంభవ వ్రతముచేతను శక్తిపాతవిధితోడను దీక్షనొసంగుచున్నాఁడు.

## షడధ్వన్యాసాదిక వివరణము

శివస్వరూపి గాక నట్టి శివారాధనముచేయఁజనదుగాన జీవభావ నివృత్తిగలిగి శివత్వసిద్ధినొందుటకును సర్వబంధ విముక్త్యర్థమును శిష్యుని, ఆచార్యుఁడు షడధ్వాది న్యాసాదికముచేఁ బరిశుద్ధునిగ నొనర్పవలయును. సర్వోత్తమమగు నీశాంభవ మహాదీక్షకుఁ బూర్వాంగమగు షడధ్వవిచారము సద్యోముక్తిదముగ శైవాగమ శివపురాణాదికములందు బహుధాప్రశంసింపఁబడినది షడధ్వాదిన్యాస సంపన్నమగు శరీరము పరమశివధామమగుచున్నదని శివధర్మమునఁ గలదు. వాతూలాగమమున 'నాదబిందుకళాఏవం తత్రస్థానేషువిన్యసేత్ షట్చక్రంచ షడంగంచ షడధ్వంచ షడాననః తత్తస్థానేషు విన్యస్య పంచబ్రహ్మన్యసేత్తతః' నాదబిందుకళల నాయాస్థలంబుల

న్యశించవలయును. షట్చక్రములు షడంగములు షడధ్వలునుంగూడ న్యశించిన యనంతరము పంచబ్రహ్మన్యాసము చేయవలయుననికలదు. ఇట్టి న్యాసములన్యసించుటచే శిష్యశరీరము శివజ్ఞానదీక్షాసిద్ధమగును. న్యాసశుద్ధుండగు సాధకుం డన్యభావమునువీడి శివభావమునే శివోహ మని తలంచుటకు సమర్థుండగుచున్నాండు.

శాంత్యతీతోత్తరుండగు పరశివునానతిచేతనే మూలప్రకృతి షడధ్వరూపమగు నీసమస్తమును సృజించుచున్నది. పరమేశ్వరియగు నాయాదిశక్తి యాపరమేశ్వరుని యాజ్ఞాస్వరూపిణి చిచ్ఛ్వరూపిణియగు నాశక్తి శివునికంటె బిన్నముకాదు. ఆజ్ఞారూపిణియైన నీశక్తి వలననే సమస్తంబునుం బ్రవర్తిల్లును. శివుండు కర్త. శక్తి కారణము శివ శక్తులకుంగల భేదమింతమాత్రమే యగుచున్నది. ఆశక్తియే సమస్త కార్యంబులకును మూలప్రకృతిత్వము నందియుండును. కుంభాది నానావిధమ్మృణ్మయ పదార్థములకు మృత్తిక వ్యాపికయైనటుల సమ స్తంబునకును శివతత్త్వము వ్యాపకమగుచున్నది. ప్రకృతి శివతత్త్వ స్వరూపమునందలి యీ షడధ్వములయందును నిలచియుండుటవలన శక్తినుండి పృథివీతత్త్వమువఱకుంగల సమస్తంబును శివతత్త్వమునుండి యేసముద్భూతమయ్యెను.

నాగర్థమయంబులగు నీషడధ్వములలో యీసమస్తప్రపంచ స్వరూపమును బరిణమింపుచున్నది ప్రథమమున మూలప్రకృతి నివృత్త్యాది పంచకళారూపములగు నైదువిధములుగం బరిణామమొం దెను. పరస్పర వ్యాప్తంబులగు నాషడధ్వములకభిన్నయగు పరా శక్తియే దానికి వ్యాపికయయి విభక్తరూపంబులచే షడధ్వాకృతు లవర్ధిల్లజేయునుకళాధ్వము తత్త్వాధ్వము వర్ణాధ్వము పదాధ్వము మం త్రాధ్వము భువనాధ్వము నను నీయారును షడధ్వములగును. ఈషడ ధ్వములును జీవులకు వారివారి చిత్తశుద్ధులననుసరించి భోగమోక్షము లుగల్పింపసమర్థములై యుండును. మంత్రాధ్వపదాధ్వ వర్ణాధ్వములను

నీమూడును శబ్దసంబంధములైనవి భువనాధ్వ తత్త్వాధ్వకలాధ్వమునను నీమూడును సర్థాంతర్గతములయినవి. మంత్రములన్నియు వాక్యస్వరూపములు. అవి పదసమూహంబుచే వ్యాప్తములై యుండును. పదసమూహమంతయు వర్ణవ్యాప్తమైయుండును. సకలవర్ణంబులును భువనంబులచే వ్యాప్తములై యుండును. ఇద్దాననే భువనమధ్యమునందే వర్ణవిజ్ఞానమగుచున్నది. భువనంబులన్నియు బ్రహ్మాండమునకు బహిరంతరంబులంగల మహదాదితత్త్వ సమూహముచే వ్యాప్తములై యుండును. తత్త్వస్వరూపములగు కారణంబులవలననేననేకవిధంబులగు కార్యారంభములగుచుండును. ప్రతి భువనంబునను పదునాల్గు బ్రహ్మాండములునందు జీవకోటులును వశింపుచుందురు. సకల తత్త్వంబులును సోపయోగములగు కళలచే వ్యాప్తములయియుండును. కళాధ్వంబులకు వ్యాపకత్వమును నితరాధ్వములకు వ్యాప్యత్వమునుంగలిగియుండును.

సద్యోజాతాదికములగు పదునొకండు మంత్రములు మంత్రాధ్వయు మహాదేవాదికములయి యోదోంకారాంతములగు నెనుబదియొక్క పదములు పదాధ్వయు అకారాది క్షకారాంతములై రుద్రరూపంబులగు ఏకపంచాశద్వర్ణంబులు వర్ణాధ్వయు అశుద్ధ మిశ్ర శుద్ధభేదంబులుకలిగి పృథివ్యాది శివశక్త్యంతములగు ముప్పదియారు తత్త్వములు తత్త్వాధ్వయు భద్రకాళ్యాదికములగు భువనములు రెండువందల నిరువదినాల్గును భువనాధ్వయు నివృత్త్యాదిశాంత్యతీతాంతములగు నైదును కళాధ్వయునగుచున్నవి పంచవిధములగు నీపరిణామమే పరశివుని సద్యోజాతాది పంచముఖములుగను, సృష్ట్యాది పంచకృత్యములుగను పరాదిశక్తి పంచకముగను పంచాక్షరరూపములుగను గ్రంథాంతరములం జెప్పంబడియున్నవి. నివృత్తికళ జానుపర్యంతమును ప్రతిష్ఠాకళ నాభిపర్యంతమును విద్యాకళ గళపర్యంతము శాంతికళ లలాటపర్యంతము శాంత్యతీతకళ తదూర్ధ్వపర్యంతము నావ

రించియుండునని శివపురాణమునఁగలదు. కారణోత్తర దివ్యాగమమున లింగమునందు శివకళాప్రవేశమునకును, శిష్యుని శరీరము మాంసపిండ నివృత్తిద్వారా మంత్రపిండమగుటకును షడధ్వన్యాసక్రమమిట్లు విధింపఁబడియున్నది. అందు లింగమున 'భువనాభిఖ్యమధ్వానం పట్టికాయామభిన్యసేత్ తత్కంఠేతు పదాధ్వానం వర్ణాధ్వానంగళేపిచ॥ తత్వంకజే కళాధ్వానం పట్టికాయాంతథాపునః తత్వాధ్వానం చవిన్యస్యేదథాదాద్యప్రదారికం మంత్రాధ్వానం చవిన్యస్యగంధాద్యైరభి పూజయేత్' అధఃపట్టిక కంజము కంఠము అబ్జము. ఊర్ధ్వపట్టిక ఆద్యప్రదారికయని లింగమున షడ్భాగములగుచున్నవి. ఇందు భువనాధ్వన్యాసము పట్టికయందును పదాధ్వన్యాసము కంజమునందును వర్ణాధ్వన్యాసము కంఠమునందును కళాధ్వన్యాసము నబ్జమందును తత్త్వాధ్వన్యాసము నాద్యప్రదారికయందును న్యసింపవలయును సంహారక్రమత్తో విద్వాన్ శబ్దార్థాత్మషడధ్వనః పాదాదిమూర్థువిన్యస్యేచ్ఛిష్యస్యనియతాత్మనః॥ వర్ణాధ్వానం శబ్దరూపం విన్యసేత్పాదయోర్బుధః॥ అర్థరూపం కళాధ్వానం మేఢ్రేన్యస్యేదనంతరం శబ్దరూపం పదాధ్వానం నాభౌవిన్యస్యదేశికః॥ తత్వాధ్వానం తత్వరూపం హృదిన్యస్యేదతంద్రితః॥ మంత్రాధ్వానం శబ్దరూపం విన్యస్యేన్నవం ముఖేతథా అర్థరూపంచ భువనాధ్వానం న్యస్యేచ్ఛిరస్యపి.' షడధ్వలను శిష్యుని పాదాద్యవయవములందు సంహారక్రమమున న్యసింపవలయును. శబ్దరూపమగు వర్ణాధ్వను పాదములయందును అర్థరూపమగు కళాధ్వను మేఢ్రమునందును శబ్దరూపమగు పదాధ్వను నాభియందును అర్థరూపమగు తత్వాధ్వను హృదయమునందును శబ్దరూపమగు మంత్రాధ్వను ముఖమునందును అర్థరూపమగు భువనాధ్వను శిరమునందును న్యసించవలయును ఐదువిధములై వ్యాప్యత్వలక్షణముల

ష్రితములగు నివృత్త్యాది కళలయందు తత్త్వాధ్వాదుల వ్యాపకత యిట్లు శాస్త్రంబుల సూచింపబడినది.

## నివృత్తి కళ

ఇందు సద్యోజాతపదాభ్యాంనమః హృదయాయనమః అను మంత్రములుండును.

1 మహాదేవపదము, 2 సద్యాబవేశ్వరపదము, 3 మహాతేజ యోగాధి పదము, 4 ముంచముంచపదము, 5 ప్రథమప్రథమ పదము, 6 సర్వసర్వపదము, 7 భవభవపదము, 8 భవోద్భవ పదము, 9 సర్వభూత సుఖప్రదపదము, 10 సర్వసాన్నిధ్యకరపదము, 11 బ్రహ్మ విష్ణు రుద్రపదపదము, 12 అనార్చితానార్చితపదము 13 అస్తుతాస్తుతపదము, 14 పూర్వస్థితపదము, 15 సాక్షిసాక్షి పదము, 16 తురుతురుపదము, 17 పతంగపతంగపదము, 18 పింగ పింగపదము, 19 జ్ఞానజ్ఞానపదము, 20 శబ్దశబ్దపదము, 21 సూక్ష్మ సూక్ష్మపదము, 22 శివపదము, 23 సర్వసర్వప్రదపదము, 24 ఓన్నమశ్శివ పదము, 25 ఓన్నమోనమో పదము, 26 నమశ్శివ పదము, 27 ఓన్నమ పదమను నిరువదేడు పదములుండును. క్షయను వర్ణమును పృథివీతత్వమును నిందుగలవు. పృథివీతత్వమందు భద్ర కాళీ భువనము మొదలగు రుద్రభువనాంతము వఱకుగల నూటె యెనిమిది భువనంబులుగలవు. భువనముల నామములే యీశరుద్రీయ సంజ్ఞగల భువనాధిపతుల నామములై యున్నవి. బ్రహ్మాండమునకు క్రింద, భద్రకాళీభువనమున 2 వీరభద్రభువనమును గలవు. దాని పై 1 త్రిలోచనభువనము 2 అప్సుభువనము 3 నభోభువనము 4 వివాహభువనము 5 సంమోహభువనము 6 త్రిదశేశ్వరభువనము 7 త్ర్యక్షభువనము 8 గణాధ్యక్షభువనము 9 విభుభువనము 10 శంభుభువనము అని పది భువనములుకలవు.

క్రిందిభాగమున 1 దంష్ట్రిభువనము 2 వజ్రభువనము 3 ఫణీంద్రభువనము 5 గ్రసనభువనము 6 మారుతాశనభువనము 7 క్రోధ భువనము 8 ఆనంద భువనము 9 వృషధర భువనము 10 వృషభువనములని పది భువనములు కలవు.

అండమధ్యమునందు 1 రుద్రభువనము 2 విష్ణుభువనము 3 బ్రహ్మభువనము 4 హాటకేశ్వరభువనము 5 కూశ్మాండభువనము 6 కాలాగ్నిరుద్ర భువనములు కలవు.

తూర్పుదిక్కునందు 1 త్రిదశాధిపభువనము 2 పినాకిభువనము 3 శాస్త్రభువనము 4 అవ్యయభువనము 5 విభూతిభువనము 6 వివర్ధనభువనము 7 వజ్రదేహభువనము 8 బుధభువనము 9 అజభువనము 10 కపాలీశభువనములను పది భువనములు కలవు.

ఆగ్నేయదిశయందు 1 అక్షయాంతక భువనము 2 భస్మాంతక భువనము 3 వజ్రబాహుభువనము 4 దహనభువనము 5 జ్వలనభువనము 6 హరణభువనము 7 ఘాతుకభువనము 8 పింగళభువనము 9 హుతాశనభువనము 10 అగ్నిరుద్రభువనములను పది భువనంబులు కలవు.

దక్షిణదిక్కునందు 1 ధర్మపతిభువనము 2 అధర్మపతి భువనము 3 వియోక్తృభువనము 4 సంయోక్తృభువనము 5 కర్తృభువనము 6 విధాతృభువనము 7 ధాతృభువనము 8 హరభువనము 9 మృత్యుభువనము 10 ధర్మభువనములను పది భువనంబులుండును.

నైరృతి దిశయందు 1 బలభువనము 2 దంష్ట్రిభువనము 3 లోహితభువనము 4 విరూపాక్షభువనము 5 ఊర్ధ్వకేశభువనము 6 భయాంతకభువనము 7 క్రూరదృష్టిభువనము 8 హంతృభువనము 9 మారణభువనము 10 నిరుతిభువనములు పది భువనములు కలవు.

పశ్చిమదిశయందు 1 మేఘవాహనభువనము 2 కపర్దిభువనము 3 పంచశిఖభువనము 4 పంచాంతకభువనము 5 క్షయాంతక

ము 6 తీక్ష్ణభువనము 7 సూక్ష్మభువనము 8 వాయువేగభువ
9 లఘుభువనము 10 శీఘ్రభువనములను పది భువనములు
.

వాయువ్యదిశయందు 1 సునాదభువనము 2 మేఖనాధభువ
3 బలాంతక భువనము 4 దీర్ఘబాహుభువనము 5 జయభద్ర
ము 6 శ్వేతభువనము 7 మహాబలభువనము 8 పాశహస్త
ము 9 అతిబలభువనము 10 బలభువనములను పది భువన
కలవు.

ఉత్తరదిక్కునందు 1 ప్రకామదభువనము 2 ప్రసాదభువ
3 శ్రీధరభువనము 4 రత్నధరభువనము 5 లక్ష్మీధరభువనము
ాధర భువనము 7 సౌమ్యధరభువనము 8 ధన్యభువనము
పభువనము 10 నిధీశభువనము నను పది భువనంబులుకలవు.

ఈశాన్యదిశయందు 1 బలిప్రియభువనము 2 భూతపాల
ము 3 జ్యేష్టభువనము 4 శర్వభువనము 5 సురేశ్వరభువనము
రపారగభువనము 7 జ్ఞానభూభువనము 8 సర్వజ్ఞభువనము
శానభువనము 10 విద్యాధిపభువనము నను పది భువనములు
.

## ప్రతిష్ఠాకళ

ఇందు 2 మంత్రములును 21 పదములును 24 వర్ణములును
త్వములును 56 భువనములును చేరియున్నవి.

## మంత్రములు

1 వామదేవగుహ్యాయనమః 2 శిరసేస్వాహా,

## ప ద ము లు

1 రూపి 2 అరూపి 3 ప్రథమప్రథమ 4 తేజస్తేజ 5 జ్యోతిర్జ్యోతి 6 అరూప 7 అనగ్ని 8 అధూమ 9 అభస్మ 10 అనాది 11 నానానా 12 ధూధూధూ 13 ఓంభూః 14 ఓంభువః 15ఓం స్సువః 16 అనిధన 17 నిధన 18 నిధనోద్భవ 19 శివ 20 సర్వ పరపరాత్మ 21 భువనేశ్వర పదములు.

## త త్వ ము లు

1 ప్రికృతి 2 బుద్ధి 3 అహంకార 4 మనస్సు 5 శ్రోత్ర 6 త్వక్ 7 చక్షు 8 జిహ్వ 9 ఘ్రాణ 10 వాక్ 11 పాణి 12 పాద 13 పాయు 14 గుహ్య 15 శబ్ద 16 స్పర్శ 17 రూప 18 రస 19 గంధ 20 ఆకాశ 21 వాయు 22 వహ్ని 23 జల తత్వములు.

## వ ర్ణ ము లు

1 టం 2 ఠం 3 డం 4 ఢం 5 ణం 6 తం 7 థం 8 దం 9 ధం 10 నం 11 పం 12 ఫం 13 బం 14 భం 15 మం 16 యం 17 రం 18 లం 19 వం 20 శం 21 షం 22 సం 23 హం 24 క్షంళం. వర్ణములు.

## భు వ న ము లు

ప్రికృతి తత్వమున 1 శ్రీకర్ణ 2 అకమ 3 కౌమార 4 వైష్ణవ 5 బ్రాహ్మ 6 భైరవ 7 కృత 8 అకృత భువనములు కలవు.

బుద్ధితత్వమున 1 బ్రాహ్మ్య 2 సుబ్రహ్మణ్య 3 ప్రాజేశ 4 సౌమ్య 5 ఇంద్రియ 6 గాంధర్వ 7 యక్ష 8 రాక్షసభువనములు కలవు.

అహంకార తత్వమున స్థలేశ్వరభువనముకలదు.

మనస్తత్వమున సుస్థలేశ్వర భువనముకలదు,

శ్రోత్రాదివిజ్ఞానే ంద్రియ తత్వపంచకమందు శంఖుకర్ణభువనము
వాగాదికర్మేంద్రియ తత్వపంచకమందు కాలాంజనభువ
ందు.

1 శబ్దాదితన్మాత్ర తత్వపంచకమందు మండలేశ్వర భువనము
ండభువనము 3 ద్విదండభువనము 4 సకలాండభువనములు

ఆకాశతత్వమందు 1 స్థాణు 2 స్వర్ణాక్ష 3 భద్రకర్ణ 4 గోకర్ణ
లయ 6 అవిముక్త 7 రుద్రకోటి 8 వస్త్రాపదభువనములు

వాయు 1 భీమేశ్వర 2 మహేంద్ర 3 అట్టహాస 4 విమలే
నఖలనాథుల 6 కురుక్షేత్ర 7 గయా 8 అక్షమహాభువన
కలవు.

అగ్నితత్వమున 1 భైరవ 2 కేదార 3 శ్రీశైల 4 మహా
మధ్యమేశ్వర 6 ఆమ్రాదికేశ్వర 7 జలేశ్వర 8 హరిశ్చంద్ర
ములుండును.

జలతత్వమునందు 1 అకులేశ్వర 2 దుంఠి 3 ముండి 4 భార
5 ఔషధి 6 పుష్కర 7 నైమిశ 8 అమరేశ్వర భువనము
ు.

విద్యాకళ

ఇందు మంత్రములు 2 పదములు 20 వర్ణములు 7 తత్వ
7 భువనములు 8 యునుంగలవు.

మ ం త్ర ము లు

1 అఘోరహృదయాయనమః 2 శిఖాయైవౌషట్.

ప ద ము లు

1 ధ్యానహార 2 ఓంనమశ్శివ 3 సర్వప్రభు 4 శివ 5 ఈశాన మూర్ధ్ని 6 తత్పురుషవక్త్ర 7 అఘోరహృదయ 8 వామదేవగుహ్య 9 సద్యోజాతపాద 10 ఓంనమః 11 గుహ్యాతిగుహ్య 12 గోప్త 13 అనిధన 14 సర్వయోగాధికృత 15 సర్వవిద్యాధిప 16 జ్యోతి రూప 17 పరమేశ్వర పరమేశ్వర 18 చేతనాచేతన 19 వ్యోమ్ని వ్యోమ్ని 20 వ్యాపివ్యాపిని యను నిరువది పదములు కలవు.

వ ర్ణ ము లు

1. ఘం 2. జం 3. చం 4. ఛం 5 జం 6 ఝం 7 ఞం అను వర్ణములు కలవు.

త త్వ ము లు

1 మాయ 2 కాల 3 నియతి 4 కళా 5 విద్యా 6 రాగ 7 పురుషతత్వములు గలవు.

భు వ న ము లు

మాయాతత్వమునందు 1 అంగుష్టమాత్ర 2 అర్క 3 ఈశాన 4 ఏకేక్షణ 5 ఏకపింగళ 6 ఉద్భవ 7 భవ 8 వామదేవ 9 మహాద్యుతియను తొమ్మిది భువనములును.

కాలతత్వమునందు 1 శిఖేద 2 ఏకవీరభువనములు రెండును నియతితత్వమున 1 క్రోధ 2 చండ 3 శూర 4 పంచాంతకములను నాల్గు భువనములును.

కలాతత్వమునందు 1 సంవర్త 2 జ్యోతిషములను రెండు భువ
ను.

విద్యాతత్వమునందు 1 మహాక్రోధ 2 మహాచండభువనములు
రాగతత్వంబున 1 ఏకశిర 2 అనంత 3 అజ 4 ఉమాపతి
ండములను నైదుభువనములును.

పురుషతత్వమునందు 1 ఏకపాద 2 ఈశాన 3 భవ 4 ఉగ్ర
వనములను నైదు భువనములుంగలవు.

శాంతికళ

ఇందు 2 మంత్రములును 12 పదములును 3 వర్గములును
ములును 17 భువనములుకలవు.

మంత్రములు

1 తత్పురుషవక్త్రాయనమః 2 కవచాయహుం.

పదములు

1 వ్యోమవ్యాపిని 2 వ్యోమరూప 3 సర్వవ్యాపిని 4 శివా
అనాథ 6 అనాశ్రిత 7 ధ్రువ 8 శాశ్వత 9 యోగపీఠ
త 11 నిత్యయోగి 12 ధ్యానహారమను పదములును.

వర్ణములు

1 కం 2 ఖం 3 ఘం అను వర్ణములును.

తత్వములు

1 సదాశివ 2 ఈశ్వర 3 శుద్ధ విద్యాతత్వములును.

భు వ న ము లు

సదాశివతత్వమునందు 1 అనంత 2 సూక్ష్మ 3 శివోత్తమ 4 ఏకనేత్ర భువనములును

ఈశ్వరతత్వమునందు 1 ఏకరుద్ర 2 త్రిమూర్తి 3 శ్రీకంఠ 4 శిఖండి భువనములు.

శుద్ధ విద్యాతత్వమునందు 1 వామదేవ 2 జ్యేష్ఠ 3 రౌద్రి 4 కాల 5 కలవికరణ 6 బలవికర్ణ 7 బలప్రమథ 8 సర్వభూత దమన మనోన్మని నామక భువనంబులునుంగలవు.

శా ం త్యా తీ త క ళ

ఇందు 3 మంత్రములు 1 పదము 16 వర్ణముయి 2 తత్వ ములు 15 భువనములుండును.

మ ం త్ర ము లు

1 ఓంశివాయనమః 2 ఈశానమూర్ధ్నేనమః 3 అస్త్రాయ ఫట్ అను మంత్రములును ఓంకారపదమును 1 శివ 2 శక్తి యను రెండు తత్వములును 1 అం 2 ఆం 3 ఇం 4 ఈం 5 ఉం 6 ఊం 7 ఋం 8 ౠం 9 ఌం 10 ౡం 11 ఏం 12 ఐం 13 ఓం 14 ఔం 15 అం 16 అః అను వర్ణములుండును.

శివతత్వమునందు 1 అనాశ్రిత 2 అనాథున 3 అనంత 4 వ్యోమరూప 5 వ్యాపిని 6 ఊర్ధ్వగామిని 7 రోచిక 8 మోచిక 9 దీపిక 10 ఇందిరభువనములు పదియును.

శక్తితత్వమునందు 1 శాంత్యతీత 2 శాంతి 3 విద్యా 4 ప్రతిష్టా 5 నివృత్తి భువనములను నైదు భువనములుంగలవు.

ఇట్లు షడధ్వములయందు సిద్ధాంతభేదము ననుసరించి 11 మంత్రములును 51 వర్ణములును 36 తత్వములును 224 భువనములును 5 కళలునుఁ బ్రస్థితములయి యున్నవి.

ఇందు ప్రతిష్టానివృత్తియను 2 కళలును నశుద్ధాధ్వమనియు నిందుండువారలు పాశపంచకబద్ధులై కించిజ్ఞత్వము - కించిత్కర్తృత్వమును దుఃఖమోహములు కలిగియుందురనియు.

మిశ్రాధ్వయగు విద్యాకళయందుండువారు బైందవరోధ అణవకార్మికములగు నాల్గుపాశములచే బంధితులై సర్వజ్ఞులయ్యు సుఖదుఃఖములు మాత్రమనుభవింపవలశినవారై యుందురనియు. శాంతిశాంత్యతీతకళలు 2 ను శుద్ధాధ్వములగుచున్నవి. బైందవము రోధశక్తియను పాశములంగూడి నిందుండువారలు ముక్తులకుంబలె నెల్లకాలము నిరతిశయ సుఖమనుభవింపుచు దుఃఖమోహముల నొందనివారుగ నుందురనియు శైవశాస్త్రనిర్ణయము ఇట్టి షడధ్వ పరిణామమునుంగూర్చి శివమహాపురాణమున శక్త్యాద్యుత్పత్తికథనంబున, పరమేశ్వరుఁడీ విశ్వంబునంతను దన యాజ్ఞచే నెట్లు సృష్టించి ప్రతిష్టించి పరమంబగు లీలాఖేలనమొనర్చుచున్నాఁడను మునుల ప్రశ్నంబునకు వాయుదేవుఁడిటులపచించెను. శాంత్యతీ పదాలంకృతయగు శక్తియే పరమేశ్వరునుండి మొట్టమొదట నుదయించెను దానినుండి శాంత్యతీతపదంబును దానినుండి విద్యాపదంబును దానినుండి ప్రతిష్టాపదంబును దానినుండి నివృత్తిపదంబునుం గలిగెను. ఈశ్వర సృష్టి యిట్లు సంక్షేపముగఁ జెప్పఁబడినది. ఏకక్రమముగా సృష్టియయ్యెనో దానికి బ్రితిలో మక్రమంబుగా సంహారంబు జరుగుచుండును. ఈ పంచపదోద్దిష్టంబగు సృష్టికంటెనితరసృష్టి యేమియునులేదు నివృత్త్యాదులగు నీపంచకళలచేతనే జగంబంతయు వ్యాప్తంబైయున్నదని చెప్పంబడినది. నివృత్త్యాదికములగు కళాపంచకముగఁ బరిణామము నొంది పరాశక్త్యాది నామకమై పరమవ్యోమనామంబునఁ గీర్తింపఁ

బడుచు శివాజ్ఞారూపిణియై శక్తి శివవ్యతీతయై యుండఁజాలదు. కావున శివు డీసమస్త జగదుత్పత్తికిని కారణుఁడై యున్నాఁడు. ఇట్టి పరమోత్కృష్టమగు న్యాసనంస్కారముచే సాధకుఁడు శుద్ధుఁడును శివజ్ఞానియునై ముక్తినొందుచున్నాఁడు. మకారం మననం చైవ త్రికారం త్రాణముచ్యతే మననత్రాణమిత్యాహుర్మంత్ర మిత్యభిధియ్యతే. అను న్యాయముచేత పరశివుండు మననరక్షణములకు విలక్షణుఁడగుట మంత్రాధ్వాతీతుఁడును సర్వదేశ వ్యాపకుఁడగుట పదాధ్వాతీతుఁడును అవర్ణుఁడగుటవలన వర్ణాధ్వాతీతుఁడును సర్వతత్వ విలక్షణుఁడగుటవలన తత్వాధ్వాతీతుఁడును సర్వమునకు స్వామియగుటవలన భువనాధ్వాతీతుఁడును నిష్కళుఁడగుట కళాధ్వాతీతుఁడును నయి పూర్వోక్త షడధ్వముల కతీతుఁడును నియంతయునయి సర్వమునకు మూలమగుచున్నాడు.

యీయర్థము 'అధ్వనామధ్వపతేః పారమశీయః' అనుశ్రుతి ప్రమాణముచే నిశ్చితమగుచున్నది. కావున యుపాసనాధికార పదమును యీశ్వరప్రాప్తికి సాధనమైన యీ అధ్వశోధనము దీక్షాకాలమున విధ్యుక్తమై దీక్షాపూర్వాంగమగుచున్నది.

## శాంభవదీక్షావిధి

ఆచార్యుఁడు యథోక్తలక్షణుఁడగు శిష్యునకు దీక్షనొసగుఁటకు సాలంకరణమగు మండపమును నిర్మించి కుండముగాని ప్రాగ్దిశయందు స్థండిలమునుగాని యేర్పాటుచేసి యందు గౌరీలతామండలమును రచించి తద్ద్వారములను బూజించి క్రమముగఁ బ్రాగ్దిశనుండి నంది మహాకాళాదులను బూజించి పశ్చిమద్వారమున లోనఁ బ్రవేశించి సుఖాసీనుఁడై శిష్యునను గ్రహింపువాఁడై గణానుజ్ఞనొంది దేశకాలములఁ గీర్తించి గణాధిపతినిఁ బూజించి స్వస్తిపుణ్యాహవాచనమాచరించి గణనమస్కారముగావించి యీశిష్యుని దీక్షితునిగా

నొనర్చుచున్నానని సంకల్పముచేసి శిష్యుని కాజ్ఞాదీక్షయు, నుపమ దీక్షయు నొసఁగి పాపహరణమునకై పంచగవ్యసాధనమొనర్చి పంచకలశార్చనకై ఋత్విక్కరణముగావించి పంచబ్రహ్మమంత్రములచే ఋత్విక్కులచేత వాటినిఁ బూజింపఁజేసి తాను మధ్యకలశమును బూజింపవలయును. మంటపోత్తర దిశయందలి వేరొక మండలమున శివలింగము నొక పాత్రియందుంచి శాణాదిఘర్షణదోష పరిహారమునకై హిరణ్యశృంగాది యనువాకములచేతను బంచగవ్యముచేతను బంచామృతములచేతను బంచబ్రహ్మ మంత్రములచేత నభిషేకించి తదుపరి శుద్ధోదకముచే నభిషేకించి యాలింగమును నైరుతి దిశయందలి పద్మమండలముననున్న వేరొక పాత్రియందుంచి పుష్పాదులచేఁ బూజించి శాణదోషనివారణార్థము జలాధివాసమొనర్చి వాయువ్య దిగ్భాగమందున్న మండలమున స్నానపాత్రియం దాలింగమునుంచి భస్మగంధాదులతోఁ బంచబ్రహ్మమంత్రములతో స్నానముచేయించి తుడిచి యుత్తరదిశయందున్న సోమమండలమున వేరొక పాత్రయందుఁ బెట్టి పుష్పాదులచేఁ బూజించవలయును. అనంతరము సప్తధాతు ప్రకాశప్రాప్తికై ధాన్యాధివాసముచేసి శివాగ్ని ముఖమొనర్చి శయ్యాధివాసముననున్న లింగము నాగ్నేయదిశయందున్న మండలమున రుద్రసూక్తాదులచే నభిషేకించి ప్రాజండలముననుంచి పూజింపవలయును. అనంతర మీశానదిశనున్న పాత్రమున లింగమునుంచి ధాన్యాధివాసమందలి కలశోదకముచేఁ బంచరుద్రముఁ స్నానముచేయించవలయును. లింగమందు శివకళ ప్రవేశించుటకై షడధ్వన్యాసమును శివకళ స్థిరపడుటకై మూడువందల యిరువ నాల్గుమార్లు పంచాక్షరీ మహామంత్రములతోను వ్యాహృతులతోఁ జయాదులతోను హోమముచేసి యగ్నినిఁ గాపాడవలయును. గురు శిష్యునకుఁ బంచబ్రహ్మమంత్రములచేఁ గరన్యాసముచేయిం ప్రాణాయామాదులచే దేహశోధనగావించి భూతశుద్ధిచేయవలయున

సకలీకరణముచేసియు పంచగవ్యముల నొసంగియు శిష్యునకు బాహ్యాంతరశుద్ధి చేయవలయును. అభిషేకదీక్షయొనర్చి పంచబ్రహ్మ మంత్రముల జపించుచు శిష్యదేహగత పంచభూతములు శుద్ధినొందుటకై పంచకలశోదకములచే నభిషిక్తునిఁజేసి శిష్యునిహస్తమున 'విశ్వేత్రాతే' యను మంత్రమునఁ గంకణముఁగట్టి మాంసపిండ నివృత్తికై షడధ్వశోధనద్వారా స్వస్తికారోహణ దీక్షనొసఁగవలయును శిష్యుని పాదాద్యవయవములయందు షడధ్వల న్యసించి షడక్షరీ మహామంత్రములోని యారు యక్షరముల నారేసిమార్లు పాదము మొదలు శిఖవఱకుఁగల నారు స్థానములయందు న్యసింపవలయును. భూతిపట్టమను దీక్షనొసఁగి భూతిరుద్రాక్షల ధరింపఁజేసి యొక రుద్రాక్షను బూజించి శిష్యుని దక్షిణహస్తమున బంధించి మలత్రయ నివృత్తికై మూఁడువందల యిరువదినాల్గు మారులు పంచాక్షరీ మహామంత్రమునుచ్చరించుచు హోమము చేయవలయును. తరువాత జయాదుల చేతను వ్యాహృతులచేతను హోమముచేసి పూర్ణాహుతియొనర్చి యాయగ్నిని శిష్యుని హృత్కమలమున నారోపించి రెండుమండలయులందు రుద్రాది క్షేత్రపాలాంతము ఇంద్రాది యీశానాంతము బలులొసంగవలయును. అనంతరము శిష్యునకా యత్తదీక్షనొసఁగి సకలమంత్ర న్యాసములచేసినదియు శాంతేశ్వరమను పేరుగల్గినదియు నగు యిష్టలింగమును మధ్యమండలమునుండి గ్రహించి తన వామహస్తమునందుంచి యీ లింగమును జూడుమని చూపించి గురుశిష్యుల మధ్య తెరనుబట్టి చూర్ణికాదులఁబఠించి శిష్యుఁడా! మూఁడు దేహములయందును మూఁడు లింగములను ధరించినవాఁడవగుమని తెరను తొలిగించి 'ధృవంతే' యను మంత్రముతో శిష్యుని శిరంబున గుడమిశ్రితజీరకంబుంచి మంగళాక్షతలనుంచవలయును. శిష్యుని ప్రాఙ్ముఖముగాఁ గూర్చుండఁబెట్టుకొని తానుత్తరాభిముఖుండై మూలమంత్రముచే శిష్యుని వామహస్తము నేడుమారు పూజించి త్రియంబక

చు మంత్రము పఠించుచు లింగము నాతని వామహస్తమున నుం
వలయును. ఇదియే స్వాయత్తదీక్షయనంబడును. శిష్యుని శిర
స్సును బూజించి షడక్షరీ మంత్రముచేఁ దన కుడిచేతిని నారుమార్లు
ంత్రించి శివహస్తముగా భావించి శిష్యుని శిరముననుంచి యేకాగ్ర
త్తముతో 'అయంమేహస్తో భగవాన్' యను మంత్రమును జపి
చు శిష్యునిఁజూచుచు సమయ - నిస్సంసార - నిర్వాణ - తత్త్వ-
ధ్యాత్మ తత్త్వసంశోధన - తత్త్వోపదేశిని యను వేధాదీక్షాంతర్గత
గు నీయేడు దీక్షల నొసంగి సర్వతత్త్వోపరిస్థితమగు చిత్కళను
వమునందుఁ బ్రవేశపెట్టవలయును. అనంతరమందు మంత్ర
క్షాంతర్గతములగు ఏకాగ్రచిత్తత దృఢవ్రత పంచేద్రియార్పణ
హింస లింగనిష్ఠ లింగమనోలయ సద్యోముక్తి యను నేడు దీక్షల
సంగినవాఁడై 'ప్రాణేష్వంతర్మనసో లింగమాహుః' 'శివేనవచ
త్వా' యను మంత్రములఁ బఠించి శిష్యుని కుడిచెవియందు షడ
క్షరీ మహామంత్రమును మెల్లగా ముమ్మార్లుపదేశింపవలయును.
యుఁడు పూర్వోక్తమను దీక్షచే భావింపఁబడిన శివకళను శిష్యుని
వామహస్తమందలి లింగమునఁ బ్రవేశపెట్టి యీలింగమునందు స్థిరు
గమ్మనియు భక్తుఁడే శరీరముగాఁగలవాఁడ వగుమనియుఁ బ్రార్థించి
ష్టావరణ పంచాచారముల శిష్యునికి బోధించి పాదతీర్థ ప్రసాద
ల నొసఁగి యీలింగమునుబట్టు వస్త్రమునఁగట్టి 'నమోబ్రహ్మణే
రణాంమేఅస్తు' యను మంత్రమును బఠింపుచు శిష్యుని మెడయందు
ంపఁజేయువలయును. అనంతరము కృతార్థుఁడగు శిష్యుఁడు సభక్తి
బుగ దండప్రణామంబుల నాచరించి గోభూ హిరణ్యాదుల గురు
ష్యుని సంతసింపఁజేయవలయును. అనంతరము ఋత్విక్కులను శివ
క్తులను బంధుగణముల భోజనదక్షిణ తాంబూలాదుల దృప్తిపరచ
యునని కారణోత్తరమున గలదు.

గురుమూర్తి స్సమాదాయకళాం శిష్యస్యమస్తకే నిజసద్భావమాత్రేణ విలోక్యాకృష్యతాం కళాం యథాకళా తథాభావో యథాభావస్తథామనః యథామనస్తథాదృష్టిః యథాదృష్టి స్తథాస్థలం జలకుంభాగ్రనిక్షిప్తతైలబిందుర్యథాతథా దేహప్రాణాత్మనోర్వ్యాప్య సంస్థితాశాంభవీ పరాజ్వలత్కాలానలాభాస తటిత్కోటి సమప్రభాతదూర్ధ్వేతు శిఖాంతే వైచిద్రూపాపరమాకళా సాకళా పరమాసూక్ష్మతత్వానాంబోధినీ పరాతామాకృష్య యథాన్యాయం లింగేస ముపవేశయేత్’ కళ ననుసరించి భావమును భావము ననుసరించి మనంబును మనస్సు ననుసరించి దృష్టి దృష్టి ననుసరించి స్థలంబును నుండును. తైలబిందువు జలకుంభమున వ్యాపించియుండునట్లు శివకళయు దేహప్రాణచిత్తముల వ్యాపించియుండును హృదయకమలమున బ్రజ్వలించు కాలానలసమమైన వహ్ని శిఖామధ్యంబున చిద్రూపమగు శివకళకలదు సకలతత్వములను బోధించు పరమసూక్ష్మమైన యాశివకళను (శిష్యసంబంధమగు) లింగమునందు ప్రాణప్రతిష్టామంత్రముతోగూడ మూలమంత్రమును పఠించుచు ప్రవేశబెట్టవలయునని శాంభవదీక్షయందుగలదు.

పరమగురు కారుణ్యలబ్ధమై కర్మజ్ఞానసముచ్చయ విలసితమై సద్యః పాశక్షయకరమును నిగమాగమాది సమ్మతమును సదాచార కవితంబును పూర్వాంగీకృత షడధ్వశోధనముతో గూడినదియు అష్టావరణ పంచాచార మండితమును పరమేశ్వరానుగ్రహ కారణమై మోక్షమే కారణముగాగల్గు నీమహాదీక్ష భక్తకల్పకమనుటకు సందేహమేమి. శివానుగ్రహమే లభింప నిక కోరతగినదేమియుండగలదు?

శ్రీ మేధాదక్షిణామూర్తి గురవేనమః

# శైవసర్వస్వము—ప్రమాణపరిచ్ఛేదము

## ఆవరణాచారదీపిక

### అష్టావరణములు

శాంభవీయదీక్షాంగములగు అష్టావరణములు 'గురుర్లింగం జంగమశ్చతీర్థం చైవప్రసాదకః। భస్మ రుద్రాక్ష మంత్రాశ్చేత్యష్టావరణ సంజ్ఞకాః' గురువు లింగము మహేశ్వరుడు తీర్థము ప్రసాదము భస్మము రుద్రాక్ష మంత్రములని యెనిమిది విధములై యున్నవి. 'ఇమాని శివభక్తానాం భవదోష తతేస్సదా। నివారణైకకార్యాణి ఖ్యాతాన్యావరణాఖ్యయా' సంసార సంబంధమగు దోషజాతముల భక్తుల దరిఁజేరకుండఁ బారఁదోలునవి గాన నివి యావరణసంజ్ఞచేత ఖ్యాతములయ్యెనని చంద్రజ్ఞానాగమమునఁగలదు.

భస్మము: భస్మోత్పాదనము కల్పము అనుకల్పము ఉపకల్పము అకల్పము యని నాలుగు విధములు. కపిలాదుల గోమయమును సద్యోజాత మంత్రమున గ్రహించి వామదేవ మంత్రమునఁ బింగములనొనర్చి తత్పురుషమంత్రమున నెండించి యఘోరమంత్రమున శివాగ్నియందు దహించిన భస్మము కల్పమనంబడుననియు, అరణ్యసంభవమగు గోమయమును దహింపఁజేసిచూర్ణించిన భస్మము అనుకల్పమనంబడుననియు, వస్త్రకాలితముగఁ జేయఁబడిన భస్మమును గోమూత్రముచేఁ బిండీకృతముచేసి కల్పోక్తవిధానమున రచిం

పఁబడిన భస్మము ఉపకల్పమనంబడుననియు, వన్యాపాదితమయిన భస్మము అకల్పమనియుఁ జెప్పబడును.

మఱియు నీభస్మము, గోమయమును భూమియందుఁ బడనీయకయే గ్రహించి పంచబ్రహ్మ మంత్రములచే భస్మమొనర్పఁబడిన శాంతికమగు సంజ్ఞకలదగుననియు, నట్టులే గ్రహియింపఁబడి షడంగమంత్రములతో హోమమొనర్పగా పౌష్టిక సంజ్ఞకలదియగుననియుఁ, బరిశుద్ధదేశముననున్న గోమయమును గ్రహించి ప్రాసాద మంత్రములచేఁ గాల్పగానగు భస్మము కామదమనయగుననియునందే గలదు.

అథర్వణీయ బృహజ్జాబాలమున నీయర్థమే 'ప్రథమ మనుకల్పం ద్వితీయ ముపకల్పం ఉపోపకల్పం తృతీయం అకల్పం చతుర్థం అగ్నిహోత్ర సముద్భూతం విరజానలజం అనుకల్పం వనే శుష్కం శకృత్సం గృహ్యాకల్పోక్త విధినాకల్పితం ఉపకల్పం స్యాత్। శుష్కగోమయం చూర్ణీకృత్వాను సంగృహ్య గోమూత్రైః పిండీకృత్య యథాకల్పం సంస్కృతం ఉపోపకల్పం। శివాగ్నిదగ్ధ మకల్పం ఇత్థం చతుర్విధం భస్మ పాపనివృత్తియే మోక్షం దదాతీతి భగవాన్ కాలాగ్నిరుద్రః' అని వర్ణితమయినది.

'విభూతిర్భసితం భస్మక్షారం రక్షేతి భస్మనోభవంతి పంచ నామాని' విభూతి భసితము భస్మ క్షారం రక్షయను పేర్లుగలగి భస్మము ఐశ్వర్య ప్రదమగుట భూతియనియు, తత్త్వభాసనమగుట భసితమనియు, పాపహారమగుట భస్మమనియు, నాపదల తొలగించునదియగుట క్షారమనియు, భూత భయాదులనుండి రక్షించునదగుట రక్షయనియుఁ బ్రశంసింపఁబడుచున్నది.

'భూత్యై నప్రమదితవ్యం' విభూతివిషయమై యప్రమాదులవు కాకుండుమని శృతి విధించినది. 'అతోపి పాశనిచ్ఛేద లాభాయ ప్రసిద్ధయే ఉద్ధూళనం త్రిపుండ్రంచ ముముక్షుస్సమ్యగాచరేత్'

గాక్షము నుగోరు వాఁడు జ్ఞానియై బంధముక్తి నందుటకఁగాను స్యోద్ధూళన త్రిపుండ్రముల ధరింపవలయును. సత్యశౌచ తపో హోమాదులన్నియు భస్మధారణము లేక వ్యర్థములగుచున్నవి. భస్మ ధారణము కర్మాంగరూపమైనది. 'బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యై శ్శూద్రైరపిచ సంకరైః స్త్రీ భిశ్చధార్యమేతద్వై భస్మాత్యంత శివ ప్రియం' పరమేశ్వరున కత్యంత ప్రియమగు భస్మము నెల్లరు ధరింప వలయును.

భస్మధారణము-ఉద్ధూళనము అవకుంఠనము త్రిపుండ్రము మూఁడు విధములుగ విధింపఁబడుచున్నది. సద్యోజాతాది పంచ బ్రహ్మ మంత్రములచేఁగాని పంచాక్షరిచేఁగాని షడక్షరమునఁగాని మంత్రింపఁబడి జలరహితమగు భస్మము నాపాదశిఖాంతము పూయుట యుద్ధూళనమనియు నట్లే సజలభస్మము నలదికొనుట యవకుంఠనమనియు ముప్పదిరెండు స్థానములయందుఁగాని పదునారు నిమిది లేక యైదు స్థానములయందుఁగాని 'త్రియాయుష మేఖా జమదగ్నేః' ఆదిగాఁగల్గు మంత్రముల మూఁడురేఖలనుంచుకొను త్రిపుండ్రమనియుఁ జెప్పఁబడుచున్నది.

ధర్మరత్నావళియందు 'మధ్యమానామి కాంగుష్ఠైరలాటే త్రిపుండ్రకం తత్త్రిపుండ్రం భవేచ్ఛస్త మనులోమ విలోమతః' మధ్యమానామి కాంగుష్ఠములచే ననులోమ విలోమముగా ధరించిన త్రిపుండ్రము ప్రశస్తమనియు ధర్మప్రవృత్తియందు 'నేత్రయుగ్మ ప్రమాణాంతు త్రిపుండ్రం ధారయేద్ద్విజః' లలాటమున నేత్రయుగ్మ ప్రమాణముగా ద్విజులు త్రిపుండ్రము ధరింపవలయుననియుఁగలదు.

'జలేన మిశ్రితాభూతి రగ్నిష్టోమాత్మికా' జలముతోఁగలసి యున్న విభూతి యగ్నిష్టోమాత్మికమగుట యనంత ఫలదాయిని యగు ను, నగ్నిహోత్రజమగు భస్మము నీశానాది మంత్రములచేత

మూర్ధ్నాదులయందు నుంచుకొనుటయే భస్మస్నానమగుననియు నిది యాగ్నేయస్నానమని చెప్పఁబడుననియుఁ బ్రాజ్ఞుఁడు సర్వకర్మ సమృద్ధ్యర్థము దీని నాచరింపవలయుననియు సర్వజ్ఞతీర్థ ఫలాదులు భస్మధారణముననే ప్రాప్తించుననియు యతులకు జ్ఞానదమును వనస్థులకు వైరాగ్యమును గృహస్థులకు ధర్మవృద్ధికరమును బ్రహ్మచారులకు స్వాధ్యాయప్రదమును సర్వులకనంత ఫలదాయియునై భస్మధారణము ప్రశంసింపఁబడుననియు జ్యోతియను సమామ్నాయము గల భస్మమును ధరించి సంసారసాగరమునుండి నరుఁడు ముక్తుఁడగుననియు బృహజ్జాబాలాద్యుపనిషత్తులయందు శివాగమములయందును బ్రకటనముచేయఁబడియున్నది.

'త్రిపుండ్రేణ వినా సంధ్యా త్రిపుండ్రేణ వినా జపం త్రిపుండ్రేణ వినా శ్రాద్ధం రాక్షసం పరికీర్తితం' త్రిపుండ్రధారణములేక యొనర్చిన జపతపాదులు రాక్షసములని యార్యుల యభిప్రాయము. త్రిపుండ్రమును ధరించక విప్రుఁడు శివార్చనచేయుట కధికారి కాఁజాలఁడు. అగ్రవర్ణములనుండి క్రమముగా క్రిందివర్ణములవారు భస్మమును గ్రహింపవలయును. భస్మధారణము జ్ఞానమోక్షాది సాధనమని శిష్టులు వచించిరి.

'యత్రభుంజీత భస్మాంగీ మూర్ఖోవా పండితోఽథవా తత్ర భుక్తే మహాదేవః సపత్నీకో వృషధ్వజః' ఎచట మూర్ఖుఁడుగాని పండితుఁడుగాని భస్మధారి భుజించుచున్నాఁడో యచట సపత్నీకుఁడగు శివుఁడు భుజించుచున్నాఁడని స్మృతులయందుఁ గలదు. బృహజ్జాబాలమున విష్ణ్వాదిప్రశంసాంతరము 'సర్వే తే భస్మదిగ్ధాంగాః' వారందరు భస్మముధరించిరని చెప్పుటచే ముద్రాది శిష్టాదృతమని చెప్పకయె చెప్పుచున్నది. మద్యం పీత్వా గురుదారాంశ్చ గత్వా స్తేయం కృత్వా బ్రహ్మహత్యాంచ కృత్వా భస్మచ్ఛన్నో భస్మశయ్యాశయానో రుద్రాధ్యాయీ ముచ్యతే సర్వపాపైః' అను శాతాతప

స్మరణములు మహా పాపోపపాపములు భస్మధారణముచే హరించు నను నభిప్రాయమును వెల్లడించుచున్నవి. వేదమంత్రములచే ధరించిన భస్మ త్రిపుండ్రాదులకు శివ బ్రహ్మ విష్ణ్వాది సర్వదేవతల తృప్తియే కారణమగుచున్నది

'బ్రాహ్మణానామయం ధర్మః' ఇది బ్రాహ్మణ ధర్మమని త్రిపుండ్ర ధారణము విధింపఁబడియున్నది శివాగ్ని జనితమగు భస్మమును ధరించుట శివయోగులకు ముఖ్యమైనది.

'ఊర్ధ్వపుండ్రం భవేత్సామ మధ్యపుండ్రం యజూంషిచ। అధః పుండ్రమృచస్సాక్షాత్ తస్మాత్ పుండ్రం త్రియాయుషం' త్రిపుండ్రములు క్రమముగా సామవేద యజుర్వేద ఋగ్వేదములని చెప్పబడినది. మహాభారతానుశాసనిక పర్వమున 'అహం పశుపతిర్నామ మద్భక్తాయేచమానవాః సర్వే పాశుపతా జ్ఞేయాః భస్మదిగ్ధతనూరుహాః' రక్షార్థం మంగళార్థంచ పవిత్రార్థంచ భామిని లాంఛనార్థంచ భక్తానాం భస్మదత్తం మయాపురా। ఆయుష్కామోథవా రాజన్ భూతికామోథవానరః నిత్యం వై ధారయేద్భస్మ మోక్ష కామీచయోద్విజః' నేను పశుపతిని భస్మమునుధరించు నాభక్తులందరు పాశుపతులు. రక్షణముకొఱకను మంగళముకొఱకు పవిత్రమునకు లాంఛనముకొఱకను భక్తులకు భస్మము నొసఁగితినని పరమేశ్వరుఁడు దేవితోఁ జెప్పినట్లును మఱియును నాయువునుగాని యైశ్వర్యమునుగాని మోక్షమునుగాని కోరునాతఁడు ముఖ్యముగా భస్మమును ధరింపవలయుననియుఁ గలదు.

'అగ్నిహోత్రాగ్నిజం తద్వద్విరజాహోమజం తథా। ఔపాసన సముత్పన్నం సమిదగ్ని సముద్భవం పచనాగ్ని సముత్పన్నం దావానల సముద్భవం। భస్మాని షడ్విధాన్యాహుస్సర్వ పాపహరాణిచ' కల్ప భేదమునను సరించి భస్మము, అగ్నిహోత్రజము విరజాహోముజనల ఔపాసనాగ్నిజము సమిదగ్నిజము పచనాగ్నిజము దావానలజము

అని భస్మ మూఁడు విధములుగాఁ జెప్పుచున్నారు. అందుఁ దైవర్ణి కులకు నిత్యాగ్నిహోత్రజంబును విరజాహోమజంబునగు భస్మమును, గృహస్థులకు నౌపాసనాగ్నిజమగు భస్మమును, బ్రహ్మచారులకు సమిదగ్నిజమగు భస్మమును, శూద్రులకు శ్రోత్రియాగారపచనాగ్నిజ మగు భస్మము నితరులకు దావానలజమగు భస్మమును ధరింపఁదగి నవి. ఆదిత్యపురాణమందు, బ్రాహ్మణుఁడు గృహ్యాగ్నియందుఁగాని శివాగ్నియందుఁగాని జనించిన భస్మమును సకల కర్మములు చేయు నపుడు ధరింపవలయునని గలదు.

జాబాలుఁడు 'త్రియాయుషేణమంత్రేణ ద్విజాస్త్రిర్యక్త్రిపుం డ్రకం మేధావీత్యాదినావాపి బ్రహ్మచారి దినేదినే త్రియంబకేన మంత్రేణ ప్రణవేన శివేన వాగృహస్థశ్చ వనస్థశ్చ ధారయేచ్ఛ త్రిపుండ్రకం ఓంకారేణ తారుక్తేన సహంసేన త్రిపుండ్రకం ధారయే ద్భిక్షుర్నిత్యం ఇతిజాబాలకీస్మృతిః' త్రియాయుష మంత్రముచేత ద్విజులును మేధావీభూయాస మిత్యాది మంత్రములచే బ్రహ్మచారి యును త్రియంబకం యజామహే యను మంత్రముచేతగాని ప్రణ వముచేతఁగాని శివనామముచేతఁగాని గృహస్థ వనస్థులును హంస మంత్రముతోఁగూడిన ప్రణవత్రయముతో యతియును భస్మమును ధరింపవలయునని శాసించెను.

'ప్రాతఃకాలేచ మధ్యాహ్నే సాయాహ్నేచ త్రిపుండ్రకం పితేన భస్మనాకుర్యాత్ సరుద్రోనాత్రసంశయః' ప్రాతఃకాలమం దును మధ్యాహ్నమందును సాయంకాలమునందును పరిశుద్ధమయిన భస్మముచేఁ ద్రిపుండ్రముల నెవఁడు ధరించుచున్నాఁడో యాతఁడు శివస్వరూపుఁడగుచున్నాఁడు.

భస్మధారణ మాత్మశక్తిని నిర్మలమొనర్చి పెంపొందించును అహంకారము నణచి తామసప్రభావమును నిర్వీర్యముగ నొనర్చును శైత్యవాతజములగు ననేక వ్యాధులకు భస్మధారణము సిద్ధౌషధమని

యూాయుర్వేదమున నిర్ణయింపఁబడియెను. భస్మమును ధరించిన నరుఁడు పూజ్యుఁడగుచున్నాఁడు. దుష్టములగు మనశ్శక్తులు భస్మధారణముచే భస్మసామ్యములగును. వాత్స్యాయనుఁడు కామజ్వరమునకుఁ దద్వికారములకును భస్మధారణ భస్మస్నానములు నివారణ సాధనములని వచించెను. యోగమార్గ ప్రవిష్టుఁడు సహితము భస్మమును ధరింపక సిద్ధినొందఁజాలఁడు. కాయశోధన సాధనమై భస్మము మానసిక స్థిరత్వము నొసఁగి సర్వగ్రహబాధానివృత్తికిఁ గారణమగుచున్నది. దుష్టత్వమందిన శారీరక మలములు సంధిస్థాన ప్లావితమగు భస్మప్రయోగముచే శుద్ధమగుచున్నవి. అగ్నివీర్యమగు భస్మము నాశ్రయించిన సాధకుఁడు క్రమముగా నాయురారోగ్యైశ్వర్యముల నందుటయేగాక పరశివానుగ్రహమునకు సహితము పాత్రుఁడగుచున్నాఁడు. శాంభవదీక్షాంగకమగు భస్మము భక్తజనులకు సంసారదోష తూలదావానలమై శివునకుఁ బ్రియమయిన దగుట యనంత ఫలప్రదమై ముక్తిసాధనమగుచున్నది.

భస్మధారణ చేయవలసిన 32 స్థానములు:- శిరస్సు లలాటము చెవులు నేత్రములు ముక్కు ముఖము కంఠము భుజద్వయము మోచేతులు మణికట్లు హృదయము పార్శ్వములు నాభి గుహ్యద్వయము ఊరువులు మడిమలు జానువులు పిక్కలు పాదములు.

భస్మధారణ చేయవలసిన 16 స్థానములు :- శిరస్సు లలాటము కర్ణద్వయము గళము భుజద్వయము హృదయము నాభి పృష్టము బాహుయుగ్మము మూపులు మణికట్లు.

భస్మధారణ చేయవలసిన 8 స్థానములు:- శిరము లలాటము రెండుచెవులు భుజయుగ్మము హృదయము నాభి.

భస్మధారణ చేయవలసిన 5 స్థానములు:- ముఖము రెండు చేతులు హృదము నాభి.

రుద్రాక్ష :- స్కాందమహాపురాణమున 'రుద్రస్యాక్షితయా విప్రాః రుద్రాక్షమితికీర్తితః। రుద్రాక్షధారకేశ భుః పరిపూర్ణ కటాక్షవాన్' రుద్రనేత్రోద్భవములగుటవలన రుద్రాక్షలని చెప్పబడుచున్నవి. నరుఁడు రుద్రాక్షలను ధరించి యీశ్వరుని పరిపూర్ణ కటాక్షమునకుఁ బాత్రుఁడగుచున్నాఁడని గలదు.

'విప్రాదీనాం క్రమాత్ శ్వేతం పీతం రక్తమథాసితం। తథా లాభేయథాలాభం ధారణీయ మదూషితం। క్రిమిదష్టం ఛిన్నభిన్నం కంటకైర్హీనమేవచ। వ్రణయుక్త మవృత్తంచ షడ్రుద్రాక్షాన్ విసర్జయేత్' విప్రులు శ్వేతములగు రుద్రాక్షములను క్షత్రియులు పచ్చనివియు వైశ్యులు యెఱ్ఱనివియు నన్యులు నల్లవియగు రుద్రాక్షలను ధరింపవలయును. అట్లు లభింపనిచో యథాలాభములయిన వియు క్రిమిదష్టములు కానివియు కంటకరహితములయినవియు మచ్చలులేనివియు వృత్తసహితములయినవియు నగు రుద్రాక్షలను ధరింపవలయునని క్రియాసారమునందుఁగలదు. అందు నుసిరికఫల ప్రమాణములు గలవి యుత్తమములనియు బదరీఫలములంతయుండునవి మధ్యమములనియు చణమాత్రములగునవి యధమములనియు నందే వచింపఁబడెను.

శివతత్వ సుధానిధియందు 'ధారయేత్సర్వకాలంతు రుద్రాక్షాన్ శివపూజకః' శివారాధనచేయు నతఁడు రుద్రాక్షల ధరించి తీరవలయునని శాసింపఁబడినది. 'శిరసీశాన మంత్రేణ కంఠే తత్పురుషేణతు। అఘోరేణగళేధార్యంతే నైవహృదయేపిచ। అఘోరాఖ్యేన మంత్రేణకరయోర్ధారయేత్సుధీః। పంచాశదక్షసహితాం వ్యోమవ్యాపీతిచోదరే పంచబ్రహ్మభిరంగైశ్చత్రి మాలాపంచసప్తచ। అథ వామూల మంత్రేణ సర్వాణ్యక్షాణిధారయేత్।' శిరము నందీశాన మంత్రముచేతను గళమునందు తత్పురుష మంత్రముచేతను హృదయమునందు అఘోరమంత్రముచేతను చేతులయందీశానమంత్రము

చేతను ఉదరమునందు వ్యోమవ్యాపియను మంత్రముచేతను పంచ బ్రహ్మ షడంగ మంత్రములచే త్రిసరాదులను యిట్లు రుద్రాక్షలను ధరింపవలయును మూలమంత్రముచేతనే రుద్రాక్షలను సర్వావయవములయందును ధరింపవచ్చును.

'రుద్రాక్షమాలయాజప్తో మంత్రోనంత ఫలప్రదః' రుద్రాక్ష మాలచే జపింపబడిన మంత్రమనంత ఫలప్రదమగును. 'అష్టోత్తర శతైర్మాలాం జపయజ్ఞే ప్రకల్పయేత్' జపమాల యష్టోత్తరశత సంఖ్యగలిగియుండవలయును. 'యోధత్తేమాలికాం భక్త్యాత్వష్టోత్తర శతైర్యుతాం కైలాసే స్వజనైస్సాకం మోదతేశివసన్నిధౌ' అష్టోత్తరశత సంఖ్యగల మాలను భక్తిచే ధరించిన నాతండు కైలాసములో శివసన్నిధానమందు స్వజనముతోగూడుకొని సంతోషమును బొందుచున్నాడనియు, 'యస్యదేహేథ వేదేకో రుద్రాక్షశ్శివభావకః శివాలయంతు తద్దేహం' ఎవని శరీరమందొక రుద్రాక్షయున్న నా దేహము శివాలయ సమమగుననియు 'స్వయమేవకృతం ద్వారం రుద్రాక్షం స్యాదిహోత్తమం। యత్తుపౌరుష యత్నేన కృతం తన్మధ్యమం భవేత్' దాని యంతటనదియే బెజ్జముపడియున్న రుద్రాక్షములుత్తమములు, మానవులచే వేయంబడిన రంధ్రముగల రుద్రాక్షములు మధ్యమములనియుం గ్రియాసారమునంగలదు.

'శిఖాయామేకరుద్రాక్షం। త్రింశత్తు శిరసావహేత్ ద్వాత్రింశత్తుగళేదద్యాత్! బాహ్వోష్షోడశ షోడశ। ద్వాదశం మణిబంధే స్కంధే పంచశతంవహేత్' శిఖయందొక్కటియు శిరంబున ముప్పదియు కంఠమున ముప్పదిరెండును బాహువులయందుం బదునారేసి చొప్పునను మణిబంధములం బన్నెండు లెక్కను కంఠమునన్నూరువందల రుద్రాక్షలను ధరింపవలయునని చంద్రజ్ఞానాగమమునంగలదు.' కంఠే రుద్రాక్షమాలాం యోధృత్వాకర్మకరోతిచ సోపిరుద్రత్వమాప్నోతి' కంఠమందు రుద్రాక్షమాలను గ చి కర్మలచేయునాతండును

సహస్ర సంఖ్యాకములగు రుద్రాక్షల ధరించునాతఁడును రుద్రసము లగుచున్నారని స్కాందపురాణమున వచింపఁబడినది. మఱియు భూతిరుద్రాక్షములధరించి యొనర్చిన సుకర్మంబులన్నియు నక్షయ ఫలప్రదములగునవి యగుటయేగాక పరమేశ్వర ప్రీతికరము లగు ననియు నందే చెప్పఁబడినది.

కాలాగ్నిరుద్రమందు 'త్రిశతం అధమం పంచశతం మధ్యమముచ్యతే। సహస్రముత్తమం ప్రోక్తం। ఏవంభేదేనధారయేత్' మూఁడువందల రుద్రాక్షల ధరించుట యధమమనియు నైదువందల రుద్రాక్షల ధరించుట మధ్యమమనియు సహస్రరుద్రాక్షల ధరించుట యుత్తమమనియు సహస్రపరిమితిగల రుద్రాక్షముల నొకసంవత్సరము ధరించి బ్రహ్మత్వమును రెండు సహస్రముల రుద్రాక్షముల రెండు సంవత్సరములుధరించి విష్ణుత్వమును మూఁడు సహస్రముల రుద్రాక్షలను మూఁడు సంవత్సరములు ధరించి మానవుఁడు శివతత్వమును పొందగలరని చెప్పఁబడినది.

రుద్రాక్షధారణము నిత్యవిధియనియు మహాపాపోపపాపము లకు రుద్రాక్షధారణము ప్రాయశ్చిత్త రూపమైనదనియు బృహజ్జాబాలమున విధింపఁబడినది. నిర్ణయసింధువునందు 'రుద్రాక్షమూలం బ్రహ్మాచ తన్నాళం విష్ణురుచ్యతే అగ్రం సదాశివం ప్రోక్తం బిందువత్సర్వదేవతాః। రుద్రాక్షమూలంబున బ్రహ్మయు రంధ్రంబున విష్ణువును అగ్రంబున శివుండును వలయంబున సర్వదేవతలునుందురని గలదు. ఇద్దాన రుద్రాక్షలధరించియు స్పృశించియు ధ్యానించియు పూజించియు జపమొనర్చియు జనుండు సర్వదేవప్రీతియు, తద్వారా శివానుగ్రహమునుబొంది యుత్తమ ప్రదప్రాప్తుఁడగును.

శైవసిద్ధాంత శిఖామణియందు 'గవాంకోటి ప్రదానస్య యత్ఫలం భువిలభ్యతే। తత్ఫలం లభతేమర్త్యో నిత్యరుద్రాక్షధారణాత్' నిత్యరుద్రాక్ష ధారణమువలన కోటి గోదానఫలము భువియందు

బహుపుణ్యప్రదమగు రుద్రాక్షనొకటియేని యెవఁడు ధరింపఁడో వానిజన్మ నిరర్థకమనిగలదు.

గురువు:- 'ఆచార్యదేవోభవ' యని శ్రుతి గురుగౌరవమును బ్రకటించినది. గురుడే పరశివస్వరూపుఁడు ఈయర్థము శైవసిద్ధాంత శిఖామణియందు 'గురుపూజైవ పూజాస్యాత్ శివస్యపరమాత్మనః' గురుపూజయే శివపూజయగునని వ్యవహరింపఁబడినది. గురుని శివునిగనే భావింపవలయును. గురునామస్మరణము చేయుచుండవలయును. 'గురుత్యాగీ భవేద్రోగీ మంత్రత్యాగీ దరిద్రకః గురుమంత్రోభయత్యాగీ రౌరవం నరకం వ్రజేత్' గురువునువీడి రోగమును మంత్రమునువీడి దారిద్ర్యమును రెంటిఁవీడి మహారౌరవమను నరకమనుభవించుచున్నాడు.

'గుకారస్త్వంధకారస్తు రుకారస్తన్నిరోధకృత్ అంధకారనిరోధత్వాత్ గురు రిత్యభిధీయతే' గుకారమునకు అంధకారమని యర్థము. రుకారమునకు నిరోధమని యర్థము. అంధకారసదృశమగు నజ్ఞానమును బోగొట్టి జ్ఞానమొసఁగు వాడగుటచే గురువని వచింపబడుచున్నాఁడు.

జనకుఁడు విద్యచెప్పినవాఁడు కన్యనొసఁగినవాఁడు మొదలుగాగలవారలు గురువాచ్యులయినను సంసారార్ణవతారకమగు శివజ్ఞానముపదేశించిన గురువు గురుకక్షయందుత్తమోత్తముఁడగునని క్రియాసారమునఁగలదు

అనుదినము మనము 'గురుబ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః॥ గురుస్సాక్షాత్పరబ్రహ్మ' అని గురుస్తవమును గురువు సర్వాధికుఁడగుటచేతనేగదా చేయుచుండుట

'గుణాతీతః పరశివః గురురూప ముపాశ్రితః। గుణాన్ రుంధ ఇతిప్రోక్తో గురుశబ్దస్య విగ్రహః। గుణత్రయం వ్యపోహ్యాగ్రే శివం బోధయతీతిసః। తస్మాద్గురు శరీరంతు గురులింగం భవేద్బుధాః

నిర్గుణుడగు పరశివుఁడే గురురూపము నాశ్రయించి ప్రపంచమునఁ బ్రకాశించుచున్నాఁడు. సత్త్వరజస్తమోగుణత్రయములను నిరోధింపఁజేసి శివుని బోధింపఁజేయువాఁడగుటచే "గురువని" వచింపఁబడుచున్నాఁడు. ఆకారణమువలననే గురుశరీరము గురులింగస్వరూపమని చెప్పబడినదని క్రియాసారమునఁగలదు.

గురుః గృహస్థ ఏవస్యాత్' గురువు గృహస్థుఁడుగనే యుండవలెనని చంద్రజ్ఞానాగమమునఁగలదు. మరణ భయార్తుఁడగు శిష్యునకు గురుచరణము శరణమగుచున్నది. గురుపత్నియు నాతని సోదరులును పుత్రులును తండ్రియు తల్లియును శిష్యునకు గురుసమానులగుచున్నారు గురువుమాత్రము శివస్వరూపుఁడే యగునని భావింపవలయుననియు, యాత్రలు దేవయాత్ర,తీర్థయాత్ర గురుయాత్రలని మూఁడువిధములనియు నందులో గురుయాత్రయే యధికమయినదనియు శివపురాణమునఁగలదు.

గురుపూజావిధినివీడి యెవఁడు ముక్తినిఁ గోరుచున్నాఁడో యాతనికీశ్వరుఁడు పరాఙ్ముఖుఁడగుచున్నాఁడు. గుర్వారాధనము ప్రధానధర్మమని సకలశాస్త్రములయందును బ్రశంసింపఁబడియున్నది. సూర్యోదయములేక తమమెట్లు వీడదో యట్లే గురూపదేశములేక యజ్ఞానము నశింపదు. గురుఁడు భగవంతుఁడగుట గురుమందిరము దేవమందిరమగుచున్నది. శ్రేయోర్థియగు నాతఁడెవ్వఁడును శమదమాది సద్గుణసంపన్నుడగు గురునాజ్ఞను మీఱరాదని శివపురాణమునఁగలదు. మఱియు నందే 'గుర్వోర్దండ నమస్కారం నిర్లజ్జో గురువన్నధా' గురునకు దండప్రణామమును నిర్లజ్జతో నాచరింపవలయును. గురు పాదోదకప్రసాదముల గ్రహించుట శిష్యునకుఁ బాశవిచ్ఛేదన కారణమగుచున్నది. రసవేధాది క్రియలవలన లోహము స్వర్ణమగునటుల గురు టాక్షువలన శిష్యుఁడు శివప్రసాదము నొందుచున్నాఁడని గలదు.

గురునమస్కారమొనర్పక నెవ్వడేకార్యమును జేయుచుండుట శాస్త్రసిద్ధమేగాక లోకమందు శిష్టాచార సాంప్రదాయకముగఁగూడ నున్నది. రండాగర్భమువోలె గురుశిక్షితముకాని విజ్ఞానము విలువగలిగి యుండదు. గురు పాదోదకమును స్వీకరించియు గురోచ్ఛిష్టమును భుజించియు గురు మూర్తిని ధ్యానించియు గురు నామజపమొన ర్చియు శిష్యుడు నిశ్చయముగ ముక్తినందుచున్నాఁడు. గ్రహాణ ప్రదోషాదులయందును కార్తికాదిమాసములయందును ప్రతిసోమ వారంబునను జేయఁబడు గురుపూజాఫలము కేవలము మోక్షప్రాప్తికి సాధనమని వచింపఁబడినవి. రిక్తహస్తుఁడై గురుదర్శనమునకుఁ జను టయు గుర్వాజ్ఞ నందకయే యుపవిష్టుఁడగుటయు గురుసమక్షమున గురువునకంటె నున్న తాసనమునఁ గూరుచుండుటయుఁ పాపకారణ ముగ శివపురాణమున నిర్దేశింపఁబడినది. మఱియు నప్రత్యక్షుఁడగు పరశివుడు ప్రత్యక్షమగు గురురూపమున శిష్యునుద్ధరింపనే తెంచునను శివపురాణవచనము శిష్యునకు గురువునందుండవలసిన భక్తిప్రవత్తును నిరూపించుచున్నది.

సూతసంహితయందు 'దినేదినే గురోః పూజాంకుర్యాద్వర్ధాది భిర్నరః' ప్రతిదినమందును గురుపూజను జేయుచుండవలెనని చెప్పుట గురుపూజ నిత్యవిధియే యునియు 'గురోరనిష్టం మోహాద్వాకుర్యాత్ కురుతే యది. పచ్యతే నరకే తీవ్రే యావదాభూతసంప్లవం' తెలియక యేని గురువు నకసమ్మతియగుపని చేయఁగూడదు. అట్లుచేసినవాఁడు జగమున్నంతకాలము తీవ్రనరకంబులన ననుభవించుననియుఁగలదు.

పితృమాతృగురువులయందు భక్తిలేనివాఁడొనర్చిన సకల ధర్మంబులు నిరర్థకంబులగుచున్నవి. దేవ - ద్విజ-గురు-ప్రాజ్ఞపూజ నము శారీరక తపమని భగవద్గీతయందుఁగలదు.

'శివేమంత్రే గురౌయస్య భావనాసదృశీ భవేత్। భోగో మోక్షశ్చ సిద్ధిశ్చ శీఘ్రం తస్యభవేద్ధ్రువం' శివునియందును మంత్ర

మంపును గురువునందును సమానముగు భావనగలవానికి స
సిద్ధియు భోగమోక్షంబులును శీఘ్రింబుగఁ జేకూరుచున్నవి.

అశక్తుఁడు సోమవారములయందును శక్తుఁడెల్లకాల
దప్పనిసరిగ గురు చరేశ్వరారాధన మొనర్పవలయునని శైవశ
ములయందు విధింపఁబడియున్నది కార్తికమునందు భూతి
ద్యాది భూషితుఁడును షట్స్థలవేదియు సదాచారసంపన్న
శివజ్ఞాన ధురంధరుఁడును లింగాంగియు వర్ణాశ్రమోచిత
లక్షణ సంపన్నుఁడగు గురునకు శిష్యుఁడు నమస్కరించి 'ఆ
కాయామారోప్య గజే వాపితురంగమే అనుగచ్ఛేత్స్వయం
వాద్యఘోషసమన్వితః। గురుం నీత్వాగురుం పశ్చాత్ ద్యా
తత్పదద్వయం తేనోదకేనశిరసి సంప్రోక్ష్య స్వజనైస్సహ
హస్తావలంబంచ తతోనీత్వాగృహాంతరం ప్రకల్ప్యచాసనం
నివేశ్యప్రీతిపూర్వకం యథావిధ్యవధానేన పూజయేద్గురు మవ
త్రయోదశ్యాదిషుగురుం అర్చయేత్సూర్యమంటపే శివభక్తాన్
కాన్ పత్న్యాసహ దృఢవ్రతః పూజయేత్ భోజనాద్యైశ్చ'
నాందోళికాదులయందు వసింపఁజేసి వాద్యఘోషములతో
పాదోదకమును స్వజనులతో శిరంబునఁదాల్చి గృహాంతర
బ్రవేశింపఁజేసి యథావిధి 'త్రికాలం వాథవట్కాలం ప్రదో
త్రికాలములయందుఁగాని యారుకాలములయందుఃగా ప్రదో
నందుఁగాని పూజింపుచు త్రయోదశ్యాదులయందు శూన్య
పాదులయందు గురువు నర్చింపుచు సపత్నీకులగు శివభక్తుల
తానును సపత్నీకుఁడై వారిచందఱ భోజనపూజనాదుల నం
జేయవలయునని చంద్రజ్ఞానాగమ సహితయందుఁ దెలియఁ
బడినది. గురుచరేశ్వరారాధనరూపకమై మోక్షసాధనముగు
సత్కర్మమునే గణార్చనయని వ్యవహరింతురు.

'గురుసంతోషయావృద్ధిః' 'గురుబుద్ధిర్విశేషతః' యీ మొదలగు నాప్తవాక్యములు గురుసంతోషమువలన వృద్ధియు గురుబుద్ధి విశేషమయినదనియు గుర్వాధిక్యతను బోధింపుచున్నవి. గురువనగ దీక్షనొసగినవాడని యర్థము. శిష్యులను బాధించు గురువులు మూర్ఖులనియు బాధగురువులనియు పిలువబడుదురు.

ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదం। మంత్రమూలం గురోర్వాక్యం। ముక్తిమూలం గురోః కృపా। గురుమూర్తియే ధ్యానకారణము. గురుపాదములె పూజకుంగారణములు. గురువాక్యమే మంత్రమునకు మూలము. గురుకృపయే మోక్షమునకు హేతువని గురుగీతయందు నిర్దేశింపఁబడినది.

నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం। శివశాసనత శ్శివశాసనతః శివశాసనత శ్శివశాసనతః' గురువుకంటె నధికుండు లేడులేడని శివశాసనము బోధించుచున్నది.

మంత్రము:—'మననాత్ త్రాయత ఇతిమంత్రః' మననము చేయుటచే రక్షించునదిగాన మంత్రమయ్యెను. 'సర్వేషామేవ తత్త్వానాం మూలం శివ ఇతిస్మృతం తస్మాన్మూలమితిజ్ఞేయం' సర్వతత్త్వములకు శివతత్త్వము మూలమయినదగుట శివమంత్రమునకు మూలమంత్రమను వ్యవహారము గల్గెననియు వేదాగమములయందీ శివమంత్రము పంచాక్షరమనియు ప్రణవయుతమై షడక్షరమగుచున్నదనియు శివాత్మికమయిన నీమంత్రము విధివాక్యముగాని యర్థవాదము కాదనియు 'భవసాగరమగ్నానాం దేహినాం హితకామ్యయా ప్రాహోంనమశ్శివాయేతి మంత్రమాద్యం హరస్స్వయం' భవసాగరమగ్నుల జన్మబాధాప్రశమనార్థము శివుఁడే 'ఓం నమశ్శివాయ' యను నీమొదటి మంత్రమును వచియించెననియు శివపురాణ వాయవీయసంహితయందుంగలదు. మఱియు నందే 'జపేన యోగసిద్ధిస్స్యాత్ యోగాత్ జ్ఞానంచ విందతి। జ్ఞానేన మోక్షమాప్నోతి

తస్మాత్ జప్యో మహామనుః' జపముచే యోగసిద్ధియు సద్జ్ఞానమును దానివలన మోక్షమును గల్గుగావున మహామంత్రమగు షడక్షరమును జపింపుమనియుఁగలదు.

'అఉమాశ్చైవనాదశ్చ కలాచేత్యఁశ పంచకం మిళిత్వా ప్రణవోజజ్ఞే సూక్ష్మపంచాక్షరాత్మకః। తథానమశ్శివాయేతి స్థూలపంచాక్షరోభవేత్ ప్రతిపాద్యే మహత్వేపి నానయోర్విద్యతేభిదా' సూక్ష్మపంచాక్షరమనియు స్థూలపంచాక్షరమనియు పంచాక్షరీ మహామంత్రము రెండువిధములైయున్నది. అకారము ఉకారము మకారము నాదముకలయను వాటితోఁగూడి యైదు భాగములై ప్రణవము 'ఓమ్' అయ్యెను. ఇదియే సూక్ష్మపంచాక్షరమని చెప్పఁబడుచున్నది. ఇందు మకారమే బిందువని గ్రహింపవలయును. అటులే 'నమశ్శివాయ' యనునది స్థూలపంచాక్షరమయ్యెను. ఈ రెంటికి నర్థమందును మహిమాదులయందు నించుకయైనను భేదము లేదు.

సిద్ధాంతసారావళియందు 'నమఃపీఠ మితిప్రోక్తం శికారం మధ్యమీరితం వాకారం గోముఖం వృత్తం యకారం గోళకంస్మృతం ఓంకారం లింగమాఖ్యాతం షడ్వర్ణం లింగముచ్యతే' షడక్షరీ మహామంత్రమందలి నమః పదము పీఠమనియు శికారము మధ్యమమనియు వాకారము గోముఖయుక్తమగు వృత్తమనియు యకారము గోళకమనియు ఓంకారమే లింగమనియు నిట్లు శివరూపముగా నుదహరింపఁబడినది.

మఱియు శివానుభవసూత్ర షష్ఠాధికరణమున నకారమాదిగా నీమంత్రమాచారాది పఞ్చలింగములుగ నుదహరింపఁబడినది. శైవసిద్ధాంత శిఖామణియందును 'ఓంకార వదనా దేవీ వాయకార భుజద్వయీ శికారదేహా మధ్యాచ నమకార పదద్వయీ పంచాక్షరీ పరావిద్యాస తారాలింగ రూపిణీ శివస్యతాంత్రిభిధా' యని పూర్వోక్త

మగు నీమహామంత్రము లింగస్వరూపమని చెప్పఁబడినది. ఇత్యాది శివస్వరూపమగుట కతన పరబ్రహ్మయగు శివునియందుగల సంపూర్ణ ప్రయోజనములే యిందును గలవని స్కాందపురాణమున వచింపఁబడినది.

వాయవీయ సంహితయందు 'ప్రథమం ప్రణవం విన్ద్యాద్ద్వితీయంతు నకారకం। మకారం తత్పరం విన్ద్యాచ్ఛికారంచ తతఃపరం వాకారం పరమం విన్ద్యాత్ యకారం షష్ఠయేవచ। ఇత్థం షడక్షరం విన్ద్యాత్॥ అనుటచే మహామంత్రమగు షడక్షరము 'ఓం నమశ్శివాయ' యనియే యేర్పడుచున్నది.

భస్మజాబాలమునందీయర్థమే 'ఓమిత్యగ్రే వ్యాహరేన్నమ ఇతి పశ్చాత్తచ్ఛివాయేతి యని ప్రచురింపబడినది.

ప్రణవముయొక్కయు పంచాక్షరియొక్కయు తుల్యతను విమలాగమమిట్లు నిర్వచింపుచున్నది. 'తారకం దండకంచైవ కుండలీయర్ధచంద్రికం పంచమం బిందుసంయుక్తం ఓమితిజ్యోతిరూపకం ప్రథమం తారకంచైవ ద్వితీయం దండముచ్యతే తృతీయం కుండలాకారం చతుర్థం చార్ధ చంద్రికం పంచమం బిందుసంయుక్తం ఓమితి జ్యోతిరూపకం తారకస్తుభవేత్ బ్రహ్మదండకం విష్ణురుచ్యతే కుండలీతుభవేద్రుద్రో అర్ధచంద్రస్తు ఈశ్వరః బిందుస్సదాశివః ప్రోక్తః ఏవం ప్రణవలక్షణం నకారం తారకంచైవ మకారం దండముచ్యతే శికారం కుండలాకారం వకారం అర్ధచంద్రికం యకారం బిందుసంయుక్తం ఓమితిజ్యోతిరూపకం సద్యోజాతం నకారంచ వామదేవం మకారకం అఘోరంచ శికారంస్యాత్ పురుషశ్చవకారకం ఈశానంచ యకారంస్యాత్ ఓమితిజ్యోతిరూపకం' తారకము దండకము కుండలాకారము అర్ధచంద్రికము బిందుయుక్తమై, తారకము బ్రహ్మగను దండకము విష్ణువుగను కుండలాకారము రుద్రుఁడుగను అర్ధచంద్రమీశ్వరుఁడుగను బిందువు సదాశివుఁడుగను జెప్పఁబడి జ్యోతిరు

కమై ప్రణవమయిన ఓంకారము పంచబ్రహ్మాత్మకమై నకారాది యకారాంతమగు పంచాక్షరితో నకారము తారకమును మకారము దండమును శికారము కుండలాకారమును వకార మర్ధచంద్రికమును యకారము బిందుయుక్తమునగుట సమానమగుచున్నవి.

'నమశ్శంభో భవజ్జీవో శివశబ్దశ్శివో భవేత్ అయశబ్దస్త యోర్యోగోగీయతే శివయోగిభిః' నమశ్శబ్దము జీవుని శివశబ్దము శివుని అయశబ్దము జీవేశ్వరుల సంయోగమును దెలుపుచున్నది.

చంద్రజ్ఞానాగమమందు 'ఇయం ప్రణవపూర్వాషడక్షరీత్యపి గీయతే। ద్విజైరియంతు జప్తవ్యానిత్యం ప్రణవపూర్వికా। స్త్రీభిశ్శూద్రైశ్చ జప్తవ్యా నమోంతాప్రణవంవినా' ప్రణవయుతమై షడక్షరీయని చెప్పుటబట్టి ప్రణవము సర్వమంత్ర సాధారణమగుటచే యీమంత్రమునకు బంచాక్షరియను సంజ్ఞయే ముఖ్యమనియు ప్రణవమును జేర్చుకొను పక్షమున షడక్షరి యను సంజ్ఞగౌణముగాఁ జెల్లుచుండుననియు బ్రహ్మక్షత్రియ వైశ్యులు ప్రణవముతోడను స్త్రీ శూద్రులు ప్రణవరహితముగను (శివాయనమః యని) జపింప వలయుననియు గలదు.

'నమశ్శివాయచ శివతరాయచ' యను వేదమందుగల యీ పంచాక్షరీ మంత్రముచేతనే వేదమునకంతయు బంగరునకుఁ బరిమళ మబ్బినటుల గుణాధిక్యము గల్గినదని వైదికాచార నిర్ణయమందలి యీక్రింది శ్లోకమువలనఁ దెలియుచున్నది. పంచాక్షరీ శివపదేన విభాతి రుద్రాధ్యాయస్తయాస్ఫురతితేన చతుర్థకాండః కాండేన సర్వయజురేవ విభాతితేన ఋక్సామ మధ్యమణినాచ విభాంతివేదా'

పవిత్రమగు నీమహామంత్రమునకు వామదేవుఁడు ఋషియు పంక్తిఛందస్సును శివుఁడు దేవతయు ప్రణవము బీజమును నకారము శక్తియు మకారము కీలకము మంత్రవర్ణము లంగమును కరన్యాస హృదయ న్యాసాదికములగుచున్నవి.

రుద్రాధ్యాయమున 'నమస్తారాయ' యని యీమంత్రము తారకముగఁ జెప్పఁబడినది. ఇతర మంత్రసిద్ధివలన నీమంత్రము సిద్ధింపదుగాని యీమంత్రము సిద్ధించినచో నన్నిమంత్రములు ననాయాసముగా సిద్ధించును. అనంతమహిమాస్పదమై భుక్తిముక్తుల కాకరమై పరమేశ్వరతత్త్వవాచ్య వాచకమునై సాక్షాచ్ఛివతత్త్వమగుట కతన సర్వవిద్యాప్రశంసితమగు నీమంత్రము పంచాక్షరిని బోలు మంత్రము లేదను ఖ్యాతికిఁ బాత్రమయినది.

'సప్తకోటి మహామంత్రకారణం' సప్తకోటి మహామంత్రములకు నీమంత్రమే మూలకారణమైయున్నది. వాయవీయ సంహితయందు ఓంకారాది షడక్షర సంపన్నంబగు నీమహామంత్రము మంత్రముల కెల్ల మేటియైనదగుట సర్వకార్యంబులకును బరమోత్తమ సాధనం బగుచున్నదనియు ప్రధానమగు నీమొదటి మంత్రము నిఖిల విద్యా బీజమనియు శివునికభిధానమయిన నీమంత్రమునకు శివుండభిధేయుఁ డయ్యెననియు శివప్రణీతంబైనదగుట ప్రమాణసిద్ధమైనదగుట కెట్టి సందియము లేనిదనియు సాంగవేదంబులు సకలశాస్త్రంబులతో నీ మంత్రమునను న్నవనియు సకల విద్యాస్థానంబులును దీనికి భాష్య మాత్రములనియు సిద్ధాని జపించువారు తప్పక ముక్తులగుదురనియు పాశబద్ధుఁడును పాశముక్తుఁడును యీపంచాక్షరీ మంత్రముతో న్నర్చించి జపింపగా నాస్వరూపమునే పొందుచున్నాఁడని శివుఁ వచించెననియు నదీక్షితునికంటె దీక్షితుఁడు కోటిగుణితంబగు బుల కర్హుఁడగుటవలన గురూపదేశమునంది దీక్షితుఁడై శివునా చుట యవశ్యకర్తవ్యమనియు భక్తులందరీ పంచాక్షరీ మంత్ర కధికారులేయనియుఁ బ్రతిదినము నష్టోత్తరశత సహస్ర పరిమితిగల మును శివధ్యానపరుఁడై యావజ్జీవమొనర్చి నరుఁడు ముక్తిన ననియు పురశ్చరణమొనర్చి ప్రతిదినము నీమంత్రమును జ

చేయువాఁడు తాను సిద్ధుఁడగుటయే గాక యితరుల కిష్టార్థసిద్ధిఁగలుగఁజేయు సమర్థుఁడగుననియు వచింపఁబడినది.

స్కాందమహాపురాణమునందలి బ్రహ్మోత్తరఖండమునందు 'అగస్త్యరామాదిభిరాదృతత్వాద్వేదమువ్య మంత్రస్యచవైదికత్వాత్। పరస్య తత్త్వస్య చ వాచకత్వాన్నమశ్శివాయేతి సదాజపధ్వం' అగస్త్యరామాదులచే నాదరింపఁబడినదగుటను వేదములయందుఁ జెప్పఁబడియుండుటను పరతత్త్వమునుజెప్పెడి హేతువునను 'నమశ్శివాయ' యను మంత్రమును జపము చేయుఁడని యాజ్ఞాపించుటవలన నీమంత్రమునకుగల శిష్టాదృతత్వవైదికత్వ నిత్యత్వ సర్వమంత్రశ్రేష్ఠత్వాది సంపన్నమగుస్థితి శాస్త్రసమ్మతముగ సిద్ధమగుచున్నది.

ఈమంత్రము సుప్తము పాళితము మొదలుగా మంత్రశాస్త్రోక్తదోషములుగలది కాదు. ఎవ్వరికిని వైరియగునదిగాక సిద్ధముగాని సుసిద్ధముగాని సాధ్యముగాని యగును. సదాచారములేనివానికయినను గురూపదేశమునందక జపముసేయువానికైనను యీమంత్రము నిష్ఫలముకానేరదు. సదాచారవిహీనస్య పతితస్యాంత్యజస్యవా పంచాక్షరాత్ పరంనాస్తి పరిత్రాణంకలౌయుగే' సదాచారరహితునికిగాని పతితునకుఁగాని యంత్యజునకుఁగాని యెట్టివానికైనను గలియుగంబునఁ బంచాక్షరీ మంత్రముకంటె రక్షకమయిన దింకొకటి లేదని చంద్రజ్ఞానాగమమునఁ జెప్పఁబడినది.

మంత్రజపము వాచకము ఉపాంశువు మానసికము యని మూఁడు విధములు. మంత్రవర్ణము లితరుల చెవిఁబడునటుల జపించుట వాచకమగును. పెదవులాడించుచు మంత్రవర్ణముల నెవ్వరికేని వినఁబడకుండాజేయుఁ జపము ఉపాంశువగును. పెదవులనయినఁగదల్పక చలింపకఁజేయు జపము మానసిక జపమగును. ఇందు వాచకముగన్న ఉపాంశువును ఉపాంశువుగన్న మానసికము నుత్కృష్టములై యున్నవి.

'యదిష్టలింగం సంపశ్యన్ వామహస్తస్థితంపరం జపతే
త్ఫలం వక్తుం నమయాశక్యతే'

వామహస్తస్థితమగు యిష్టలింగమును గాంచుచుఁ జేసి
పముయొక్క ఫలము చెప్పశక్యముగాదని క్రియాసారమునఁగలదు.
ష్ఠపుణ్యావన పర్వత నదీ దేవాలయంబుల యందొనర్చెడి జపంబు
హామునఁదొనర్చిన జపముకంటెఁ గోటి గుణంబులధికమగుచున్న
యు ఉష్ణీషకవచధారియు దిగంబరియు జుట్టు విరబోసుకొన్నవాఁడు
చియునై యున్నవాఁడుగాని విలపించువాఁడుగాని జపమొనర్ప
ర్హులుకారనియు నాసనరహితముగను శయనించియు నడచుచు నిలు
చు నమంగళకర వచనంబుల వచించుచు నట్టి ప్రదేశముల వసిం
చు జపముసేయఁదగదనియు నంగుష్ఠముతోఁగూడని జపంబు నిష్ఫ
నియు బూర్వోత్తరములగు దిశలు రెండును జపంబునకు శ్రేష్ఠ
లనియు వాయవీయ సంహితయందుఁ జెప్పఁబడినది. స్కాంద
న బిల్వమూలంబున నన్ను జపించువానికి శీఘ్రమే ప్రసన్నుఁడనై
ష్టార్థసిద్ధిని నొనకూర్తునని శివుఁడు వచించినటులఁగలదు.

కంబళియందాసీనుఁడై జపించిన మనోరథసిద్ధియు కృష్ణాజిన
న ముక్తియుఁ గుశాసనంబున జ్ఞానంబును జిత్రాసనంబున సారో
ంబును శిలయందు దుఃఖమును గల్గుచున్నది.

జపమాల స్ఫటికమాలయగుచో సామ్రాజ్యమును కుశగ్రంథి
ాత్మజ్ఞానమును రుద్రాక్షమాల సర్వమనోరథములను పొగడదండ
క వశీకరణమును ముక్తాఫలములమాల యఖిలవిద్యలను హేమ
ల మైశ్వర్యమును రజితమాల యభిలషిత కన్యను సమకూర్పఁ
వనియు నష్టోత్తరశతగుణితమగు మాల యుత్తమోత్తమ మనియు
గీతయందుఁ జెప్పఁబడినది. వర్ణసంఖ్యాకమగు మాలచే జపించు
నికొక పర్యాయమునకే, పురశ్చరణ పూర్తియగు ఫలము
ంచును.

"విద్యాచతుర్విధా శైవీ పరాపశ్యంతి మధ్యమా వైఖరీ చేత్యర్థ వర్ణపదవాక్య ప్రభేదకః। ఓ మర్థో నాదియాంతం స్యాద్వర్ణ స్తత్ద్వయం త్రియం పదం భవే త్తత్సమిష్టిర్వాక్య మిత్యభిధీయతే। అర్థరూపా పరావిద్యాపశ్యంతీ వర్ణరూపిణీ మధ్యమా పదరూపాస్యాద్వైఖరీ వాక్యరూపిణీ। అర్థో మనోభవో వర్ణో దృగ్భవో వాగ్భవః పదం వాక్యం వపుర్భవత్యేషు మనో దృగ్వాగ్వపూంష్యథా। లక్షణం క్రమశో జ్ఞేయం మనో మననలక్షణం దృగ్విలోకన చిహ్నాస్యా ద్వాగ్వర్ణో మాత్రలక్షణా తాల్వోష్ఠ రసనా యోగలక్షణం వపురుచ్యతే మానసీ చాక్షుషీ జాప్యా వాచకీ వాపుషీ పరా పశ్యంతీ మధ్యమాచేతి వైఖరీ త్యుచ్యతే క్రమాత్॥

అర్థ-వర్ణ-పద-వాక్యభేదముగల్గి పరా-పశ్యంతి-మధ్యమా-వైఖరీ యను నాల్గువిధములగు వృత్తులు పంచాక్షరీవిద్యకు జెప్పంబడినవి. ఇందు, అర్థరూపమయినది ఓం అనియు (ఓమర్థః - ఓంకారమందు, అకారోకార మకారములు గలవు. అకారము లింగమనియు- ఉకారమంగమనియు మకారము సంయోగమనియు - నీహేతువుచే ఓంకారమునకు లింగాంగ సంయోగమనియే యర్థమనియు - పంచాక్షరీ మంత్రమునకును "నమఃపదంతత్క్షలు జీవవాచి శివః పదం తత్పరమాత్మవాచి। అయేతితాదాత్మ్యపదం తదేతన్నమశ్శివాయేతి జగాదమంత్రః" నమఃపదము జీవుని శివపదము పరమాత్మను - అయపదము వాటి సంయోగమును దెలుపుటచే ఓంకారార్థమే పంచాక్షరీ యర్థమగుచున్నది) నాదీయాంతస్యాద్వర్ణః నకారాది యకారాంతము వర్ణరూపమనియు- అందలినమః, శివాయ, యను రెండు, మూడు, అక్షరములు గలవి పదరూపమైనవనియు - నమశ్శివాయయనునది వాక్యమనియుం జెప్పంబడుచున్నది. మనోభవమైనది అర్థమనియు - దృగ్భవమైనది వర్ణమనియు - వాగ్భవమైనది పదమనియు - వపుర్భవమైనది వాక్యమనియు నందు మననలక్షణముగలది మనస్సనియు - విలోకనచిహ్నము

గలది దృక్కనియు- వచోమాత్రమే లక్షణముగాగలది వాక్కనియు- తాల్వోష్ఠరసనా యోగముగలది శరీరమనియుఁజెప్పుటకతన పరావృత్తి మానసికమును - పశ్యంతీవృత్తి చాక్షుషికమును - మధ్యమావృత్తి వాచకియును- వైఖరీవృత్తి వాపుషియునై జపసాధనములగుచున్నవి.

"విద్యాం స్థానం స్వరం రూపం ఋషిం ఛందోధిదైవతం। బీజం శక్తిం తథావాచ్యం స్మృత్వా పంచాక్షరం జపేత్" విద్యను - స్థానమును - స్వరమును - రూపమును - ఋషిని - ఛందమును - దైవతమును - బీజమును - శక్తిని - అర్థమునుస్మరించి పంచాక్షరీ మహామంత్రమును జపము చేయవలయును.

"జపచ్ఛ్రాంతః పునర్ధ్యాయేత్ ధ్యానాచ్ఛ్రాంతః పునర్జపేత్। జపధ్యానాభియుక్తస్యక్షి ప్రం యోగః ప్రసిధ్యతి" జపమువలన నలసినవాఁడై ధ్యానమును జేయవలయును. ధ్యానమువలన నలసినవాఁడై జపము చేయవలయును. ఇట్లు జపధ్యానములతోఁ గూడినవానికి శివయోగము శీఘ్రముగా సిద్ధించునని శివధ్యానపద్ధతియందుఁ గలదు.

శివగీతయందలి పదునేనిమిదవ యధ్యాయమున నిప్పుడు నా యాకారమును ధ్యానింపుచు నిష్కాముఁడై ప్రణవమునుగాని షడక్షరమునుగాని యెవఁడు పఠించునో యాతఁడా దేహంబుతోడనే మత్సాయుజ్యఁబు చెందునని శ్రీరామచంద్రునకు శివుఁడుపదేశించినటుల గలదు. కల్పభేదముచే రూపాంతరంబుగఁ బ్రస్తరింపబడిన యీమహావిద్యయే సకలకా[illegible] భక్తజనులకొంగు బంగారమై [illegible]థిత మగుచున్నది.

వేదాంతతత్వ పరమామృతసార మంత్రం
చిద్రూప దృక్ పరమశైవ రహస్యమంత్రం
జ్యోతిర్మయోజ్వల ని[illegible]జనరూప మంత్రం
వందే షడక్షరి సదాశివనామ మంత్రం.

## లింగము

శ్లో॥ చైతన్యం పరిపూర్ణమేక మచలం జ్యోతిర్మయం వ్యాపకం
తత్పంచాక్షర మంత్రమాద్యమమలం సూక్ష్మాతిసూక్ష్మం పరం
లింగం బ్రహ్మసనాతనం సుమనసాధ్యాతవ్యరూపం సదా
బాహ్యాభ్యంతర సంస్థితం పరశివం వాగీశ్వరం భావయే॥

శ్లో॥ శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం దక్షభాగేవహంతం
నాగం పాశంచఘంటాం ప్రళయహుతవహం చాంకుశంవా మభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి॥

శ్లో॥ ఆధారాదిసమస్త చక్రనిచయే యోహాం సరూపశ్శివో
నిత్యానంద గురుప్రసాదవిభవాద్భావాది సంజ్ఞోభవత్
ఆచారాదివిభేదతః పునరసౌషడ్లింగరూపో భవ
త్తస్మై శ్రీ గురుమూర్తయే గిరిసుతాభర్త్రేనమస్కుర్మహే॥

సృష్టిస్థితి లయతిరోధానానుగ్రహములను పంచకృత్యములు శివుని కార్యములుగ నిర్దేశింపఁబడినవి ఆ మహనీయుఁడు జీవుల ననుగ్రహించు నిమిత్తము సకల నిష్కళుఁడై ప్రకాశించుచున్నాఁడు శైవసిద్ధాంతమందుఁ బరమేశ్వరునకు సగుణ నిర్గుణరూప మంగీకృతమైయున్నది. ఈవిషయమే కైవల్యోపనిషత్తునందు 'తమాదిమధ్యాంత విహీనమేకం విభుంచిదానంద మ[illegible]పమద్భుతం ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీల[illegible]ం ప్రశాంతం' ఇటులఁబరమేశ్వరుఁడు సావయవ నిరవయవ రూపుఁడుగ వర్ణింపఁబడియున్నాఁడు. 'యోగినాంచ యతీనాంచ జ్ఞానినాం మాంత్రిణాం తథా। ధ్యానపూజానిమిత్తాయ సకలం నిష్కళం భవేత్' శివయోగులకును జ్ఞానులకును [illegible]త్రికాములకు ధ్యానపూజాముల కనుకూలముగ నుండు

నటుల శివుఁడు సకల నిష్కళ స్వరూపము ధరించునని వాతూలాగ మమునఁగలదు. మఱియునందే 'అదృశ్యే భావనానాస్తి దృశ్యమేత ద్వినశ్యతి దృశ్యాదృశ్యస్వభావంచ సారూప్య స్యావలోకనాత్। అస్తి నాస్తి ద్వయాతీత మస్తినాస్తి సమన్వితం సర్వజ్ఞం సర్వరహితం తత్పదంవిద్ధి' అదృశ్యమందు భావనయేలేదు. అదిదృశ్యమునందే కలదు. దృశ్యమంతయు నశించునది. సారూప్యము నవలోకింపు చున్న దృశ్యాదృశ్యభావనకలుగును.

ఈయర్థమే హంసోపనిషత్తునందును 'అరూపే భావనానాస్తి యద్దృశ్యం తద్వినశ్యతి। అదృశ్య దృశ్యరూపత్వే తథానేవాం సదా భ్యసేత్' అని వివరింపఁబడియున్నది అస్తినాస్తియను మాటల కందరానిదియు అస్తినాస్తియను వానితోఁగూడినదియునగు స్థానమునే సర్వవస్తురహితమును సర్వజ్ఞమయినదానిగాఁ దెలిసికొనుము. అని ర్వాచ్యమును స్వలీలానంద హేతువునగు నదియే నాస్వరూపమనియు షణ్ముఖునకు శివుఁడుపదేశించెను.

'బిందుమధ్యగతోనాదః నాదమధ్యేతుమూర్తయః మూర్తి మధ్యగతం తత్త్వం తత్త్వమధ్యగతశ్శివః' బిందు మధ్యమునంది నాద మును నాదమధ్యమునందిమూర్తులను మూర్తిమధ్యమునంది తత్త్వ మును తత్త్వమధ్యమునంది శివుఁడుండునియు 'తత్స్వరూపమిదం లింగం సర్వతత్త్వ[illegible] లింగేన జాయతే సర్వం జగత్స్థావర జంగమం' సర్వతత్త్వములకు నిలయమయినది లింగస్వరూపము. లింగమునుండి చరాచరంబులన్నియు జనింపుచున్నవని చెప్పఁబడియున్నది.

'సర్వంలింగే విజానీయాత్ లింగం సర్వత్రసంస్థితం। సర్వతీర్థాని లోకస్య [illegible]వ్యయజ్ఞ ఫలానిచ యథాచద్యోశ్చ వాయ్వ[illegible] దాని దిత్యా జ[illegible] ఏతేషా ముదయాంతేచ ఆదిశ్లేల్లింగ మధ్యమం। నిత్యః పూర్ణోపరానందో లక్ష్యలక్షణవర్జితః సర్వాధిష్ఠాన [illegible]వైత ల్లింగ మిత్యవధారయేత్' భూతపంచకమునకుఁ గారణమై యుద్స

తీయమై తెలియు లింగమునందే సర్వయజ్ఞ తీర్థ ఫలములు గలవు. సదానందమై పూర్ణమై లక్ష్యాలక్షణరహితమై యన్నిటి కధిష్ఠానమై ప్రకాశించునది లింగమేయని కూర్మపురాణము వాకొనుచున్నది.

సూతసంహితయందు 'శివుఁడే లింగమని వచింపఁబడినది. 'లీయతే గమ్యతే యత్ర యేన సర్వం చరాచరం। తల్లింగం' చరాచరాత్మకమగు సర్వము నెందు తోచుచున్నదో యొందణగుచున్నదో యదియే లింగమని లింగపురాణమున వచింపఁబడినది. 'పరబ్రహ్మాభిధం లింగం' 'లింగేతి బ్రహ్మమాఖ్యాతం' మొదలగు వాక్యములు లింగమే పరబ్రహ్మమని నిర్ణయింపుచున్నవి. 'పరశివే లింగస్వరూపే-లింగరూపాంబికాపతిః' యను శంకరసంహితావచనములు శివుఁడే లింగమనియు నాతఁడే పరబ్రహ్మమనియు వ్యవహరించినవి.

శివతత్త్వసుధానిధియందు జ్వాలామయమును తేజోవంతము నగు లింగ మెద్దిగలదో కల్పాంతమున దేవతలందఱు నందులయమందుదురు. తిరిగి సృష్ట్యాదియందు నాస్థానమునుండియే బ్రహ్మాది సమస్తంబును బయలు వెడలుచుండుననియుఁ దెలుపఁబడినది. ఇట్లగుట శివలింగమే సర్వమునకును గారణమైనదని యేర్పడుచున్నది.

'పీఠమంబామయం సర్వం శివలింగంచ చిన్మయం' పీఠము శక్తిమాయము లింగమేచిన్మయమని విద్యేశ్వరసంహితయందుఁగలదు. చంద్రజ్ఞాన శివాగమమున 'నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం నాన్యః పశ్యతి యద్విశ్వం సశృణోతి తదన్యథా। నాన్యద్వై జానాతితథా తన్మహాలింగముచ్యతే' నిష్కళంబును నిష్క్రియంబును నిస్సంగంబునునై మనోవాక్కాయ కర్మముల కతీతమై యే శివతత్త్వముగలదో, యదియే మహాలింగమనియు 'ప్రత్యస్తమితభేదం యత్సత్తామాత్రమగోచరం వచసామాత్మసంవేద్యం తన్మహాలింగముచ్యతే' భేదరహితమై సత్తామాత్రమై వాక్కులకందని యాత్మసంవేద్యమయిన [illegible]త్త్వమే మహాలింగమని చెప్పఁబడినది.

లింగార్చనము :—

'లింగమధ్యే జగత్సర్వం త్రైలోక్యం సచరాచరం లింగబాహ్యాత్పరంనాస్తి తస్మాల్లింగం ప్రపూజయేత్' చరాచరమునగు సమస్తమును లింగమందుఁగలదు. లింగమునకంటెఁ బరమగునదేదియును లేదు ఈకారణమున లింగమును బూజింపవలయును. కూర్మపురాణమున "నలింగారాధనాత్పుణ్యం త్రిషులోకేషుచాపరం' లింగారాధనము కంటెఁ బుణ్యకర్మ మింకొకటిలేదని చెప్పఁబడినది. శ్రుతియు 'తవశ్రియే మరుతో మర్జయంత రుద్రయత్తే జనిమచారుచిత్రం' ఓ రుద్రుఁడా! చిరమును సుందరమును జిత్రమునగుఁ జిత్రమనగా రత్నాదిమయము లింగమేదిగలదో, దేవతలైశ్వర్యమునకై దానిఁ బూజింపుచున్నారని వక్కాణింపఁబడినది

'పత్రం పుష్పం ఫలంతోయం యశ్శివాయ నివేదయేత్ సర్వపాపవినిర్ముక్తశ్శివలోకే మహీయతే' ఎవఁడు పత్రమునుగాని పుష్పమునుగాని ఫలమునుగాని యుదకమునుగాని శివునికొఱకు నివేదింపుచున్నాఁడో యాతఁడు సర్వపాప వినిర్ముక్తుఁడై శివలోకమును బొందుచున్నాఁడని బృహన్నారదీయమునఁగలదు.

సౌరసంహితయందు 'సర్వాన్ దేవాన్ పరిత్యజ్యయత్నంచాస్యమీశ్వరం' దేవతలందరిని విడిచి సద్యోజాతాది పంచముఖుఁడగు నీశ్వరునిఁ బూజింపుమని చెప్పఁబడియున్నది. బోధాయనుని 'అథాతో మహాదేవస్యాహరహస్సపర్యావిధిం వ్యాఖ్యాస్యామః' యను వచనము శివపూజా నిత్యత్వమును విధింపుచున్నది శివతత్త్వసుధానిధియందు 'బ్రహ్మవిష్ణు మహేంద్రాశ్చ లోకపాలాశ్చ దేవతాః విద్యాధరో గుహ్యకాశ్చ గంధర్వాశ్చాపికిన్నరాః రాక్షసాః దానవాః దైత్యాః వశిష్ఠాద్యామహర్షయః లింగార్చనం ప్రకుర్వంతి సదాకాలం' బ్రహ్మవిష్ణు మహేంద్రులును దైత్యాదులును వశిష్టాది మహర్షులును లింగమును నర్చింపుచుండిరనియు బృహజ్జాబాలమున

'నిత్యం త్రిసంధ్యం శివలింగమభ్యర్చ్యం' త్రిసంధ్యలయందును నిత్యము శివలింగమును నర్చింపుమనియుఁ దెలియఁజేయఁబడుచున్నది. 'లింగార్చనాత్పరోధర్మో నాస్తినాస్తి మహీతలే' లింగార్చనముకంటె నుత్కృష్టమగు ధర్మము లేదని స్కాందము ఘంటాఘోషముగఁ జెప్పుచున్నది.

'సర్వదేవమయం లింగం తస్మిన్నాస్తేచ్ఛివస్స్వయం। అనుగ్రహాయలోకానాం తస్మాల్లింగం ప్రపూజయేత్' లింగము సర్వదేవాత్మకమయినది. అట్టిలింగమునందుఁ బరమేశ్వరుఁడు లోకానుగ్రహమునకై వసించియున్నాఁడు కావున శివలింగమును బూజింపవలయునని శైవాగమములయందుఁగలదు.

సూతసంహితయందు 'అసారసంసారవనాంతరాళే త్రితాపఘర్మే భ్రమతోజనస్య శివార్చనాకల్పలతా పురస్తాత్సంసారసంతాపహారీ నచాన్యా' సంసారకాననమునఁ దాపత్రయమను వేసవియందుఁ బరిభ్రమించువానికి శివారాధనము కల్పలత సంతాపహారమయినదని పరమేశ్వరారాధనమే మోక్షమునకు మార్గమని వచింపఁబడినది.

'బ్రహ్మణస్సృష్టికర్తృత్వం విష్ణోర్దానవమర్దనం ఇంద్రస్య స్వర్గ రాజ్యంచ శివపూజావిధేః ఫలం'' బ్రహ్మకు సృష్టించు శక్తియును విష్ణువునకు దానవహరణ సామర్థ్యమును ఇంద్రునకు స్వర్గవాసమును శివపూజాఫలములుగ శివతత్త్వసుధానిధియందుఁగలదు. మరియు నందే 'యస్తుపూజయతే నిత్యం లింగం త్రిభువనేశ్వరం ససర్వమోక్షరాజ్యస్య క్షిప్రంభవతి భాజనం సకృదభ్యర్చితే లింగే గర్భజన్మనవిద్యతే సదా సమర్చయేద్యస్తు సయాతిపరమాం గతిం యేవాం ఛాంతి మహాభోగాన్ మోక్షంవా త్రిదశాలయం తేర్చయంతు సదాభక్త్యా శివస్య చరణాంబుజం' భువనేశ్వరుఁడగు లింగము నెవరు పూజించుచున్నారో, వారు మోక్షభాజనులగుచున్నారు. లింగము నొక్కమారు పూజించినచో గర్భనరకము లేదు. ఎల్లప్పుడు శివలింగము నభ్యర్చింపువాఁ డుత్తమ పదప్రాప్తుండగుటకు సందేహమేమి?

ఎవరు భోగమోక్షాదు లభ్యర్థింతురో, వారెల్లరు శివారాధనమే చేయవలయునని విశదీకరింపఁబడియున్నది.

ధ్యానార్థావయవయుతమగు మూర్తియొక్క యవయవముల ధ్యానించుటకంటె నవయవరహితమగు మూర్తిని ధ్యానించుటయే ధ్యానసిద్ధి కెక్కుడు సాధనమైయున్నది. అట్లే లింగమునందు నీశానావయవధ్యానము విశేషమగుచున్నది. శివపూజా విధాయకము లగు ననంతవచనములు శాస్త్రములందు వ్యవహితములై యున్నవి.

మహాభారత ద్రోణపర్వమున 'జన్మకర్మ తపోయోగాస్తయో స్తవచ పుష్కలాః! తాభ్యాం లింగార్చితో దేవస్త్వయార్చ్యయాం యుగేయుగే' జన్మకర్మలును తపోయోగములును మీకందఱకుఁ బుష్కలముగా నున్నను నీచేతఁ బ్రతిమార్చనము జరుపబడినది. ఆకారణమున లింగారాధనపరులగు కృష్ణార్జునులకు జయమును నీకప జయమును బ్రాప్తించెనను యుశ్వత్థామనుగురించి వచింపఁబడిన వాక్యము లింగార్చనాశ్రేష్ఠత్వమును దెలుపుచున్నది. మఱియు నందే 'యత్పుణ్యాం ప్రతిమార్చాయాం యుగకోటిశతైరపి తత్పుణ్యాం లభతేదేవి లింగేతు ఘటికార్ధకే' కోటియుగంబులయందలి ప్రతి మార్చనాపుణ్యమును ఘటికార్ధమునందలి లింగపూజనమును సమాన ఫలప్రదములని చెప్పఁబడినవి

శివపురాణమున నీవు విశ్వరూపుఁడవని శ్రుతి బలికినది. సర్వము నీవైయున్న నిన్ను మేమేరూపమునఁ బూజింపవలయునని దేవతలు ప్రశ్నింపగా శివుఁడిటు లానతియొసంగెను. 'యస్యాంక స్యాంచవామూర్తౌ పూజితోప్యహమాదరాత్ ప్రసన్నో వాంఛితేఁ దద్మి యస్యకస్యాపి వాసురాః కింతులింగార్చకానాంతు శీఘ్రమేవస్వ భీష్టదః లింగమూర్తౌ సదాకాలం వినామంత్రాదిసత్క్రియాః ప్రస న్నోనివసామ్యేవ భక్తిభాజాం విముక్తయే' దేవతలారా! నన్నెట్లు పూజించిన ననుగ్రహించి భక్తవాంఛితముల నొసంగుచుందును,

భక్తుల దరింపఁజేయనెంచి మంత్రిసంస్కారాదుల యవసరమేలేక లింగమునందనవరతమేను వసించి, లింగమును బూజించెడి భక్తుల కోరికల నచిరకాలములోనే యొసంగుదునని చెప్పినటులఁగలదు. ఇట్లు చెప్పుటవలన శివుని లింగమునందే పూజింపవలయుననియు నయ్యది శివారాధన కార్యంబుల నుత్కృష్టమయినదనియు నేర్పడు చున్నది.

చంద్రజ్ఞానాగమమున 'లింగే సంపూజనాధ్యానాచ్ఛంభు స్సమ్యక్ ప్రసీదతి। ధ్యాయతే పూజతే చైవలింగే సన్నిహితశ్శివః' లింగమునందు శివునిఁబూజించినను ధ్యానించినను నద్దేవుఁడు శీఘ్ర ప్రసన్నుఁడగుఁ గావున లింగమున నెల్లప్పుడు సన్నిహితుఁడై యుండి శివుఁడు పూజింపఁబడి ధ్యానముచేయఁబడుచున్నాఁడని గలదు.

ఋతం సత్యం పరంబ్రహ్మసచ్చిదానంద లక్షణం। అన్య న్నపరమం బ్రహ్మ తదతోధ్యేయమాస్తికైః' సచ్చిదానందాత్మక మగు శివతత్త్వమే పరబ్రహ్మమగుటయు నయ్యదియే లింగమగు టయు నయినందున నాతత్త్వమునే యాస్తికులు ధ్యానముచేయవల యును. అతస్సర్వం పరిత్యజ్య............తద్ధ్యాన పరమోభవేత్. ఈకారణముచే మహాలింగమునందే యాసక్తిగలిగి ధ్యానపూజా నిష్ఠుఁడు గావలయుననియును గలదు. ఇంతయేల 'విద్యారూపం ధనం సౌఖ్యం సత్కులం రోగనాశతా స్వర్గో రాజ్యంచ మోక్షశ్చ శివపూజావిధేః ఫలం' సమస్తసౌఖ్యప్రాప్తికిని మోక్షావాప్తికిని శివలింగార్చనమే మూలమని తెల్లమగుచున్నది.

అవ్యక్తమును విశ్వమునకంతయు మూలకారణమును మూల ప్రకృతికాశ్రియ స్థానమును నగు నదియే లింగమనందగు. లింగము నుండియే శుద్ధ అశుద్ధ శుద్ధాశుద్ధములను భేదముచే చరాచర జగ మంతయు యుద్భవింపుచున్నది. ఇంద్రియంబులు బంచభూతంబులతో గూడ నందే యుత్పన్నంబులై లయంబునందుచున్నవి కావున మహా

దేవునకు లింగత్వము సిద్ధంబయ్యెను లింగాధిష్ఠితుడగు నామహానీయునకు లింగమే స్వరూపమగుచున్నది కావున లింగమునందే మహాదేవునర్చింపవలయును లింగవేదియే పరమేశ్వరియు లింగమే శివుండు నగుచున్నారు స్వభావ విశుద్ధమూర్తులగు వారి యుపచారార్థమై లింగదేహము కల్పితమయ్యెను లింగవేదియే పరమాత్ముండగు శివుని శక్తిస్వరూపిణి అయ్యుదియే శివాజ్ఞారూపిణియగునని శివపురాణమున కలదు.

లింగధారియగు ద్విజుఁడు 'ఏకకాలం ద్వికాలంవా త్రికాలం నిత్యమేవవా। లింగధారీ సదాశుద్ధో నిజలింగం మనోహరం। అర్చయేద్గంధ పుష్పాద్యైః కరపీఠే సమాశ్రితః। బాహ్యపీఠార్చనాదేవ కరపీఠార్చనం వరం' యేకకాలమందుఁగాని - రెండుకాలములయందుఁగాని - మూడుకాలములయందుఁగాని - నిత్యముగాని కరపీఠస్థ లింగమును గంధపుష్పాదులచేఁ బూజింపవలయును. బాహ్యపీఠార్చనకంటె కరపీఠార్చనయే శ్రేష్ఠమయినదని చెప్పఁబడుచున్నది.

'అరుద్రః పూజయన్ రుద్రం నపూజాఫలభాగ్భవేత్। రుద్రో భూత్వాయజేద్రుద్రం నారుద్రో రుద్రమర్చయేత్॥' సాధకుఁడు రుద్రుఁడుకాకుండా రుద్రునిఁ బూజించి ఫలమును బొందుటలేదు. తాను రుద్రుఁడై రుద్రునిఁ బూజింపవలయును. రుద్రుఁడు కాకుండా రుద్రునిఁ బూజింపఁగూడదు. కావుననే గురుఁడు లింగప్రాణముల నైక్యతను దెలిసి మలత్రయ నివృత్తిఁ గావించి షడధ్వశోధనాదులచేతను భస్మ రుద్రాక్ష లింగధారణాదికములచేతను బరిశుద్ధునిఁజేసి పంచాక్షరీ మంత్రోపదేశము గావించి - యేకపంచాశద్దళస్థిత యేకపంచాశద్వర్ణ యేకపంచాశద్రుద్రగణసహిత యాధారాది షట్చక్ర శోధన మార్గము దెలిపి సర్వాంగలింగ సాహిత్య వివేకునింజేయుటద్వారా శివోహమను నిర్మలచిత్తము గలవానినిగా శిష్యునొనర్చి యాతని శరీరమును రుద్రమయము చేయుచున్నాఁడు.

'షట్స్థలోక్త విధానేన శివపూజాం సమాచరేత్।' షట్స్థ
విధానముగనే శివపూజచేయువలయును. అందలి పూజోపచా
శంకర సంహిత యందీక్రింద నుదహరింపబడినవిగ నున్నవి.
ద్వాదశధా ప్రోక్తా శివసిద్ధాంతతత్పరైః ఉపచారస్తథా చైవ చ
తిధాస్మృతాః। విభూత్యభ్యంక్షణం లింగేకరణం స్నపనస్యచ
తాపనంచైవ। ధూపసంవీజనంతతః। ధూపపరిసారణాంచైవ।
ధావతంసనం। అక్షతారోపణంచైవ పుష్పోపహరణం తతః। దీ
నంచైవ నైవేద్యస్య సమర్పణం। తాంబూలస్య ప్రదానంచ
పావరణాం తతః। ఏవం ద్వాదశధాప్రోక్తా శివలింగార్చనక్రి
నాహ్వానకార్ఘ్యాణి పాద్యమాచమనీయకం యజ్ఞోపవీత మా
పన భరణానిచ। ఛత్రంచ చామరంచైవ తాలవృంతంచ
ఘంటాంశంఖంచ గీతంచ వాద్యం నృత్యం ప్రదక్షిణం। న
స్తుతిర్యాచ్ఞా విజ్ఞప్తిశ్చ విసర్జనం। ఇత్యేవముపచారాశ్చ
తిధాస్మృతాః॥' విభూత్యభ్యంక్షణము - స్నపనము - అం
నము - ధూపసంవీజనము- ధూపపరిసారణము - గంధావ
అక్షతారోపణము - పుష్పోపహారణము - దీపపరికాశనమ
ద్యము- తాంబూలప్రదానము - వస్త్రప్రావరణములనునవి
గములును - ఆసన-ఆహ్వాన-అర్ఘ్య - పాద్య-ఆచమనీయ-య
మాల్య- అనులేపన- ఆభరణ- ఛత్ర- చామర - తాలవృం
ఘంటారావ - శంఖారావ - గీతశ్రవణ - వాద్యశ్రవణ
ప్రదక్షణ - నమస్కార - స్తుతి - యాచన - విజ్ఞప్తి - వి
నిరువదినాలుగు యుపచారములు భక్తస్థలాదియైక్యస్థలాం
గ్రమముగ విధింపబడినవై పరమేశ్వరు బాహ్యాభ్యంతర
నములగుచున్నవి.

శైవ సిద్ధాంత శిఖామణియందు షట్స్థల పూజా
సంగ్రహముగఁ జెప్పఁబడినది. 'భక్తస్థలే సమాసీనోభూ

ధారణః। కృత్వా భక్త్యానుపూతాత్మా తతో మాహేశ్వరస్థలే। షడ క్షరం పరం మంత్రమనుష్ఠేయాచ్చ నిష్ఠయా। ప్రసాదిస్థలమాలోక్య లింగం హస్తేవధానతః। ప్రాణలింగస్థలే పూజాం విధాయస్వానుభూతి తః। తతశ్శిహార్పణంకృత్వా స్వానందాచ్ఛరణస్థలే। ఐక్యస్థలే ప్రసాదో ప భోగ తృప్తి మవాప్యచ। ఏవం సమరసీభావాత్ షడంగస్థలయోగ తః। షట్సుకాలేషు సంపూజ్యం త్రిసంధ్య మథవాపునః। ఇష్టలింగం మహేశస్య సర్వానిష్ట విషూదనం॥' భక్తస్థలమునందు - భక్తియుక్తుఁడై, భూతిరుద్రాక్షధారణ చేసుకొని, మాహేశ్వర స్థలమునందు - షడక్షర మంత్రమును నిష్ఠచే జపించుచు, ప్రసాదిస్థలమున - హస్తమందలి లింగమును దశావధానవిధిచే నిరీక్షించుచు, (లింగనిరీక్షణ మందు దృక్పటుత్వ - దృగ్విన్యాస - దృగ్విలీనత్వ - దృక్స్థిరత్వమను నీనాలుగు ప్రథమావధానమగును. దృక్పూజ రెండవదగు దృగవధానమగును. త్వగ్వ్యాప్తి మూడవదియగు. స్తుతి నాల్గవయవధానమగు మనోవ్యాప్తి యైదవదగు యవధానమయ్యె. సానురాగ మనోర్చన మారవది. గణప్రణామ మేడవ యవధానమగును. గణస్తుతి యష్టముంబయ్యె. గణలీలానంద మగ్నత నవముంబును- లింగనిమగ్నత పదియవదగు నవధానమునై దశావధానములని ప్రసిద్ధంబులయ్యె) ప్రాణలింగస్థలమునందుఁ - బూజనొనరించి - శరణస్థలమునందు - అర్పణగావించి, యైక్యస్థలమునందు - ప్రసాదోపభోగతృప్తినిఁ బొంది షట్స్థలసంబంధ సామరస్యముతో ననిష్టపరిహారకమగు నిష్టలింగమును- ఆరుకాలములయందుఁగాని మూఁడుకాలములయందుఁగాని పూజింపవలయును.

### ద శా వ ధా న ము లు.

మొదట ప్రాణసంభృతమై దృష్టి యిష్టలింగముపై లగ్నమగుటయు దృష్టియను గోడయందు లింగరూపము చిత్రింపఁబడి

నటుల భావించుటచే దృష్టి లింగభావమునందుటయు బంగారము ప్రతిమరూపముగ చేయబడి ప్రతిమయయినటుల దృష్టి లింగాకారము నొందుటయు దృక్పటుత్వమగును.

గణేశ్వరునింబోలె తంబురతీగెలంబోలు చూపులతో శివుని జూచుచుంటయు దేవతలు చూచునటుల రెప్పవాల్పకయు అంగ వికారశూన్యంబుగ భృంగీశ్వరుడు చూచునట్లును నందీశ్వరుడు చూచునట్లు వినాభావసంబంధముగను లింగమును జూచుచుంటయే దృగ్విన్యాసమగును.

గురుమంత్రము శిష్యుని కర్ణసీమయందు నందునటుల హస్తమునందున్న యిష్టలింగమున సాధకుని దృష్టిలయింపవలయును వేదాంతములు శివుని ధరించునట్లును లతలు కల్పవృక్షమును జుట్టుకొనునట్లును బాణము లక్ష్యమునందు నాటునట్లును పుత్రులు తండ్రిని కౌగలించుకొనునట్లును త్రాళ్లు మత్తగజమును బంధించునట్లును బోయవివల మృగముల బంధించునట్లును భార్య భర్తను కౌగలించు కొనునటులను శిల్పిపట్టిన సూత్రము శిల్పమునుగూడినట్లును గంధ ద్రవ్యముల సువాసన శరీరమునకుఁ బట్టినట్టును నదులు సముద్రము లలయించునట్టును తప్తలోహమున నీరమింకునటుల తనదృష్టి శివునందు లీనమగుట దృగ్విలీనతయనంబడును.

దృష్టి నేత్రాంతమునందకయు నీరుగారకయు లింగముమీది నుండి చలింపకయు క్రూరభావములేకయు మాంద్యములేకయు స్థిరముగానుండుట దృక్స్థిరత్వమగుచున్నది. ఈనాల్గును ప్రథమావధానమగుచున్నవి.

శివుని జూచుకొలది యానందము నొందుచుండుట దృక్పూజయగును ఇంక లింగమునకు దృష్టియే స్నానోదకరూపంబును, గంధాక్షతరూపంబును, పుష్పరూపంబును, ధూపరూపంబును, నీరాజనరూపంబును, నైవేద్యరూపంబును, తాంబూలరూపంబును, పుష్పాం

జలిరూపంబును నను నినిమిది విధములగు దృష్టితో నొనర్చు లింగార్చనము రెండవదగు దృగవధానమగును.

దరిద్రుడు పెన్నిధినిగాంచి గ్రహించునట్టును ఆడయేనుగు మదపుటేనుంగును స్పృశించునట్టును గౌరీదేవి లీలాకమలమును గ్రహించునట్టును పతివ్రత ప్రియునిగాత్రమును సేవించునట్టును సాధకుడు తన చేతియందలి లింగమును స్పృశించి స్పర్శసుఖము నందుచుండుట మూడవదియగు త్వగవధానత్రయమందలి త్వగ్వ్యాప్తి యను నవధాననమాయెను.

వేదోపనిషన్మంత్రముల చేతను, పురాణోక్తులచేతను శివుని స్తోత్రముచేయుట నాల్గవయవధానమై స్తుతిరూపమగుచున్నది. అగ్నియందు వెన్నపోలికయు దీపమునందు కర్పూరమువలెను నీటియందుప్పుబగిదియు సాగరమున వడగళ్లుకరుగునటుల తన శరీరమిందిద్రియములతో లింగమునందులయించినటుల భావించుట మనోవ్యాప్తి యను నైదవయవధానము.

ఆనందబాష్పములె స్నానంబును, కన్నీటిబొట్టుతుడుచుటయు- ఆసక్తియెగంధమును - రోమాంచమే పుష్పమాలికయు - తత్వసంపదయె విభూతియు - సద్వాసనయె ధూపంబును - జ్ఞానాంశువులె దీపజాలంబును- ప్రాణమే నైవేద్యంబును - అతీంద్రియత్వమె తాంబూలమును స్తోత్రము మంత్రపుష్పంబును నీవిధముగ సాధకునిచిత్తమే సకలోపచారరూపము నొందవలయును. చిత్తము స్నానోపచారమందు జలధారారూపకముగను, పూజయందు సుగంధపుష్పరూపమును, గంధోపచారమందు గంధరూపముగను, ధూపోపచారమందు ధూపద్రవ్యంబుగను, హారతులనిడునెడ తద్రూపమును, నైవేద్యదానంబున భక్ష్య భోజ్యాది రూపత నొందవలయు - నిదియారవదగు సానురాగ మనోర్చనము.

రుద్రగణములను లింగమునందుగాంచిరుద్రాధ్యాయవాక్యములతో వారిని నమస్కరించుచుండుట నేడవదియగు గణప్రణామమగును. అట్టి రుద్రగణంబుల రుద్రసూక్తంబుల స్తుతింపుటయె యెనిమిదవదియగు గణస్తుతియగును.

ఎవ్వారికృత్యంబులు పరమేశ్వరునకే యాశ్చర్యమును కల్పించునో నట్టి ప్రమథ లీలానముదయంబున సాధకుడు మునింగి ఆనంద మొందుట గణలీలానందనిమగ్నతయను నవమావధానమగుచున్నది.

బాహ్యాభ్యంతరములదృశ్యజ్ఞానంబులచే లింగమెల్లపుడు లగ్నమైయున్నందున సర్వకాల సర్వావస్థలందును లింగేతరము నెఱుంగకుంటయే పదియవదగు నవధానమై లింగనిమగ్నతయన ప్రసిద్ధమై దనరి అణిమాద్యష్టసిద్ధిదములును ముక్తిదములగుచున్నవి

శాంభవీయ సూత్రగ్రథితమై షట్స్థలాత్మకమగు శివపూజా విధానము కారణాగమమున మహాపూజ - గురుపూజ - లఘుపూజ - అవసరపూజయను భేదములచే నాల్గు విధములుగఁ జెప్పఁబడినది. ఉత్తముఁడు మహాపూజను, మధ్యముఁడు గురుపూజను, అశక్తుఁడు లఘుపూజను జేయవలయును. భోజనార్హములయిన మధ్యాహ్న సాయంకాలములయందే యీపూజలు చేయవలయును. భోజనమునకయోగ్యములగు ప్రాతఃకాలాదులయందు - అవసరార్చనము చేయవలయును.

వేదమందధికారములేని స్త్రీలు మున్నగువారు తాంత్రిక విధానముతోటి శివపూజ నాచరింపవలయును. 'ఆచారలింగ ముఖాయనమః' యని మొదలుగా నివేదన చేయువలయును.

'జాతకే మృతకేవాపి నత్యాజ్యం శివపూజనం' జాతాశౌచ మృతాశౌచములయందును శివపూజ విడువరాదు. లింగమునందు లాబుద్ధియు - ప్రసాదంబున పదార్థచింతయు - తీర్థంబున జలభ్రాం

తియు నెవనికిఁ గలుగుచున్నదో యతఁడు బ్రహ్మహత్యాది పాపము లకు గురియగుచున్నాఁడని శంకర సంహితయందుఁ గలదు.

షట్స్థలపూజ:- సర్వమునకు మూలకారణమయిన పరబ్రహ్మ మగునే మహాలింగముగలదో, శైవశాస్త్రవిదులా పరశివుని షట్స్థల పరబ్రహ్మేశ్వరునిగ - నాచారాది భావలింగ పర్యంత మయిన నవలింగ స్వరూపునిగను సర్వలింగాంతర్గత యఖండలింగ స్వరూపునిగను గీర్తించి యుపాసించి కృతకృత్యుల గుచున్నారు. 'ఏకఏవ పరంబ్రహ్మ సచ్చిదానందలక్షణః। శివ తత్త్వం శివాచార్యాః స్థలమిత్యాహురాదరాత్।' ఒక్కఁడై సచ్చిదానంద స్వరూపుఁడై పరతత్త్వంబైన శివుని శైవా చార్యులు స్థలమని వ్యవహరించిరి. 'స్థలం నామపరం తత్త్వం శివ రుద్రాది సంజ్ఞికం' శివరుద్రాది సంజ్ఞకమే స్థలనామకమైయున్నది. ఉపాస్యోపాస్యధర్మములచే నాస్థలమే లింగస్థలమనియు - నంగస్థల మనియు రెండువిధములుగ నయ్యెను. 'లింగస్థలముపాస్యంస్యాదంగ స్థలముపాసకః' లింగస్థల ముపాస్యమును - అంగస్థల - ముపాసికము నయ్యెను. 'లింగస్థలం శివస్సాక్షాత్ జీవస్త్వంగస్థలం భవేత్' లింగ స్థలము శివుఁడనియు - నంగస్థలము జీవుఁడనియు లింగాంగస్థలైక్యమే శివజీవైక్యమనియు నిర్దేశింపఁబడినది. లింగస్థలములు నివృత్తి భావం బులును - అంగస్థలములు వృత్తిభావంబులునై యున్నవి అంగస్థల మును జీవుని ననుగ్రహించు నిమిత్తమే లింగస్థలము - ఇష్ట - ప్రాణ- భావములను మూఁడు రూపములుగ విభజింపఁబడియెను. అందు - ఇష్టలింగము స్థూలమును - ప్రాణలింగము సూక్ష్మమును - భావలిం గము కారణమునై యిట్లే క్రమముగా దేహ - ప్రాణ - ఆత్మికము గను బిందు - నాదకళాత్మికముగను - తత్త్వమసియను బదార్థరూప ముగను - సత్ - చిత్ - ఆనందాత్మకముగను నయ్యెను.

'నిష్కళం భావలింగంస్యాత్ భావగ్రాహ్యం పరాత్పరం ప్రాణలింగం మనోగ్రాహ్యం భవేత్సకలనిష్కళం। సకలం దృక్కళా గ్రాహ్యమిష్టలింగం ప్రకీర్తితం' నిష్కళమగు భావలింగము భావము చేతను - సకలనిష్కళమగు ప్రాణలింగము మనస్సుచేతను - కళా యుతమగు యిష్టలింగము దృక్కుచేతను నెఱుఁగఁదగినది. ఇష్టలింగ మును బూజింపుచుఁ బ్రాణలింగమును ధ్యానింపుచు భావలింగమును భావింపునాతఁడు మృత్యుపాశముల ఖేదించి ముక్తుఁడగుచున్నాఁడు.

'భావాదిలింగత్రితయం ద్వివిధం ద్వివిధం భవేత్। భావలిం గం మహాలింగ ప్రసాదాభిఖ్యకం భవేత్। ప్రాణలింగంచ సచర శివలింగద్వయం భవేత్। ఇష్టంతుగురులింగాఖ్య మాచారాఖ్యం ద్వయం భవేత్'. భావప్రాణేష్టములను మూఁడులింగములలో భావ లింగము మహాలింగ ప్రసాదలింగములుగను - ప్రాణలింగము శివ లింగ చరలింగములుగను - ఇష్టలింగ మాచారలింగ గురులింగములు గను విభక్తములై యాఱువిధములై షట్స్థలసంజ్ఞనందుచు - ఆచార లింగ - గురులింగ - శివలింగ - చరలింగ - ప్రసాదలింగ - మహా లింగములయ్యెను.

అంగస్థలమునునిట్లే క్రమముగ త్యాగ యోగ భోగాత్మికమునై స్థూల సూక్ష్మకారణరూపముగను - విశ్వతైజస ప్రాజ్ఞనామకమునై జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలంగూడి వరుసగ నొక్కొక్కటి రెండు స్థలంబులయ్యెను. అందు త్యాగాంగము భక్తమాహేశ్వర స్థలంబులు గను - భోగాంగము ప్రసాది ప్రాణలింగి స్థలంబులుగను - యోగాం గము - శరణ - యైక్యస్థలంబులుగనై భక్త - మాహేశ్వర - ప్రాణ లింగ - ప్రసాదిశరణ - యైక్యస్థలంబులని యాఱు విధంబులయ్యెను.

శివునితోసహా భోగంబులనుండుటచే భోగాంగమనియు - శివ యోగ సుఖంబున నుండుటచే యోగాంగమనియు - సంసారభ్రాంతి వీడుటచే త్యాగాంగమనియు నంగస్థలమువ్యవహరింపఁబడుచున్నది.

గ్రంథాంతరమున భక్తాదిషట్స్థల నిర్వచనసందర్భమున నియమములతోఁగూడి యాసనస్థిరత్వముకలవాఁడు భక్తుఁడును - చరాచరలయస్థానమై యొప్పెడి లింగమును నాకాశసంజ్ఞకముగ నెరుఁగువాఁడు మాహేశ్వరుఁడనియు - ఆయాకాశంబున బ్రాణమెవనికి విలీనమైయుండునోయాతఁడు ప్రాణలింగియనియు ప్రత్యాహారముతోఁ గూడినవాఁడు ప్రసాదియనియు - ధ్యానధారణములతోఁ గూడినవాఁడు శరణుఁడనియు - శివోహమను భావమున సమాధి నిమగ్నుఁడగువాఁడు లింగైక్యుఁడనియు వచింపబడియెను అష్టాంగయోగములిట్లు షట్స్థలులై భూజలాగ్ని వాయ్వాకాశ ఆత్మాంగములగు ఆధారస్వాధిష్ఠాన మణిపూరక అనాహతవిశుద్ధ ఆజ్ఞేయ చక్రంబుల ఆచారాది షల్లింగోపాసకుఁడై మహాలింగాంగ సంధాన చతురుఁడగు ప్రాణలింగియందు సహజములై యున్నవి.

మహాలింగమెట్టుల రెండువిధములగు స్థలములుగ విభక్తమయ్యెనో - యందలి శక్తియు లింగస్థలమునఁ గళారూపముగ - అంగస్థలమున భక్తిరూపకముగ రెండువిధములయ్యెను. లింగాంగ స్థలముల రెంటను నాశక్తియు భక్తియు నారారు విధములయినవి. లింగస్థలంబునందలి శక్తి - చిచ్ఛక్తి - పరాశక్తి - ఆదిశక్తి - ఇచ్ఛాశక్తి - జ్ఞానశక్తి - క్రియాశక్తియను శక్తులరూపముగను - అంగస్థలంబునందలి భక్తి సద్భక్తి నైష్ఠికీభక్తి అవధానభక్తి - అనుభవభక్తి - ఆనందభక్తి -సమరస భక్తులను భక్తిరూపకములుగనుండి యుపాసనావిధానములై లింగాంగసంయోగ సాధనములయినవి.

ఉపాస్యోపాసక - పూజ్యపూజక - సాధ్యసాధక - గురుశిష్య-శివాత్మానములయిన పూర్వోక్త లింగాంగములలో గురూపదిష్టవశమున త్యాగాంగమున - ఇష్టలింగమును, యోగాంగమున - ప్రాణలింగమును, భోగాంగమున భావలింగమును మనోహృదయంబుల మహాలింగమును, శ్రోత్రవాగింద్రియములఁ బ్రసాదలింగమును,

ద్వక్ప్రాణేంద్రియములఁ జరలింగమును, దృక్ప్రాదేంద్రియముల శివలింగమును - జిహ్వోపస్థల గురులింగమును, పాయునాపికేంద్రియంబుల నాచారలింగమునుఁ బ్రతిష్ఠింపఁబడినవి. ఇట్లు సర్వేంద్రియంబులయందుఁ బ్రతిష్ఠింపఁబడిన ఆచారాది లింగముల భావింపుచు నాయా యింద్రియవిషయంబుల నాయాలింగముల కర్పింపుచు సర్వమును మరచి క్రమముగా నఖండమగు మహాలింగమును పాసింపుచు లింగాంగ సంబంధ పదత్రయంబుల గుర్తెరింగి సాధకుఁడు శివసాయుజ్యమును బొందుచున్నాఁడు. ఇద్దానినే సర్వాంగలింగ సాహిత్యమని శిష్టులువచించిరి.

శైవసిద్ధాంత శిఖామణియందర్పణావిధి యీవిధముగఁ జెప్పఁబడినది. భక్తమహేశ్వర ప్రసాది ప్రాణలింగ శరణైక్యస్థలంబులను నారింటియందు - ఆచారలింగోపాసకుఁడైన భక్తుని యంగస్థలంబు ఘ్రాణాంగంబు. అతనిభక్తి సద్భక్తి. ఆయనహస్తంబు సుచిత్తహస్తంబు. తద్వృత్తిగంధవిషయంబు కాన సాధకుఁడు భక్తస్థలమునందుఁ గ్రియాశక్తియుక్తుఁడై ఘ్రాణాంగమందున్న - ఆచారలింగమను సద్యోజాతముఖంబున సద్భక్తిచే గంధమను ప్రసాదమును చిత్తమను హస్తముచే నర్పింపవలయును.

గురులింగోపాసకుఁడైన మాహేశ్వరుని యంగస్థలంబు జిహ్వాంగంబు. అతనిభక్తి నైష్ఠికీభక్తి. ఆయనహస్తంబు బుద్ధిహస్తంబు తద్వృత్తిరసవిషయంబు కాన మాహేశ్వరస్థలమునందు జ్ఞానశక్తియుక్తుఁడై జిహ్వాంగంబునందలి గురులింగమను వామదేవముఖంబున నిష్ఠాభక్తిచే రుచియను ప్రసాదమును బుద్ధియను హస్తముచే నర్పింపవలయును.

శివలింగోపాసకుఁడైన ప్రసాది యంగస్థలంబు నేత్రాంగంబు. అతనిభక్తి అవధానభక్తి. ఆయనహస్తంబు అహంకారహస్తంబు తద్వృత్తిరూపవిషయంబు. కాన ప్రసాదిస్థలమునందు - యిచ్ఛా

శక్తియుక్తుడై నేత్రాంగమందలి శివలింగమను అఘోరముఖంబున - అవధానభక్తిచే రూపమను ప్రసాదమును - అహంకారమను హస్తముచే నర్పింపవలయును.

చరలింగోపాసకుఁడైన ప్రాణలింగి యంగస్థలంబుత్వగంగంబు. అతనిభక్తి అనుభవభక్తి. ఆయన హస్తంబు మనోహస్తంబు తద్వృత్తిస్పర్శవిషయంబు కాన ప్రాణలింగిస్థలంబునందు - ఆదిశక్తియుక్తుఁడై త్వగంగమందలి చరలింగమను తత్పురుషముఖంబున - అనుభవాకారభక్తిచే స్పర్శయను ప్రసాదమును మనస్సనెడి హస్తముచే నర్పించవలయును.

ప్రసాదలింగోపాసకుఁడైన శరణునియంగస్థలంబు శ్రోత్రాంగంబు. అతనిభక్తి ఆనందభక్తి. ఆయన హస్తంబు సుజ్ఞానహస్తంబు తద్వృత్తి శబ్దవిషయంబు. కాన శరణస్థలమునందు పరాశక్తిసహితుఁడై శ్రోత్రాంగమందలి ప్రసాదలింగమను - యీశానముఖంబున ఆనందాకారభక్తిచే శబ్దమను ప్రసాదమును సుజ్ఞానమను హస్తముచేత నర్పింపవలయు.

మహాలింగోపాసకుఁడైన యైక్యని యంగస్థలంబు హృదయాంగంబు. అతనిభక్తి సమరసభక్తి. ఆయన హస్తంబు సద్భావహస్తంబు. తద్వృత్తి సంకల్పవిషయంబు. కాన - యైక్యస్థలమునందు - చిచ్ఛక్తియుతుఁడై మనస్సునందలి మహాలింగమను పరశివముఖంబున సమరసభక్తిచే సంకల్పమను ప్రసాదమును సద్భావమను హస్తముచేత నర్పించవలయును.

ఇట్లు షడ్విధభక్తిస్థలముల నభ్యాసపూర్వకంబుగాఁ బూర్వస్థలంబుల నతిక్రమించి యుత్తరోత్తర స్థలంబుల నాక్రమింపవలయును.

తనకు భోగ్యమగు పదార్థము స్థూలమనియు - ప్రవివిక్తమనియు - ఆ[illegible]నమనియు మూఁడువిధములు. స్థూలమునకు రూప

మనియు - ప్రవివిక్తమునకు రుచియనియు - ఆనందమునకు తృప్తియనియు నామాంతరములు.

ఇట్టి సమిష్టిరూపంబైన త్రివిధార్పణములలో స్థూలుఁడగు విశ్వుఁడు స్థూలాంగమందున్న యిష్టలింగమునకు రూపార్పణ మొనర్చియు - సూక్ష్ముఁడగు తేజసుఁడు సూక్ష్మాంగమందున్న ప్రాణలింగమునకు రుచ్యర్పణమొనర్చియు - కారణరూపుడగు ప్రాజ్ఞుఁడు - ఆత్మాంగమందున్న భావలింగమునకు - తృప్త్యర్పణమొనర్చియు - 'ప్రసాదద్వారాముక్తిః' యను ప్రమాణము ననుసరించి బంధముక్తుఁడై పరమేశ్వరానుగ్రహము పొందుచున్నాఁడు. ఇదియే పరమోత్కృష్టమగు శివారాధనయగును.

'సమర్పణం ద్విధాప్రోక్తం అర్చాంగం సార్వకాలికం సమర్పణే సమర్చాంగే రుచింభావేననాన్యథా। శరణాఖ్యస్థలేష్వేవ మర్పణం షట్స్థలాత్మకం' పూజాంగమనియు - సార్వకాలికమనియు సేవ ల్లింగార్పణము రెండువిధములు. పూజాంగములగు అర్పణమునందు రుచ్యాదుల భావనచేతనే యర్పింపవలయును. క్రియచే నర్పింపఁ గూడదు. సర్వకాల సర్వావస్థలయందును సంభవించుచున్న శబ్దాది సకలవిషయములున్న యాయాలింగముల కర్పించుట సర్వాంగలింగ సాహిత్యమునకు సాధకముగాన నుచితమగును. అట్లే పూజాకాలమునఁ జేయు నర్పణమందును రుచ్యాదులను గ్రియచే నర్పించునెడలఁ బూజాంగములగు ననంతరోపచారములకు భంగముగలుగును గావున భావముననే చేయవలయును. షట్స్థలాత్మకమగు సమర్పణమును శరణస్థలమందుఁ జేయవలయును.

లింగధారణము:- లింగమహాపురాణమున 'కస్యపాత్రి భరద్వాజగౌతమావ్యాసమహర్షయః। ధారయంతి సదాలింగ ముత్తమాంగే విశేషతః నారాయణోపి భగవాన్ దేవో బ్రహ్మాదయోనఘాః ధారయంత్యుత్తమాంగేషు శివలింగమనామయం। లక్ష్మీ సరస్వతీ ముఖ్యాః స్వకిరీటో

ర్ధ్వదేశకే ధారయంత్యప్రమాదేన శివలింగ మహర్నిశం।' కశ్యపాది మహర్షులును - బ్రహ్మాదిదేవతలును - సరస్వత్యాదిశక్తులును - ఉత్త మాంగములందును - కిరీటోర్ధ్వదేశములందును లింగమును ధరించిరనియు - 'మల్లింగం మస్తకాద్యంగే ధృత్వాశక్రపురోగమాః దేవాః మాంలింగ మధ్యస్థం సంపూజ్య స్వపదంయయుః' శక్రాదులును - మస్తకాద్యంగముల లింగమునుధరించి పూజించి స్వపదంబులనందిరను శివవాక్యము శంకరసంహితయందుఁగలదు.

'అమృతస్య దేవధారణోభూయాసం'- 'సర్వలింగగ్గ్‌స్థాపయతి పాణిమంత్రం పవిత్రం' 'అయంమేహస్తో భగవాన్' 'ఇమమూర్జాతే పసానియచ్ఛత' మొదలగు శృతివాక్యములు లింగాధారణను విధించు చున్నవి.

శ్రీకరభాష్యమున బ్రాహ్మణులకు శివుఁడు దేవుడు- 'తస్మాత్ తల్లింగధారణం కర్తవ్యం' ఆకారణముచేత నాదేవ ధారణము కర్త వ్యమనియు - (శివుఁడు బ్రాహ్మణదైవమనుటకు "త్వందేవేషు బ్రాహ్మణః - అహం మనుష్యేషు బ్రాహ్మణః . బ్రాహ్మణో బ్రాహ్మణముపధావతి' అని శృతి వచింపుచున్నది) కావున లిం స్వరూపుఁడగు శివునిధరించుట బ్రాహ్మణధర్మమనియు - గాత్రముల భృత్యునకుఁ ప్రభుచిహ్నముల నెటులు ధరింపవల యున్నదో, యటులే ప్రభువును - దేవుఁడునగు లింగమును - భస్మ రుద్రాక్షలను - ధరించుట భక్తునకు యావశ్యకమని యేర్పడుచున్న దనియుఁగలదు.

గౌతముఁడు 'ముఖేమంత్రం హృదిధ్యానం మస్తకే లింగ ధారణం। శిఖాసూత్రం తథాభస్మ ఏతద్బ్రాహ్మణలక్షణం' ముఖ మునఁ బంచాక్షరియు - హృదయమున శివధ్యానమును - మస్తకం

బున లింగధారణమును - శిఖాసూత్రభస్మములధరించుట బ్రాహ్మణ లక్షణమని చెప్పియుండెను.

శంకరసంహితయందిట్లున్నది. 'వేదేషుశాస్త్రసంఘేషు పురాణేష్వాగమేషుచ। బ్రాహ్మణస్య సమాఖ్యాతం లింగధారణముత్తమం' అన్నిశాస్త్రములయందును బ్రాహ్మణునకు లింగధారణము సమాఖ్యాతమైయున్నది.

'లింగస్యధారణాదేవ పశుత్వం వినివార్యతే' లింగధారణము ననే పశుత్వము నివారింపఁబడుచున్నదని చెప్పఁబడియున్నది.

'గురుణాదత్తలింగంతు శివమంత్రేనధారయేత్। మూర్ధ్నికంఠే భుజేహస్తేహృత్స్థలేనాభిమండలే।ఏతేషామేకదేశేతుధారయేచ్ఛివలింగకం' గురుదత్తమగు లింగమును బంచాక్షరీ మంత్రముచే శిరమునందుఁగాని కంఠమునందుఁగాని భుజమునందుఁగాని హస్తమునందుఁగాని హృదయమందుఁగాని నాభియందుఁగాని ధరింపవలయునని వాతూల శివాగమమునఁగలదు.

స్కాందమహాపురాణమున 'కృత్వాస్వదేహే సతతంలింగం వస్త్రేనవేష్టితం। మస్తకేకంధరేకక్షే వక్షస్యధకరస్థలే నాభేరధస్థాల్లింగస్య ధారణం పాపకారణం। నాభేరధస్థాత్సతతం ప్రమాదాన్నైవధారయేత్' లింగమును వస్త్రముచేఁజుట్టి హస్తమునందుఁగాని కంఠమునందుఁగాని కరస్థలంబునందుఁగాని ధరింపవలయును. ప్రమాదముచే నొకప్పుడైనను నాభ్యధోదేశమున ధరింపఁగూడదు. అది పాపకారణమని చెప్పఁబడియున్నది.

వాయవీయ సంహితయందు 'పవిత్రీకరణాత్పుంసాం పవిత్రమితికథ్యతే। అతస్సర్వేషు కాలేషుధారయేల్లింగముత్తమం। గచ్ఛన్ తిష్ఠన్ స్వపన్ జాగ్రన్నున్మిషన్నిమిషన్నపి। శుచిర్వాప్యశుచిర్వాపి లింగం సర్వత్రధారయేత్। అధర్వోయం విమోక్షాయ సోఖ్నుతేలింగ ధారణం యజురప్యాహసర్వంస్త్రై లింగం స్థాపయతీతిచ తస్మాద్ధార్యం

మహాలింగం పాణిమం త్రైతి మంత్రితః' పవిత్రముజేయునదిగానఁ బవిత్రముగ చెప్పఁబడు లింగము సర్వకాలములయందును ధరింపఁదగినది. అధర్వణవేదమున లింగధారణము మోక్షదాయకమైనదనియు - యజుర్వేదమున సర్వలింగగ్ స్థాపయతియనియు లింగధారణము ప్రశంసింపఁబడుచున్నది.

'ఇష్టాముఃర్జంతపసానియచ్ఛత వ్రతమేతచ్ఛాంభవం' ఇష్టలింగధారణమును శాంభవవ్రతముగ శ్రుతి విధించుచున్నది.

లింగధారణము బాహ్యాభ్యంతరములచే రెండు విధములుగనున్నది. 'అంతర్ధారయితుం శక్తోహ్యాశక్తోవాద్విజోత్తమః సంస్కృత్య గురుణాదత్తం లింగంధార్యమురస్థలే। ఇష్టలింగమిదంఖ్యాత మరిష్టపరిహారకం। బాహ్యేచధారయేల్లింగం తద్రూపమితినిశ్చయాత్' అంతర్ధారణమందు శక్తుఁడైన నశక్తుఁడైనను గురువుచే సంస్కరింపఁబడి యివ్వఁబడిన నరిష్టపరిహారకమగు నిష్టలింగమును బాహ్యాంగమున ధరింపవలయు. అంతర్లింగరూపముగ భావింపవలయును. ఇటుల శంకరసంహితయందుఁగలదు.

సామవేదమునందలి జైగిషవ్య శాఖయందలి సదానందోపనిషత్తునందు 'అంతర్ధారణశక్తోవాహ్యాశక్తోవాద్విజోత్తమః సంస్కృత్యగురుణాదత్తంశైలం లింగమురస్థలే ధార్యం............ముక్త్యర్థం' బ్రాహ్మణశ్రేష్టుఁడు జ్యోతిర్లింగాను సంధానమందు శక్తుఁడుగాని యశక్తుఁడుగాని ముక్తికొఱకు గురుదత్తమును - షడధ్వాది సంస్కారరూపమున సంస్కరింపఁబడినదియు శైలమగులింగమును వక్షస్థలంబున ధరింపవలయునని యాదేశింపఁబడినది.

శైవసిద్ధాంత శిఖామణియందును 'ధారయేచ్ఛాంకరం లింగం శరీరేప్రాణయోగతః। లింగస్యధారణం పుణ్యం సర్వపాప ప్రణాశనం' సర్వపాపహరమును పుణ్యదమునైన లింగమును శరీరమందుఁ బ్రాణ

యోగమునఁ (అనగా ప్రాణమే లింగమను భావనచేత) ధరింప వలయుననియున్నది.

అథర్వణ వేదమందలి మైశ్వర్యశాఖయందు 'యోవా మహా స్తార్చితలింగమేకం పరాత్పరం ధారయతేచనిత్యం విప్రక్షత్రియో వాతస్స్యైవలభ్యః పరమేశ్వరోసౌ నిరంజనం పరమం సామ్యముపైతి దివ్యం' బ్రాహ్మణుఁడుగాని క్షత్రియుఁడుగాని యెవ్వఁడు వామ హస్తమునఁ బూజింపఁబడిన లింగము నెల్లపుడు ధరింపుచున్నాఁడో వానికిఁ బరశివుఁడు పొందశక్యమైనవాఁడగును అనగా దోషరహితుఁడును - నిరంజనుఁడు నగు శివుని సాయుజ్యమందునని చెప్పఁబడియెను.

పవిత్రమగు లింగధారణమువలనఁ గాయశుద్ధియు నాత్మశుద్ధియు - మోక్షప్రాప్తియు సంభవింపుచున్నవి.

'స్ఫాటికాదీని లింగాని శక్తియుక్తానిచార్చయేత్। పంచసూత్రాత్మికం లింగం పూజయే ద్దిష్టసిద్ధయే। నన్యూన మర్ధాంగుళతోధికం నాంగుళమానతః।పంచసూత్ర సమాయుక్త మిష్టలింగంధ రేత్సుధీః' అర్ధాంగుళముకంటెఁ దక్కువకానిదియు నంగుళముకంటె నధికము కానిదియు - పంచసూత్ర ఘటితమునగు లింగమును శక్తియుక్తమగు స్ఫటికాది వికారమగుదానిని ధరించి పూజింపవలయునని మకుటోత్తరమునఁగలదు.

పంచసూత్ర విచారమునుగూర్చి గౌతమీతంత్రమిట్లుల ప్రకటించుచున్నది. 'లింగమస్తకవిస్తారో లింగోచ్ఛ్రాయసమోమతః। పరిధిస్త్రగుణితః తద్వ్యత్రంవ్యవస్థితం ప్రనాళికాతద్ద్వైవస్యాత్ పంచసూత్ర వినిర్ణయః। లింగమస్తకవిస్తారం లింగోచ్ఛ్రతానమంకృత్వా తత్త్రిగుణసూత్రవేష్టనార్థం లింగస్థాల్యంకృత్వా। తత్సమం వృత్తంచ తురశ్రంవాపీఠం విస్తారమధశ్శోర్ధ్వంచ కుర్యాత్। పీఠోచ్ఛ్రతాత్ లింగోచ్ఛ్రతాతోద్విగుణా। పీఠమధ్యే లింగాద్ద్విగుణస్థూలం। పీఠోచ్ఛ్ర

తాత్ తృతీయాంశేన కంఠం కృత్వాతస్యోర్ధ్వం అధశ్చసమం వప్రి ద్వయంత్రియంవా కృత్వాలింగవిస్తార సప్తాంశేపి పీఠోపరిబాహ్య మేఖలాంకృత్వా। తదంతస్సం లగ్నం తత్సమీఖాతంకృత్వా। పీఠాద్బహిర్లింగ సమదీర్ఘాం పీఠార్ధదీర్ఘాంవా మూలే దైర్ఘ్యసమవిస్తారాం తృతీయాంశేన మధ్యేఖాతం పీఠవత్సమేఖలాం ప్రనాళికాంకుర్యాత్’ బూర్వోక్త విషయార్థవిచారమిటు ధర్మసింధువునఁగలదు. లింగము యొక్క పొడవును - లింగము వెడల్పు - లింగమువలమును - పీఠము వెడల్పులును - సోమసూత్రముకొలతయునను నివి పంచసూత్రములు. అందు లింగము శిరస్సునందు విస్తారము లింగము పొడవుతో సమముగాఁజేసి దానికి మూడురెట్లు సూత్రము చుట్టుటకుఁ దగినటుల లింగముయొక్క వలముచేసి, లింగముచుట్టును - లింగవిస్తారముతో సమమయిన విస్తారముఁగలిగి, వర్తులమయిన పీఠము చేయవలయును. పీఠము పొడవు లింగమునకు ద్విగుణమై యుండవలయును. పీఠము ప్రక్కనంటి యుత్తరభాగమునఁ బ్రణాళిక యనఁగా సోమసూత్రము లింగముపొడవుతో సమమయిన పొడవును మొదటిభాగములో నట్టి పొడవుతో సమానమయిన కొలతగల వెడల్పును గలదియై తుదిని దానిలోసగము వెడల్పు గలుగునటుల తగ్గించి కాలువవలె సోమసూత్రము చేయవలయును. లింగము పొడవునకు మూడురెట్టులు పీఠము పొడవు ఉండవలయునని కొందరు - యిఁక పీఠమధ్యమందు లింగవకంటె రెండురెట్టులు సూత్రము వలమగునట్లు పీఠము పొడవు మూడవవంతు కంఠాకారముగఁ జేయవలయును. కంఠము నూర్ధ్వాధోభాగములందు సమమయిన యొడ్డులేర్పరచి పీఠము పై భాగమున లింగవిస్తారములో నారవభాగమునకు సరిగా మేఖలవలె చుట్టును మెరకవదిలి దానిప్రక్కన దానితో సమమయిన లోతుగాఁ బల్లముచేయవలయును. ప్రనాళికయందును వెడల్పులో మూడవ

వంతు లోతుగల పల్లము చేయవలయును. పీఠమందు మేఖలముం గూడ నేర్పరుపవలయును.

విద్యేశ్వరసంహితయందు 'నాదో లింగమితిజ్ఞేయం బిందుపీఠ ముదాహృతః। బిందునాదయుతం రూపం లింగాకార మిహోచ్యతే। లింగం శివమితిజ్ఞేయం పీఠశ్శక్తిరుదాహృతః' నాదము లింగమనియు బిందువు పీఠమనియు బిందునాదాత్మికమైనదై బిందురూపమగు పీఠముతోఁగూడి సశక్తికమయిన నాదరూపమగు లింగమే శివుఁడై యున్నందున సశక్తికమగు లింగార్చనమే చేయదగినదను యర్థము ప్రకటీకృతమగుచున్నది.

'శివాధిక్యే భవేన్మృత్యుశ్శక్త్యాధిక్యే ధనక్షయః। శివశక్తి సమంలింగం భుక్తిముక్తిఫలప్రదం' లింగమధికమగుచో మృత్యువును శక్తి యధికమగునేని ధనక్షయమునుగలుగును. లింగము పాను వట్టము సమముగానున్న లింగమును బూజించిన భక్తుఁడు భుక్తిముక్తు లనొందుచున్నాఁడని మకుటోత్తర శివాగమమునఁగలదు.

ఎప్పుడు గురుఁడు దీక్షనొసఁగి లింగమును ధరింపఁజేయునో యది మొదలుకొని ప్రాణలింగముల కవినాభావముగలిగి లింగైక్యుఁడై భక్తుఁడుండును. వాతూలాగమమున మూలమంత్రోపదేశ మొనర్చి గురుఁడు శిష్యునకు లింగము నొసఁగవలయును. ఆలింగ మనంతతేజోమయమయినది. అందు శివసంయోగము గావింపఁ బడినది. లింగమునందుఁ బ్రాణమును - ప్రాణమందు లింగమును సంయోజనము చేయఁబడినపిదప నది ప్రాణలింగమని చెప్పఁబడు చున్నది. ఇట్టియవి నాభావసంబంధమునకే యైక్యమని యర్థము గలదు. మఱియు దీక్షాకాలమున హేశిష్య! 'లింగంత్వమేవాసి' లింగము నీవేయని లింగాంగసంయోగవిధియు నుపదేశింపఁబడు చున్నది. స్కాందపురాణమునందును పీఠమునందున్న లింగమున శిష్యప్రాణముల నుంచవలయును. ఆలింగమూర్తని ప్రాణములయం

దుంచవలయునని చెప్పఁబడినది. ప్రాణమువోలె లింగము ధరింపఁ దగినదగుట యిదియే ప్రాణలింగమని గురుఁడు శిష్యునకు లింగము నొసంగి ప్రాణేష్టలింగముల యైక్యతను దెలియఁజేయుచున్నాఁడు. ప్రాణశబ్దమందుఁ బ్రాణభావము విడువఁదగినది. ప్రాణమునందు లింగమెపుడు ప్రతిష్ఠింపఁబడుచున్నదో యప్పటినుండియుఁ బ్రాణేష్ట లింగములయందు భేదభావముతలఁచుటతప్పగును. ప్రాణమున లింగమును - లింగమునఁ బ్రాణమును దృష్టిపాతశక్తిపాతములతోఁ బ్రతిష్ఠింపఁబడును. ప్రాణములోఁగల సాయుజ్యమే ప్రాణలింగ మగుచున్నది. ఇట్లు ప్రాణేష్టలింగ రహస్యము శంకరసంహితయందుఁ గలదు.

'ధారయంతోనరాః స్థూలం కారణం సంప్రయాంతిహి' ఇద్దాననే నరుఁడు స్థూలలింగమును ధరించి కారణమునే పొందుచు న్నాఁడనియు - 'కీటోభ్రమరయోగేన భ్రమరోభవతిధృవం। మానవశ్శివయోగేన శివోభవతి నిశ్చయం' భ్రమరకీటకన్యాయము ననుసరించి శివయోగమున శివుఁడగుచున్నాఁడనియు లింగధారణ ప్రశంసయందు లింగమహాపురాణమునఁ జెప్పఁబడినది.

జ్ఞానుల కీలింగధారణముతోఁ బనియేమున్నదని తలంచఁ గూడదు. అంతర్లింగారాధన మొనర్చుచున్నను బాహ్యలింగమును గూడ నర్చింపవలయునని శ్రుతియే వచించెను. ఏది మనస్సుతో ధ్యానింపఁబడుచున్నదో యది వాక్కుతోఁ బలుకవలయును. ఏది నోటితో నుచ్చరింపఁబడుచున్నదో తదనుకూలముగఁ జేతితో బాహ్యమునఁ గర్మనాచరించి తీరవలయునని శైవశాస్త్ర నిర్ణయము ఈ యర్థమే ఋగ్వేదమున 'అంతరిచ్ఛంతితంజనేరుద్రం పరోమనీషయా గృభ్ణంతి జిహ్వయాశసం' అస్యార్థః అంతః హృదయాకాశే। ఇచ్ఛంతి జనే జనేషు। తం రుద్రం పరం బాహ్యోపాసన మనీషయా బుద్ధిపూర్వక హృదయస్థితోపాసనాత్। తపవాన్నమశ్నంతి అంతరా

రాధనస్య బహిరారాధనం ఇతి శివజ్ఞానశేఖరే ఉదాహృతం!' ఏరుదుఁడు మనస్సునందు భావింపఁబడి పూజింపఁబడుచున్నాఁడో యాతనిని బాహ్యమందును బూజింపవలయునని యిట్లు యేర్పడు చున్నది.

శివరహస్యమున 'సక్రియా రహితం జ్ఞానం। నజ్ఞాన రహిత క్రియాః నాపశ్యన్నంధకోదగ్ధః పశ్యన్ దగ్ధశ్చపంగుకః।' అగ్నిజ్వలన సంయోగాత్ ఉష్ణం భవతి వారిచ జ్ఞానమాతః క్రియాబాహ్యః ఏకీ భావసమన్వితా। యథాజలం తథాకుంభే బహిరగ్నిప్రిభావతః।' క్రియ లేక జ్ఞానమును జ్ఞానము లేక క్రియయును గూడవు. అట్లు గానిచో జూడఁజాలక గుడ్డివాఁడును జూచుచుఁ గుంటివాఁడు నగ్నిలోఁబడినట్లుండును. అగ్నిసంయోగమున ఘటస్థమగు నీరు కాగినటుల బాహ్యమందుఁ జేయఁబడు నిష్టలింగారాధనముతోఁ గాని యంతస్సులోని ప్రాణలింగారాధనము ఫలోన్ముఖము కాఁజాలదు. కాన జ్ఞానులకైనను యిష్టలింగధారణ మావశ్యకమే యగు చున్నది.

ఇష్టలింగధారణమున పదే పదే దుష్టవ్యాపారములనుండి మరలింపఁబడియు - మనోనిశ్చలత చెందియు - ననుక్షణము పరమ దైవమగు పరమేశ్వరస్మరణ స్ఫురణనొందియు - నామహనీయుని సదుపదేశ గ్రంథములగు వేదాదులయందును - తద్ధర్మములగు శివా ర్చనాది కృత్యంబులయందపరిమాదత నొందియు శిష్టపూజనీయుఁ డును బవిత్రుఁడునై సర్వాంగలింగ సిద్ధిఁబడసి జీవభావనివృత్తి నొంది మానవుఁడు నిరంతర శివజీవైక్యాను సంధానముగల వాఁడగును.

పరమోత్కృష్టమగు నిట్టి ధర్మాచరణమున నసాధ్యమగున దెద్దియు నుండఁజాలదు.

పాదోదక ప్రసాదములు:- 'అకాలమృత్యుమథనం సర్వవ్యాధి నివారణం। సర్వపాపోపశమనం శంభోః పాదోదకం శుభం' అకాల మృత్యువును హరించునదియు సర్వవ్యాధి నివారణమును సర్వపాపోపశమనమునై శివపాదోదకము ప్రసిద్ధమగుచున్నది. పవిత్రమగు పాదోదకమును శిరస్సున ధరించి మానవుఁడు సర్వతీర్థస్నానమునఁ గలుగు ఫలములనందుచున్నాఁడు. అభిషేకజలపానమున శూల కుష్టాదులగు మహావ్యాధులనుండి మానవుఁడు రక్షింపఁబడునని యాయుర్వేదమున వచింపబడుచున్నది. సంసారబంధముక్తినిఁ గోరువాఁడు గురుచరేశ్వరుల పాదోదకము గ్రహింపవలయునని చంద్రజ్ఞానమునగలదు.

కాశీఖండమందు 'స్నాపయిత్వావిధానేన యోలింగస్నపనోదకం త్రిః పిబేత్త్రివిధం పాపం తస్యేహాశువినశ్యతి' లింగాభిషేకతీర్థమును ముమ్మారు గ్రహించువానికి త్రివిధములగు పాపములు శీఘ్రముగా నశించునని గలదు. బ్రహ్మాండపురాణమందు 'పృకం థూద మహాతీర్థం గంగాచ యమునానదీ నర్మదాసరయూర్వేత్రవతీ గోదావరీనది సదాసన్నిహితాస్త్వేతా శ్శంభో స్నానోదకే మునే శంభో స్నానోదకం సేవ్యం సర్వతీర్థమయంహియత్ ధారణాత్పాప సంఘాత్తైస్తత్క్షణా దేవముచ్యతే' సర్వతీర్థంబులును శంభుస్నానోదకమందుండుట కతన నట్టి తీర్థంబును శిరంబునఁ జల్లుకొని సేవించువాఁడు సర్వపాప విముక్తుఁడగుచున్నాఁడని గలదు.

జాబాలమందు శంభు పాదోదకమును గూర్చి ఇయంమే గంగేయమునే యను మంత్రముచే నభిమంత్రించి కద్రుద్రాయేతి... యను మంత్రముచే సమ్మార్జనముచేసి ఋతగ్ంసత్యం పరంబ్రహ్మ... యను మంత్రముతోఁ బ్రాశనముచేయవలయుననియు నట్టివాఁడు పూర్వోత్తరులగు పదితరములవారినిఁ దరింపఁజేసి తానును దరింపుచున్నాఁడనిగలదు. ఉపవాస సహస్రాణి ప్రాజాపత్యయుతానిచ

శివప్రసాద సిద్ధస్య కోట్యంశేనాపినోసమాః ప్రాజాపత్యయుతములగు సహస్రయుపవాసములఫలమును శివప్రసాదసిద్ధుని కోట్యంశతోనయిన సరిపోవఁజాలదు 'శివేనభుక్తం భుంజీయాత్ తత్పీతంహిజలంపిబేత్ శివాఘ్రాతం సదాజిఘ్రే దేషధర్మస్సనాతనః' శివునికర్పింపక నెద్దియైన తాననుభవింపరాదనియు 'భుంజంతే యేతుసమ్మోహా త్స్వయం బకాయాసమర్పితంతే భుజంతే క్రిమిానేనాం న్యధోగచ్ఛంతిశాశ్వతం' యట్లనుభవించిన మూఢులధోగతి నందుదురని చంద్రజ్ఞానాగమమునఁ గలదు.

పత్రముగాని . ఫలముగాని - పుష్పముగాని - జలముగాని - యన్నపానములుగాని పరమేశ్వరుని కర్పింపక గ్రహింపకూడదనియు- పరమేశ్వరుని కర్పించిన పదార్థము పరమేశ్వర ప్రసాదమునకు సాధక మయినది గాన ప్రసాదమను నామముగలిగి పరమానంద కారణ మగుచున్నదనియు - ముక్తిసాధనమై - శుద్ధ - సిద్ధ - ప్రసిద్ధాఖ్యలు గల శివ గురు చర ప్రసాదములు నిత్యానుభవనీయములనియు - గురుచరులిద్దరు సంభవింపనపుడు శివప్రసాదమునే త్రివిధప్రసాద ముగా భావించి గ్రహింపవలయుననియు గురుచరులిద్దరు సంభవించి నపుడు చరప్రసాదమునే గురుప్రసాదముగాగూడ భావించి గ్రహిం పవలయుననియు చరుఁడులేక గురుడుమాత్రము సంభవించినపుడు గురుప్రసాదమునే చరప్రసాదముగాగూడ భావించి గ్రహింపవలయు ననియుఁ జంద్రజ్ఞానమునఁగలదు. పాదతీర్థమునుగూడ నిటులే గ్రహింపవలయును.

'వరం ప్రాణపరిత్యాగ శ్శిరసోవాపికర్తనం న [illegible] పూజ్య భుంజీతశివలింగే మహేశ్వరం లింగార్చితానిద్రవ్యాణి [illegible] జీయాంద ప్రమాదతః అసర్పితానిద్రవ్యాణి వర్జయేత్ భక్తిమాన్న[illegible] శివునిఁ బూజింపకయు - నివేదింపకయు నాహారపదార్థముల గై[illegible] బ పాప కారణమని శంకరసంహితయందుఁ [illegible]లదు.

సౌరసంహితయందు 'ఏకఏవేతియోూరుద్రి స్సర్వవేదేషు గీయతే తస్యప్రసాదలేశేన ముక్తిర్భవతిశాంకరి - ప్రసాదభోక్తౄన్ నిందంతి యేజనాభక్తి నంయుతాన్ తేయాంతి పితృభిస్సార్థం నరకం నాత్రసంశయః' వేదస్తుత్యుఁడగు నీశ్వరుని ప్రసాదలేశముచేతనే ముక్తిగలుగుచున్నది. భక్తియుక్తులును - ప్రసాదభోక్తలునగువారిని నిందింగువారలు బంధుసహితులై నరకమందుఁ గూలుదురని గలదు.

'శంభోర్నిర్మాల్యకం శుద్ధం భుంజీయాత్సర్వదాద్విజః। అన్యదేవస్యనిర్మాల్యం భుక్త్వాచాంద్రాయణంచరేత్' పవిత్రమగు నీశ్వర ప్రసాదమును ద్విజులు సర్వదా భుజింపవలయును. అన్య దేవతల ప్రసాదము గ్రహించినచో చాంద్రాయణము చరింపవలయునని శివ సంహితయందుఁగలదు.

శంకరసంహితయందు 'స్వయంలింగాంగ సంబంధ శ్శివఏవ చనాపరః।తస్మాత్తదన్యోభుక్తాన్న మనచ్చ పాదోదకం త్యజేత్ లింగాంగ సంగినో దేహేశివ స్సమ్యక్ ప్రకాశతే నతత్రాన్యమరోద్దిష్టం నాన్య పాదోదకం పిబేత్। అతోలింగాంగ సంబంధీ నభుంజీయాత్ కదాచన నాన్యదేవోపభుక్తాన్నం నాన్యపాదోదకం పిబేత్' లింగాంగసంబంధము గలవాఁడనగా లింగధారి శివుఁడేగాని యితరుఁడు కాఁడు. ఆకారణమున నితర భుక్తాన్నము నితర పాదోదకమును త్యజింపవలయును. లింగధారి దేహమందు శివుండే ప్రకాశించుటకతన నితరదేవతోద్దిష్టమగు పదార్థమును పాదోదకములనుంచకూడదు. అనగా నితర దేవతోద్దిష్టములగు వాటినెప్పుడును స్వీకరింపఁగూడదని చెప్పంబడినది.

స్వచ్ఛందలలితభైరవమందు పరమేశ్వర కుమార సంవాదమున 'నిర్మాల్యధారణాత్పుత్రసాలోక్యం లభతేనరః పాదోదకస్య పానేన సామీప్యం లభతేసదా। మత్ప్రసాదోపభోగేన సామీప్యం ప్రతిపద్యతే' న్నా నిర్మాల్యధారణమున సాలోక్యమును - పాదోదక

పానముచే సామీప్యమును - ప్రసాద గ్రహణంబుచే సామీప్యమును భక్తుఁడు పొందుచున్నాఁడని యీశ్వరుఁడు కుమారస్వామితో వచించెను.

శివానుభూతమఖిలం నిర్మాల్యం పరిభాషతే। దేవస్వం దేవతాద్రవ్యం। నైవేద్యంచ నివేదితం। చండద్రవ్యం బహిఃక్షిప్తం నిర్మాల్యం షడ్విధం స్మృతః। దేవస్వంగ్రామ భూమ్యాది దాసదాసీ చతుష్టయం। హేమరౌప్యకరత్నాది దేవద్రవ్యమితిస్మృతం। మనసా యచ్ఛివోద్దిష్టద్రవ్యం నైవేద్యముచ్యతే। శివోపభుక్తస్రగ్గంధమన్నపానాదికం తథా నివేదిత మితిప్రోక్తం సురైర్మునిభిర్నరైః ప్రతిష్ఠితస్యలింగస్య నైవేద్యం యత్సమర్పితం తచ్చండద్రవ్యమిత్యుక్తం పూర్వసంధ్యాసమర్పితం పత్రం పుష్పం బహిఃక్షిప్త మితిషడ్విధముచ్యతే' శివానుభూతమగు సర్వము నిర్మాల్యసంజ్ఞచే నొప్పుచున్నది. దేవస్వము - దేవతాద్రవ్యము - నైవేద్యము నివేదితము - చండద్రవ్యము - బహిఃక్షిప్తము అని నిర్మాల్య మారువిధములు అందు గ్రామభూమ్యాది దాసదాసీచతుష్టయము దేవస్వమనియు - హేమరౌప్యకరత్నాదులు దేవద్రవ్యమనియు - శివోద్దిష్టమగు ద్రవ్యముగా భావించుట నైవేద్యమనియు - శివోపభుక్తములగు మాలికాగంధములు నన్నపానాదికములు నివేదితమనియు - దేవతలచేగాని - మునులచేగాని - నరులచేగాని ప్రతిష్ఠింపఁబడిన లింగముల కర్పించిన నైవేద్యము చండద్రవ్యమనియు - పూర్వాహ్నమందీశ్వరుని కర్పించి తీసివేయబడినది బహిఃక్షిప్తమనియు వచింపఁబడుచున్నవి.

'చండాధికారవత్యేవ లింగే తస్యనిషేధతః తదభావాచ్చ బాణాదౌ నిర్మాల్యంసేవ్యమాస్తికైః। బాణలింగే చరేలోహే రత్నలింగే స్వయంభువి ప్రతిమాసుచసర్వాసు నచండాధికృతిర్భవేత్' చండాధికారముగల లింగమందు నిర్మాల్య నిషేధముండుటవలన నట్టి చండాధికారములేని బాణ - చర - లోహ - రత్నస్వయంభూలింగ

ములయందును - సమస్తమయిన ప్రతిమలయందును ఆస్తికులగువారు నిర్మాల్యమును గ్రహింపవలయును.

శివపురాణమందు 'నిర్మాల్యం నిర్మలం శుద్ధం నిర్మలత్వాద నిందితం తస్మాదభోజ్యం. నిర్మాల్యం ప్రాకృతైరశివాత్మభిః లోభాన్న ధారయేచ్ఛంభో నిర్మాల్యం నచభక్షయేత్ నిర్మాల్యలంఘనాచ్ఛంభోః స్సిద్ధిభ్రంశోపిజాయతే। జిహ్వాచాపల్యసంయుక్త శ్శివసంస్కారవర్జితః శివనిర్మాల్యభోగీచ రౌరవం నరకం వ్రజేత్' నిర్మలమై - యనింది తమై యొప్పుచున్న నిర్మాల్యమును శివసంస్కారములేని ప్రాకృతులు భుజింపఁగూడదనియు జిహ్వాచాపల్యముచే ననుభవించిన రౌరవాది నరకమును బొందుదురనియుఁ జెప్పుటచేత శివసంస్కారసహితులే శివనిర్మాల్యమును గ్రహింపవలెనని నిర్ణయమగుచున్నది.

కామికమందు 'అశుద్ధాత్మాశుచిర్లోభాన్మద్భుక్తం పావనం పరం భక్షయన్నాశమాయాతి' అశుచియగునాతఁడు లోభమువలన పవిత్రమై మద్భుక్తమయిన దానిని భక్షించి నాశనముపొందుచున్నాఁ డని శివవచనముగలదు. శివధర్మమునందును 'నిర్మాల్యంధారయే న్నిత్యం భక్త్యాలోభాన్నధారయేత్ నిర్మలత్వాచ్చ నిర్మాల్యం మల దేహీనధారయేత్' భక్తిచేతనే శివనిర్మాల్యమును ధరింపవలయును - నిర్మలమయినదగుట మలదేహియగునతఁడు లోభమున నిర్మాల్య మును ధరింపఁగూడదని వచింపఁబడినది.

'లింగధారిణోలోకే దేశికామత్పరాయణాః మదేకశ్శరణస్తే షాంసౌభాగ్యం వైనాస్యజంతుషు మదీయాభుక్తం నిర్మాల్యం పాదాంబు కుసుమందళం ధర్మమర్థంచ కామంచ మోక్షంచ విదధేక్రమాత్' మత్పరాయణులై నాశరణ్యము నభిలషించువారును. లింగమును ధరించువారును మాత్రమే మత్ప్రసాదము గ్రహింపనర్హులు. నా ప్రసాదముగాని మదీయములగు పాదోదక దళ కుసుమంబుల నద్ది

యైనను ధర్మార్థ కామమోక్షంబుల నొసంగజాలునని శివవచనవ
గలదు.

శివపురాణ విద్యేశ్వరసంహితయందు 'దృష్ట్వాపి శివనైవేద్య
యాంతిపాపానిదూరతః। భుక్తేతు శివనైవేద్యే పుణ్యాన్యాయాం
కోటిశః। అలంయాగ సహస్రేణ హ్యలం యాగార్బుదైరపి భక్షి
శివనైవేద్యే శివసాయుజ్యమాప్నుయాత్। ఆగతం శివనైవేద్య
గృహీత్వాశిరసాముదా భక్షణీయం ప్రయత్నేన శివస్మరణపూర్వక
నయస్య శివనైవేద్యగ్రహణేచ్ఛా ప్రజాయతే సపాపిష్ఠోగరిష్ఠస్యా
న్నరకం యాత్యపిధ్రువం' శివనైవేద్య భక్షణమువలనఁ బాపము
నశించి పుణ్యము ప్రాప్తించుననియు - శివనైవేద్యగ్రహణేచ్ఛా
హితుఁడు నరకమును జెందుననియు - నీమొదలగు ప్రశంసా
నములు బహుధా వర్ణింపఁబడినవి. స్వేష్టలింగేచయద్దత్తంచరుక
న్నసంశయః యిష్టలింగమున కర్పించినది హవిస్సగుచున్నదని చం
జ్ఞానాగమమునకలదు.

అనివేదితపదార్థము ననుభవింపకుండుటయు నివేదిత పదార్థ
విడకుండుటయు తీర్థప్రసాద గ్రహణధర్మములందుత్కృష్ట ధర్మ
యున్నది. ఇద్దాన శివపూజాకాలమునందు శైవశిష్టులు భరితమ
బేరుతోఁ బదార్థముల నొక్కమారు వడ్డించుకొని నివేదించుటయు
సర్వము నర్పించియే యితర కాలములయందు గ్రహించుటయు
నర్పించినదానినిఁ బరిహరింపకుండుటయు నాచారము సనాతన ధ
మునైయున్నది.

నివేదనము రెండువిధములుగ విభజింపఁబడియున్నది శి
నుభవించుటకుగాను దానర్పించునది యొకటియుఁ దాను వినియో
గించుకొనుటకు శి[illegible]రూపకముగ నివేద[illegible]యొకటి[illegible]నైయున్న
ఇద్దాన శిష్యాదులకుఁ బ్రసాదమునిచ్చు స[illegible]ర్భమునను మఱి

నితర విధోపయోగముగ నుపచరింపఁబడియు నయ్యది దోషయుక్త మగుటలేదు.

దీపాన్త ఉపచారస్స్యాత్ నైవేద్యాంతచపూజనం। తస్మాన్నైవేద్యహీనంచేత్పూజాలోపో భవేత్సదా। తత్తప్రసాద భోగాన్తం నైవేద్యార్పణముచ్యతే ప్రాసాదాదానహీనంచే దర్పితంచాపినిష్ఫలం' దీపాన్తముపచారమును నైవేద్యాంతము పూజనమునగుటచే నైవేద్య హీనమగుచో పూజాలోపము సంభవించును. ప్రసాదభోగాన్తము నైవేద్యార్పణమగుట కతన బ్రసాదము గ్రహింపకుండిన నర్పించియు నట్టి ప్రసాదము నిష్ఫలమేయగునని కారణోత్తరమునఁగలదు. ఇద్దాన ప్రసాద స్వీకరణావశ్యకత ప్రధానధర్మముగ నేర్పడుచున్నది. చతుర్విధ పురుషార్థ ఫలసిద్ధిదములగు తీర్థప్రసాదములు సాక్షాచ్ఛివప్రసాదములే యగుచున్నవి.

భక్తుఁడు : 'భజంతియే మహాదేవం పరమాత్మానమవ్యయం కర్మణా మనసా వాచా తేభక్తా ఇతికీర్తితాః' అవ్యయ స్వరూపుఁడగు పరమేశ్వరుని మనోవాక్కాయ కర్మలచేత నెవ్వరు భజింపుచున్నారో వారు భక్తులగుచున్నారు. సంసారభయాపహమయినటువంటి శివుని యందలి భక్తి దుర్లభమయినదిగదా? 'సర్వాత్మాపి పరిచ్ఛిన్నో యథాబింబేషు వర్తతే తథాస్వకీయ భక్తేషు శంకరోభాసతేసదా' సర్వాత్ముఁడగు సూర్యుడు పరిచ్ఛిన్నుఁడై బింబములయందెటుల ప్రవర్తించుచున్నాఁడో యటులే స్వకీయులగు భక్తులయందు శంకరుఁడు ప్రకాశింపుచున్నాఁడనియు 'విశుద్ధేషు విరక్తేషు వివేకిషు మహాత్మను శివస్తిష్ఠతి సర్వాత్మా శివలాంఛనధారిషు' శివలాంఛనముల ధరించి విశుద్ధులై వివేకులయిన మహాత్ములయందు సర్వాత్ముఁడగు శివుడు సదా నివసింపుచున్నాఁడనియు శంకరసంహితయందుఁ గలదు.

'యత్కృతం శివభక్తానాం తచ్ఛివస్యకృతం భవేత్' ఏది శివభక్తునికొరకుఁ జేయబడునో యయ్యది శివునికిఁ జేయఁబడినదియే యగును.

'ఏకమూర్తి స్త్రయోభాగాః గురుర్లింగంచ జంగమః' పరమేశ్వరుని మూర్తియే గురులింగజంగమ (భక్త) ములని మూఁడువిధము లుగ నయ్యెను.

క్రియాసారమందు 'అనేక జన్మసిద్ధానాం శ్రౌతస్మార్తానువర్తినాం నరాణాం క్షీణపాపానాం శివేభక్తిః ప్రజాయతే' అనేక జన్మలయందు శ్రౌతస్మార్తకర్మల నాచరించి పాపంబుల క్షీణింపఁజేసుకొనిననేగాని శివునియందు భక్తి కుదురనేరదనియు - శివగీతయందు 'కోటిజన్మార్జితైః పుణ్యైః శివేభక్తిః ప్రజాయతే' కోటిజన్మలయందు బుణ్యమార్జించినఁగాని శివునియందు భక్తి కుదురనేరదనియుఁ జెప్పుటచేత 'శివభక్తోవిశిష్యతే' శివభక్తుఁడు సర్వోత్కృష్టుఁడగుచున్నాఁడని సిద్ధాంతమగుచున్నది. 'యస్తుమాహేశ్వరో విప్రోజాతమాత్రోపి జీవికః। ఉత్తమం సర్వపాత్రాణాం తస్మైదత్తం తదక్షయం' విప్రుఁడగు మహేశ్వరుఁడు జన్మచేతనే యుత్తమోత్తముఁడు గాన నాతని కొసఁగిన దానమక్షయమగునని క్రియాసారమునఁగలదు.

ఎచట మాహేశ్వరుఁడు వసింపుచున్నాఁడో, యాప్రదేశము యోజనపర్యంతము వారణాసి సమమగుచున్నదని స్కాందమునఁ గలదు.

భక్తపూజనము సర్వార్థసాధనము. భక్తమహిమలు వర్ణనాతీతములు. భక్తులఁ బూజింపగా శివుఁడు సంతసించును. భక్తుల సేవింప నైహికాముష్మిక సుఖంబులు చేకూరుచున్నవి. భక్తపదధూళిచేఁ బవిత్రమగు గృహము భవనమనియు - నట్లు గానినాఁడు భవనశబ్దమునకు భాండారము లోపించుననియు నభియుక్తోక్తి గలదు. తీర్థయజ్ఞ ఫలాదికముకంటె భక్తపూజనమువలనఁ గలుగు ఫలమధికము.

అందు శివయోగికిడు తృణమైనను గోటిగుణిత ఫలమొసంగునని శైవశాస్త్రములు వచించెను. షట్స్థలజ్ఞానియగు మాహేశ్వరునిఁ బూజింపుడు. మాహేశ్వరపూజయే పరమేశ్వరుఁదెలియగల సాధనము. మాహేశ్వరుఁడు సాక్షాన్మహేశ్వరుఁడే. లింగాంగసంగియగు నామహానీయునిఁ బూజించినచో గర్భనరకము లేదు. నాభక్తులఁ బూజింపక నన్నుఁ బూజించినచో నాపూజ వ్యర్థమగునని శివశాసనమునఁగలదు.

'దద్యాదన్నం మహాదేవ భక్తాయ శివయోగినే సర్వపాప వినిర్ముక్తశ్శివలోకే మహీయతే। ధనందద్యాద్యథాశక్త్యా యఃపుమాన్ శివయోగినే సధనేశత్వమాప్నోతి సుఖమక్షయమశ్నుతే। సర్వసస్యాన్వితాం భూమిం విప్రాయశివయోగినే యదద్యాచ్ఛివసాయుజ్యం సయాత్యత్రనసంశయః। అక్షరాణిచయావంతి దత్తేవిప్రాయపుస్తకే తావద్వర్షం శివాగారేస్థిత్వాంతే మోక్షమాప్నుయాత్। యత్రదత్తం ధనం ధాన్యం అన్నంవా శివయోగినే విప్రాయతత్ఫలంవక్తుం నసమయాశక్యతేధునా' శివయోగికి నన్నదానముచేసినవాఁడు సర్వపాపవినిర్ముక్తుఁడగును. ధనమొసంగినవాఁడు ధనేశత్వమునొందును. సస్యాన్వితమగు భూమినొసంగినవాఁడు శివసాయుజ్యముచెందును. పుస్తకమును దానముచేసిన నందక్షరములెన్నియున్నవో యంతకాలము శివలోకమందు సుఖమనుభవించును. వేయేల శివయోగికిడిన ధనధాన్యాన్న దానాదికము లనంత ఫలప్రదములై సర్వార్థసిద్ధులకుఁ గారణములగుచున్నవని శంకరసంహితయందుఁగలదు. ఒక్క శివయోగికి బిక్షాదానంబుగావించుటచే వేదజ్ఞులగు కోటిమంది బ్రాహ్మణులను యథావిధిగఁ బూజించిన ఫలంబు చేకూరును. శివయోగి నివసించు దేశమే పవిత్రంబగునని చెప్పుచుండగా శివయోగి యెట్టి పవిత్రుఁడో వేరుగ చెప్పవలయునా? శివభక్తునకు శివార్చనా సాధ

నంబులగు నక్షతలు గంధమువత్తులు మొదలగువాని నర్పించినవార నంత పుణ్యఫలంబులనంది శివప్రసాదమున కర్హులగుదురు.

శైవులు శివాద్వైతము :. 'శివేనసహసంబంధం శైవమిత్యభిధీయతే' శివునితో సంబంధముగలది శైవమని చెప్పంబడుచున్నది.

శ్లో॥ యదాగమాంత విశ్రాంత దీక్షాత్రయ సుశోభితం
అంగత్రితయ సంబద్ధలింగత్రయ విరాజితం
విశిష్టమష్టావరణైః పంచాచారాభి మండితం
వర్ణాశ్రమాయ ధర్మాఢ్యం షట్స్థలజ్ఞాన సంయుతం
సద్యః పాశక్షయకరం కర్మజ్ఞానసముచ్చయం
జగద్గురుత్వాధికృతం సర్వవిద్యాసమన్వితం
శైవం ... ... ...

వేదాగమను క్రియాత్మక దీక్షాత్రయ సహితము స్థూలసూక్ష్మ కారణములను మూడు శరీరములందు ఇష్టప్రాణ భావలింగములను మూడులింగముల సంబంధముగలదియు వర్ణాశ్రమ ధర్మయుతమైన దియుసద్యః పాశక్షయకరమును షట్స్థలజ్ఞానముతోగూడినదియు అష్టావరణ పంచాచారమండితమును నిగమాగమసమ్మతమును కర్మజ్ఞాన సముచ్చయ విలసితమును జగద్గురుత్వాధికృతమును నగు మతము 'శైవము' అను ప్రసిద్ధనామముగలది యగుచున్నదని చంద్రజ్ఞాన మున వచింపబడియెను. ఈమతము 'శైవంచ వైష్ణవంశాక్తం సౌరం గాణాపత్యంతథా స్కాందంచ' యను షణ్మతంబుల బ్రధమమును బ్రధానమునై విలసిల్లుచున్నది.

పూర్వోద్దిష్టములగు నీపరమధర్మముల ననుష్ఠింపుచు నా... ఋషిగోత్రజులై ఋగ్యజుశ్శాఖీయులై యాపస్తంబాశ్వలాయన శ్వేతాశ్వతర శాంభవీయ సూత్రానుగాములై లింగధారి బ్రాహ్మణులనియు ఆరాధ్యులనియు బిలువబడుచు చాతుర్వర్ణ్యగురుత్వమున

దధికృతులయిన నీమతమువారు శైవులని వ్యవహరింపబడుచున్నారు.

శైవమార్గ ప్రవర్తనకు నాయాగుణ సంబంధములు ననుసరించి చరుడు (భక్తుడు) అత్యాశ్రమి జంగముడు శివయోగి లింగాంగసంగి మాహేశ్వరుడు వీరశైవుడునను నామములు సహజములై యున్నవి.

## అత్యాశ్రమి.

శైవవ్రతమగు శాంభవదీక్ష 'అత్యాశ్రమం పాశుపతం శాంభవంవై శిరోవ్రతం' అత్యాశ్రమమనియు పాశుపతమనియు శాంభవమనియు శిరోవ్రతమనియు వేదాగమములయందు వచింపబడినది. కాన శాంభవదీక్షావ్రతస్థుడే అత్యాశ్రమియనియు పాశుపతుడనియు శాంభవ్రతుడనియు శిరోవ్రతియనియు చెప్పబడుచున్నాడు.

'అత్యాశ్రమీ ప్రాణలింగసంబంధి భస్మఘుంటికాం కంథాం కమండలుం భిక్షాపాత్రం చధారయేత్' అత్యాశ్రమి భస్మఘుంటికయు కంథయు కమండలువును భిక్షాపాత్రమును ధరియింపవలయునను శంకరసంహితా వచనము అత్యాశ్రమిని సన్యాసిపరముగ జెప్పినను సర్వాశ్రమ సాధారణుడగు లింగధారియందునను అత్యాశ్రమి పదము ప్రయోగింపబడినది. శ్రీకరభాష్యమందలి జిజ్ఞాసాధికరణమున 'బ్రహ్మచారీగృహస్థో వానప్రస్థోయతిస్తు వాయస్తు లింగాంగసంయుక్తస్స ఏవాత్యాశ్రమీభవేత్' బ్రహ్మచారిగాని గృహస్థుడుగాని వానప్రస్థుడుగాని యతిగాని లింగాంగసంయుక్తుడత్యాశ్రమియగుచున్నాడని లింగధారిపదమునకు బర్యాయపదముగ అత్యాశ్రమిశబ్దము నిశ్చయింపబడినది. మరియు లింగధారణచంద్రికయందు 'లింగం శివోభవేత్క్షేత్రమంగం సంయోగ ఆశ్రయః తస్మాత్ లింగాసంయుక్తోయోపి సోత్యాశ్రమీభవేత్' యనువచనము లింగధారియత్యాశ్రమియేయని వచింపుచున్నది.

## మా హే శ్వ రుఁ డు.

'వర్ణాశ్రమ సదాచారాశ్శివేనకధితాఃపురా। ఏతాన్ను ల్లంఘ్య వర్తంతే శివస్యాజ్ఞాపలాపినః' రాజాజ్ఞాభంగ కృన్మూర్ణాం దండో వానరకస్తథా। తస్మాన్మాహేశ్వరో విప్రః శృతిస్మృత్యాగమోదితం వర్ణాశ్రమోచితం ధర్మం ప్రాణత్యాగేపినత్యజేత్। విశ్వస్మాదధికో రుద్రః విశ్వానుగ్రహకారకః ఇతియస్యస్థిరాబుద్ధిః సవై మాహేశ్వర స్మృతః। స్వజాతివిహితం ధర్మంకుర్వంతః పూజయంతియే భక్త్యా శ్రీకంఠమనిశంతేపి మాహేశ్వరాస్స్మృతాః॥'.

వర్ణాశ్రమ ధర్మములు భగవంతునిచే నిర్ణయింపఁబడినవి. రాజాజ్ఞనుల్లంఘించిన నరులు దండమునకు బాత్రులయినటుల శివాజ్ఞనుల్లంఘించిన మాహేశ్వరుఁడు నరకమనుభవింపవలయును. వర్ణాశ్రమోచితములును శృతిస్మృత్యాగ మప్రసిద్ధములునగు ధర్మముల నవలంబించి యనుష్టింపుచు శివుఁడే సర్వాధిపతియని తలంచి శివుని సేవించువాఁడు మహేశ్వరుఁడుగ జెప్పబడుచున్నాడని శంకరసంహిత యందుఁగలదు.

## జం గ ముఁ డు.

చంద్రజ్ఞానాగమమున 'సహజం జంగమం మహేశ్వర ఇత్యభిధీయతే' మాహేశ్వరుఁడే సహజముగ జంగమపదవాచ్యుఁడనియు నతఁడే భక్తుఁడు జంగముఁడను బర్యాయపదంబులఁ బిలువంబడు ననియుగలదు. మఱియు జంగమములయందు బ్రహ్మచారి గృహస్థునిరాభారియను మూడువిధములగు భేదములుగలవనియు వివరింపబడియున్నది.

## ని రా భా రి.

'తురీయాశ్రమ సేవీతు నిరాభారీతి ఉచ్యతే చతుర్విధాస్తే కథ్యంతే కుటీచక బహూదకౌ హంసఃపరమ హంసశ్చేతి' ఇందు

లింగమంగమందు నుపస్థితములయినవను దృఢచిత్తముగల మహామతి లింగాంగసంగియని శైవసిద్ధాంత దీపికయందు కలదు.

## వీ ర శై వుఁ డు.

'భక్త్యుత్సాహ విశేషోపి వీరత్వమితికథ్యతే వీరవ్రతసమాయోగాత్ వీరశైవః' భక్త్యుత్సాహ విశేషము వీరవ్రతమని నిర్ణయింపఁబడినది. తద్వ్రతసమాయోగము గలవాఁడు వీరశైవుఁడని చెప్పఁబడును. మరియు, 'విశబ్దోనోచ్యతే విద్యా శివజీవైక్యబోధికా తస్యాం రమంతే యే శైవాః వీరశైవాః' శివజీవైక్యబోధినియగు మహావిద్యయందు నెవ్వరు రమింపుచుందురో వారే వీరశైవులనియు శంకరసంహితయందుఁగలదు. బింబాగమమున తత్త్వాధ్వ పరిశోధనము ప్రాణలింగోదయము చక్రభేదనము శివగురువులయందవినాభావము నన్యదర్శనత్యాగముఁగలిగి వేధామను క్రియాత్మకమునగు పాశుపతదీక్షనందుటయే విశేషవీరశైవలక్షణముగ వ్యక్తీకరింపఁబడినది. ఇట్టి విశిష్టధర్మాచరణమే విశేష వీరశైవమని చంద్రజ్ఞానమునఁగలదు.

## శి వా ద్వై త ము.

శైవులవలంబించిన సిద్ధాంతము శివాద్వైతము. శైవ పరమాచార్యులగు మల్లికార్జునపండిత హరదత్తాదులు తమకృతులయందు నీశివాద్వైతమునే సిద్ధాంతీకరించియుండిరి. అర్వాచీనపండితులు సహితము తమ గ్రంథములు శివాద్వైతపరములనియు దాము శివాద్వైతులమనియు జెప్పుకొనియుండిరి.

ప్రారబ్ధానుభవులగు పశువులు (జీవులు) శివజ్ఞానులై శివారాధనాది కృత్యంబుల నమలినులగుట శివానుగ్రహ పాత్రులయి శివసాయుజ్యముఁనందుచున్నారు. సర్వజ్ఞానోత్తరమున 'యశ్శివస్సోహ

మేవేతి అద్వైతం భావయేత్సదా' యేమహాత్ముఁడు శివుఁడని చెప్పఁబడుచున్నాఁడో యతఁడే నేనను భావనతో (శివోహం) శివారాధన చేయవలయునని యున్నది. ఈయర్థమే 'ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతిచ' యనుసూత్రమునకు నిరంతరము శివోహమితి భావనా ప్రవాహేణ శిథిలిత పాశితయాపగత పశుభావ ఉపాసకః శివఏవ భవతి' అని శ్రీకంఠాచార్యులవారు విశదీకరించియుంఢిరి.

శివఏకోధ్యేయః - శివమద్వైతం - సర్వోహ్యేషరుద్రః - సర్వగతశ్శివః - జ్ఞాత్వాశివం శాంతిమత్యంతమేతి - విశ్వాధికోరుద్రో మహర్షిః - శివఏవకేవలః - ఏకఏవరుద్రోనద్వితీయాయతస్థే. యీ మొదలగు శృత్యాదివాక్యములు శివాద్వైత వైభవ ప్రకటనమునకు నిర్దిష్టములగు రచనలై యున్నవి. చిదచిత్ప్రపంచ విశిష్టుడగు శివుడే అద్వితీయములగు కార్యకారణములగును 'శక్త్యాదిచపృథివ్యంతం శివతత్వసముద్భవం తే నైకేనతు తద్వ్యాప్తం మృదాకుంభాదికోయథా। 'మాయాంతుప్రకృతిం వింద్యాన్మాయినంతు మహేశ్వరం' ఉమాసహాయం పరమేశ్వరం 'శివేన వినాశక్తిః' ఇత్యాదిప్రమాణములందు ప్రపంచకము శక్తియనియు దానితోఁగూడి పరమేశ్వరుడెప్పుడు వసించుననియు అది అగ్నియందలి దాహకశక్తిఁబోలె శివునియందణగి యుండెనని సూచింపబడుచున్నది. శివాజ్ఞననుసరించి అది చిదచిదాత్మకముగ పరిణామమందుచుండును దానితోఁగూడిన శివుఁడొకఁడే పరముగానుండునను భావమే శివాద్వైతము శక్తివిశిష్ట శివాద్వైతమునని చెప్పబడుచున్నది. శివాద్వైతమునకు శక్తి విశిష్టాద్వైత - విశేషాద్వైత - భేదాభేద - విశిష్టాద్వైతాదినామములు కలిగియున్నను నివన్నియు నేకార్థబోధకములే యయియున్నవి.

శివాద్వైతమునే శాస్త్రకారులు లింగాంగసామరస్యమను నామముతో వ్యవహరించిరి లింగమనగా శివుఁడు అంగమనగా జీవుడు (అంగరూపోహిజీవాత్మ లింగరూపస్సదాశివః పాశయుక్తో

భవేజ్జీవః పాశముక్తో భవేచ్ఛివః) లింగాంగ సామరస్యమే (అనగా అభేదమే) లింగాంగ సామరస్యమునకు వాచ్యార్థమగుచున్నది దీనినే సోమనాథాదులు లింగైక్యమనిరి శివారాధనమొనర్పని పశువు మాటి మాటికి జన్మబాధ నొందికుందుచుండును నిరంతరశివోహం భావనా విగళిత పాశబంధముకల జీవులు శివోపాసనాజ్ఞానమున భ్రమరకీటక న్యాయమున జీవనివృత్తిద్వారా శివసాయుజ్యమునంది శివునితో కలసి సర్వభోగముల ననుభవింపుచుందురు. ఇందు శివజీవులు వేరుగానుం డరుగాని శివునితోడనే 'సోశ్నుతే సర్వాన్కామాన్సహబ్రహ్మణా విపశ్చితేతి' అనుశ్రుతిచే సర్వభోగములును జీవుడును అనుభవించు చుండుననుటచేత జీవవిశిష్టుండగు శివుడొకండేయుండుననియు (అతని సారూప్యమంది విడువక వెంటనేనుండువాడగుట జీవుడాతని సాయు జ్యమొందిది (కూడియుండి) ఆనందమునొందుగాన నీస్థితినే శివా ద్వైతమనియు ముక్తి సాయుజ్యముక్తియనియు తెలియవలెను.

విశిష్టాద్వైతమను వాక్యము శివాద్వైతమను వాక్యమునకు సమానార్థకమేగాని భిన్నార్థముకానేరదు. నీలకంఠభాష్య ద్వితీయా ధ్యాయమున 'చిద చిత్ప్రపంచ విశిష్టశ్శివఏవ అద్వితీయం కారణం కార్యంచ భవతీతి విశిష్టశివాద్వైతం' అని గలదు. దీనింబట్టి విశిష్ట శివాద్వైతమన్నను విశిష్టాద్వైతమన్నను నొకటియే యని తెలియు చున్నది. ఇంక 'భ్రమరకీటకన్యాయేన శాశ్వత శివసాయుజ్యమను విషయముననో సాయుజ్యమననైక్యమను నర్థములేదనియు' సహ యుంక్త ఇతిసయుజో యుజుర్యోగే ఇతిధాతోస్సతూస్సద్విషే త్యాది నాక్విప్ తదయోర్భావస్సాయుజ్యం' యను వ్యుత్పత్తింబట్టికూడనున్న వారని భావము. అనగా సహయోగమని యేర్పడుచున్నది గాన భ్రమరకీటక న్యాయమునకుంబై సిద్ధాంతము విరోధము కాంజాల దనియుం బండితుల యాశయము.

శైవసిద్ధాంత దీపికయందును ఆణవము - కార్మికము - మాయీయము బైందవము రోధశక్తి యను నైదుపాశములనుండి విముక్తుండై పరమేశ్వరునింబలె సర్వజ్ఞత్వము అనాదిసిద్ధబోధత్వము స్వతంత్రము అలుప్తశక్తిత్వము అనంతశక్తియుక్తత్వము నను సద్గుణైశ్వర్యంబులతోఁగూడి పరమశివుని సారూప్యమును సాయుజ్యమును ముక్తుండొందుననియుఁ బంచకృత్యాధికారములఁ బరమేశ్వరుఁడే జీవకోటి ననుగ్రహించుననియు నిర్ణీతమైయున్నది.

## పంచాచారములు

చంద్రజ్ఞానోత్తర శివాగమమునఁ బంచాచార నిర్ణయమిా క్రిందివిధముగఁగలదు. 'లింగాచారస్సదాచార శ్శివాచారస్తథైవచ గణభృత్యాచారకాచ పంచాచారాః ప్రకీర్తితాః' లింగాచారము - సదాచారము - శివాచారము - గణాచారము - భృత్యాచారమను నవి పంచాచారములగుచున్నవి.

అందు లింగాచారము వేధామను క్రియారూపములగు నిరువదియొక్క దీక్షలగ్రహించి తద్ధర్మముల నాచరింపుటయగుచున్నది.

రెండవదియగు సదాచారమున షడధ్వశుద్ధిగల శైవదీక్షతోఁ గూడిన స్వశరీరము నప్రాకృతమైనదని భావించుటయు - దీక్షితులగు కుటుంబమున వసించుటయు - శైవచిహ్నలధరించుటయు - నందప్రమత్తతయు - శివధర్మమహిమల వినుటయు - నిష్టలింగారాధనము లేక భుజింపకుండుటయు - ననివేదిత పదార్థమును గ్రహింపకుండుటయు - శివార్పిత ద్రవ్యమును బరిత్యజించకయుండుటయు - గురుచరేశ్వరుల నొకటిగఁ జూచుటయు - సదాప్రసిద్ధధర్మములైయున్నవి.

మూడవదియగు శివాచారమున 'పండ్లు గడ్డలు మొదలగు నవి భస్మముచే శోధించి గ్రహించుటయు - నందిముద్రాంకితము లగు శిలాదారువుల హద్దులుగలిగియున్న క్షేత్రముల గ్రహించు

టయు - భక్తనిర్మితములౌ శివలీలాచిత్రిత గృహముల నివసించుటయు - నట్టి పాత్రలనే ఉపయోగించుకొనుటయు - భస్మముచల్లి తృణాదుల గ్రహించుటయు నట్టివే కాష్ఠముల నుపయోగించుకొనుటయు భక్తక్షేత్రమందలి తమలపాకులు పోకలు భక్తులచేఁ గాల్పఁబడిన సున్నమును గ్రహించుటయు - శివదీక్షగలవారలు పచనము చేసిన పదార్థమునే లింగార్పితముచేసి భుజించుటయు - గోఘృత, గోక్షీర, గోదధ్యాదుల గ్రహించుటయు - సర్వభూతదయాళుత్వము గల్గియుండుటయు - కామ్యకర్మములను వదిలిపెట్టుటయు తద్వారా మోక్షమునందుటయు - శరీరగతములగు భూతపంచకమును భూతశుద్ధిచే సంస్కరించుటయు - చిత్తము శివునందే లయముచేయుటయు చీమైన చావకుండునటుల జాగ్రత్తగ సంచరించుచుండుట - శాస్త్రవిహితకాలముల లింగారాధనచేయుటయు - అసత్య కఠిన నిందార్థకములయిన వాక్యముల వీడుటయు - నెల్లపుడు భక్తజనులతో గోష్ఠిగల్గియుండుటయు నాచారమైయున్నది.

ఇఁక భక్తగణాచరణీయములగు నీక్రింద నుదహరించిన నరువదినాలుగు శీలముల నమరి గణాచారమొప్పుచున్నది. సత్యము వచింపుటయు - నప్రియము బల్కకుండుటయు - వే[illegible]మేతి హాస పురాణములఁ బఠించుటయు - శివుని శివభక్తుని గురునిఁ బ్రశంసించుటయుఁ బూజాద్రవ్య స్వీకరణంబు - నితర దేవతాదుల వర్ణింపకుండుటయు . నాత్మస్తుతిఁ జేయకుండుటయుఁ - బరనింద నొనర్పకుండుటయు - గురుచరేశ్వరులకు నమస్కరించుటయు - రుద్రాక్షమాలచే షడక్షరీ మంత్రమును జపించుటయు - గురుపూజనమును మాహేశ్వరాదుల నెదుర్కొని సేవింపుటయుఁ - బ్రదక్షిణము నొనర్చుటయుఁ దత్సేవార్థము చరించుటయు - నిష్టలింగపూజకై నియమితమగుటయు - నవినాభావముగ నిష్టలింగము నెల్లపుడు స్పృశించియుండుటయుఁ దత్స్పర్శనమున రోమాంచములు గలిగినయాతఁ

డగుటయు - ననురాగముతో నిష్టలింగమును నిరీక్షింపుచుండుటయు-నట్టి నిరీక్షణానందమున నానందబాష్పములుగలవాఁడగుటయు నివేదిత ప్రసాదరుచి నాస్వాదించుటయుఁ - బూజాపుష్పాదికముల నాఘ్రాణించుటయు - శివగురు ప్రముఖస్తోత్రములఁ జేయుటయుఁ - దన్నిందల వినకుండుటయుఁ - దత్ప్రసాదగ్రహణంబున శరీరశుద్ధినందుటయుఁ నింద్రియ నిగ్రహము - నస్పృశ్య పదార్థములఁ దాకకుండుటయు - భవిసంబంధము లేకుండుటయు - నిషిద్ధభోగములందనాశక్తియు - భక్తియందాశక్తియు - నధర్మమునెడఁ గోపంబును - శివారాధనమునెడ లోభమువహింపుటయు-భక్తులయెడ మోహము - నింద్రియములయెడ మాత్సర్యము - నహంకారము మాయను జయించు పట్టునను - గుర్వాదిగుణదోషముల వివరింపకుండుటయు - భూతదయయును - సుకర్మములయందు భయముగల్గి చరించుటయుఁ-బుత్రశత్రువులందు సమానదర్శనంబును - వేదాగమ విశ్వాసంబు నపకారుల సహితము క్షమింపుటయు - భోగములందుఁ గోరిక లేకుండుటయు - ధర్మాచరణంబున నప్రమత్తతయు - శివాతిరిక్తమెద్దియు లేదని తలఁచుటయుఁ - బరధనాపహరణత్యాగము - నలభ్యవస్తువుల నభిలషింపకుండుటయుఁ - బరమేశ్వర నామస్మరణ గుణకీర్తనంబు - నాతని సేవింపుటయు - నాతని పాదకమలముల భావించుటయు - సఖునిగఁ దనను భావించుటయుఁ - దనను ముక్తుగా నొనర్పుమని యాత్మార్పణమొనర్చుటయు - మూలమంత్రమును జపించుటయు - హృదయంబున శివుని రూపానుసంధానముచే ధ్యానించుటయు - నాతనియందే చిత్తము నిలుపుటయుఁ - దానొనర్చునది పరమేశ్వరేంద్రియములద్వారా జరుగుచున్నటుల భావించుటయు - శివరూపము సర్వవ్యాపకమైనదని తలచుటయుఁ - బరమేశ్వరరూపము తననుగానే తలంచి జగము మరచి శివానందమొందుటయు నగు

చున్నవి. ఈ యఱువదినాలుగు శీలముల నవలంబించి యాచరించి భక్తుఁడు జీవన్ముక్తుఁడగుచున్నాఁడు.

ఇఁక భృత్యాచారము భృత్యత్వ వీరభృత్యత్వములను రెండు విధములై గురుచరేశ్వర పూజారూపకమయినది భృత్యాచారమనియుఁ, దన సర్వస్వము గురుచరులకర్పించి శివునిగూర్చి కైవల్యమును గోరుచుండుటయే వీరభృత్యాచారము నగుచున్నది.

కావున శాంభవప్రీతి పవిత్రమగు నిట్టిధర్మముల శ్రద్ధాళువై యనుష్ఠించి కృతకృత్యుఁడగుట మానవజన్మమెత్తినందులకు సార్థకమగుచున్నది.

## —: దశావధానవిశేషము :—

దశావధానంబుల నుత్తీర్ణుఁడగుటయే శివయోగియనుటకుఁ దార్కాణము. యమనియమాద్యష్టాంగ సంపన్నుఁడే యవధాననానుష్ఠానమునకు సమర్థుఁడగుచున్నాఁడు. దేహత్రయంబుల లింగనిమగ్నత నొందించుటయే నిందు ప్రథమాదర్శము ఇందు ఈశ్వరత్వవశిత్వములనుస్థితి సంభవించుచున్నది. లింగమున దృష్టిని ఏకీభావమునందించుట దృగ్వధానమునందలి దృక్పటుత్వము దృష్టిభేదము నందును. వికారశూన్యంబగు నిరీక్షణముకలిగియుంటయే దృగ్విన్యాసము దృక్కును జలక్షీరన్యాయమున లింగములీనముచేయుటయే దృగ్విలీనత్వము నిర్లిప్తస్థితియందు తప్పనితరము గనకమాంద్యబిందు క్రూరతాశూన్యమగు దృష్టియే దృక్స్థిరత్వము.

విషయోపభోగసమర్పణము దృక్కుచేయొనర్చుటమె దృక్పూజ విషయోపభోగములిందు స్నానాద్యష్టవిధరూపములగును. త్వగింద్రియముద్వారా లింగముతో కలిగిన స్పర్శవ్యాపారమే త్వగ్వ్యాప్తి నిగ్రహానుగ్రముల విషయమై పరమేశ్వర ప్రార్థనమున కర్మేంద్రియములస్తుతిరూపమగునది స్తుతి. ఇంద్రియాద్యులు లింగమునందు

కర్పూరమువలె మనస్సుచే లీనత్వమందించుటయె మనోవ్యాప్తి పూర్వోక్తావధానాచరణంబుననణిమా మహిమా గరిమాదులు లభ్యంబులగును.

ఇంద్రియాధిష్టానమగు మనంబును పాంచభౌతికార్పణయందు స్థిరత్వమునందించుట సానురాగమనోర్చనమగును. సర్వమును లింగమయముగానెంచుచు నితరముగానక ప్రపంచకగణమునందు లింగముకంటె వేరుభావము తోచకుండనుండుటయె గణప్రణామము. అట్లు చూచిస్తుతించుట అనగా అర్థముచేసికొనుట భావించుటయు సప్రమాణముగ స్మృతియందుంచుకొనుటయె గణస్తుతి - శివానందముచే సమరసానుభవమునందుటయే గణలీలానంద నిమగ్నత అనగా చిత్తమును లీనమొనర్చి తత్వమును ప్రసాదింపజేయుట లింగమునకు తనకు అవినాభావసంబంధముకలిగియుంట లింగనిమగ్నత - దీనినే సిద్ధియని చెప్పెదరు. అప్పుడే శివాదన్యం నకించన - శివఏవ కేవలః ఇత్యాదిశృతిసంచ యప్రసిద్ధరచనలు సమన్వయములగును లఘిమా-ప్రాప్తి-ప్రాకామ్యము ఈశ్వరత్వవసిత్వములను సిద్ధుల మనోవధాన పంచకమున క్రమంబుగ సాధకుఁడు పొందుచున్నాడు.



శ్రీ మేధాదక్షిణామూర్తి గురవేనమః.

# శైవసర్వస్వము, ప్రమాణపరిచ్ఛేదము



## శాంభవీయ ధర్మసూత్రావళి.



### —: వర్ణాశ్రమ ధర్మావశ్యకత :—

వర్ణాశ్రమాచారధర్మములు శివాజ్ఞారూపకములు, 'నయావల్లయమాప్నోతి చిత్తం శంభౌ పరాత్మని। నతావత్కర్మ సత్యక్తుం యుజ్యతే' మనస్సు ధ్యానాభ్యాసవశమునఁ బరమేశ్వరునందు లయించు వఱకును కర్మములవీడుట యుచితముకాదనియు 'తస్మాద్ద్విజశ్రేష్ఠైర్ధర్మః స్వస్వవర్ణాశ్రమోదితః। సాదరం సమనుష్ఠేయ స్త్వన్యథా పతితో భవేత్' బుద్ధిమంతుఁడు దనవర్ణమునకు నాశ్రమునకును విహితమగు ధర్మము నతిశ్రద్ధతో నాచరింపవలయును. అట్లుగానిచో నాతఁడు పతితుఁడగును. 'త్యక్తవర్ణాశ్రమాచార స్త్వసిద్ధజ్ఞానవైభవః పతత్యేవ నసందేహశ్ఛిన్నస్వాధారశాఖవత్' జ్ఞాననిష్ఠ కుదరకనే వర్ణాశ్రమాచారముల వదిలిపెట్టినవాఁడధోలోకమునే జేరుచున్నాఁడు. చెట్టునెక్కినవాఁడు పట్టుకొమ్మ చిక్కకముందే కాలిక్రింద కొమ్మ విరుగునెడల క్రిందఁబడు చందముగనని చంద్రజ్ఞానాగమమునఁ గలదు.

ఎద్దియో మహాపుణ్యమునఁగాని మానవజన్మ గలుగదు. అందును బ్రాహ్మణుఁడగుట కెంతపుణ్యముకావలెనో చెప్పజాలము. అట్టి యుత్తమజన్మమంది యెవ్వఁడు పరశివునర్చింపఁడో యాతని

యాజ్ఞారూపములగు వర్ణాశ్రమాచారధర్మముల నుల్లంఘించునో యాతఁడు శివద్రోహియు నరకభాగియు నగుటలో సందియమేమి?

అన్నికర్మములకు నాచారము మూలమగుచున్నది. శిష్టాభిహితమయిన దయాదాక్షిణ్య శౌచాదులఁగూడిన నడవడియే యాచారమని మన్వాదులు స్మరించియుండిరి. ధర్మము మనచే రక్షింపఁబడి మనల రక్షించునుగాని యధర్మమో మనచే రక్షింపఁబడి మనలనే శిక్షించును. ఇందువలననే 'స్వధర్మేనిధనం శ్రేయః' తన ధర్మమందు నిధనము సంభవించినను సంభవించుగాక భయావహము లయిన పరధర్మానుష్ఠానములుకూడవు సుమాయని యార్యులు వచించిరి. ఆపస్తంబుఁడు ధర్మాచరణమువలన మానవుల కాయు రారోగ్యైశ్వర్య మేధాప్రజ్ఞాదులు సులభసాధ్యములగునని వచించెను. పవిత్రములగు నార్షధర్మములగు కర్మములు కేవలాముష్మిక ధర్మములుమాత్రమేగాక యైహిక ప్రత్యక్ష ఫలములగు శారీరక చిత్తశోధనములుగూడ నైయున్నవి

ఆచారహీనుఁడగు పురుషుఁడు లోకమున నిందితుఁడగుచున్నాఁడు. సర్వమునకు ధర్మమే మూలమగుట నిస్పృహుఁడయిన యోగియు ధర్మము నాశ్రయింపవలెననియు నెట్టిసమయమందు నయ్యది విడువరానిదనియు 'శ్రుతిస్మృత్యుదితం ధర్మం నిత్యం నైమిత్తికాశ్రయం కృత్వార్చయతి యశ్శంభుం సభక్తస్సాత్వికస్మృతః యస్సాత్వికో లింగధారీ విధివన్నిత్యకర్మకృత్ నీలకంఠస్య దేవస్య ప్రియోభక్తస్సఈరితః తస్మాత్కాలోచితాం నిత్యక్రియాం నైమిత్తికాశ్రయాం కుర్వీత వేదస్మృత్యుక్తాం ద్విజోమాహేశ్వరస్సదా' శ్రుతిస్మృత్యుక్తములై నిత్యనైమిత్తికాశ్రయములగు ధర్మముల నాచరించుచుఁ బరమేశ్వరు నర్చించునతఁడు సాత్వికభక్తుండగును. అట్టి సాత్వికభక్తిగల భక్తుఁడు పరమేశ్వరున కత్యంతప్రియుఁడగుచున్నాఁడు. ద్విజుఁడగు మాహేశ్వరుఁడు వేదశృత్యాగమోక్త

ములగు నిత్యనైమిత్తికాది ధర్మములనాచరింపవలయునని వర్ణాశ్రమాచారవ్యవస్థను గూర్చి శంకరసంహితయందు బహుధా నిర్ణయింపఁబడియున్నది. మహాభారత శాంతిపర్వమున 'యథాయథాహి సద్వృత్తమాచరంతీతరే జనాః తథాతథాసుఖం ప్రాప్య ప్రేత్యచేహచ మోదతే' జనులు సదాచారము నాచరించినకొలఁదియు నిహపరంబులగు సుఖంబులనందుదురని చెప్పఁబడినది. 'నిత్యం నైమిత్తికంవాపి క్రియతే గృహమేధినా శివారాధన బుద్ధ్యాయత్కర్మ తద్జ్ఞానసాధనం' ఏకర్మ శివారాధనబుద్ధితోఁ జేయఁబడుచున్నదో యది నిత్యముగా నైమిత్తికముగాని జ్ఞానసాధనమగుచున్నది.

—: ఆచమనవిధి :—

వైదికాచార నిర్ణయమున 'శైవానాం శివనామాని యతీనాం ప్రణవస్తథా। వైష్ణవానాంచ సర్వేషాం విష్ణునామాని గ్రాహయేత్' ఆచమన విధానమున శైవులు శివనామములను యతులు ప్రణవమును వైష్ణవులు విష్ణునామములను గ్రహింపవలయుననియు 'పంచాక్షరేణ మంత్రేణ పిబేత్త్రిర్మార్జయేత్సకృత్ ఈశానాద్యైః పంచభిస్తుతత్త్వస్థానాన్యనుస్పృశేత్ తత్తదంగుళిభిశ్చాధ సజలస్పర్శనం చరేత్ త్రిభిర్మంత్రైరాచమేత స్వాహాంతైః ప్రణవాదికైః ఓం హ్రీం ఆత్మతత్త్వాయస్వాహా ఓం హ్రీం విద్యాతత్త్వాయస్వాహా ఓం హ్రీం శివతత్త్వాయ స్వాహేతి' మకుటోత్తర శివాగమమున నీయర్థమే 'ఆత్మవిద్యాశివాఖ్యాని తత్త్వాని స్వాహయాసహ ఆచామేదుచ్చరన్నేవం త్రివారం శాంభవప్రతీ' శాంభవవ్రతియగునతఁడు స్వాహాంతములగు నాత్మవిద్యా శివతత్త్వముల నుచ్చరింపుచు నాచమింపవలయునని చెప్పఁబడినది.

'శంభవేస్వాహా శంకరాయస్వాహా శాంతాయస్వాహా శాశ్వత శివ - స్థాణు - ఉమాపతే - భూతేశ - త్రిపురాంతక - త్రిణయన -

శ్రీకంఠ - కాలాంతక - శర్వ - ఉగ్ర - భవ - భర్గ - భీమ - జగ న్నాథ - అక్షయ - శ్రీపతే - రుద్ర - ఈశాన - ఈశ్వర - మహాదేవ - ఈశతుభ్యంనమః అనియును శైవశిష్టులాచమన విధానమున శివనామము లుచ్చరించుటయు నాచారముగఁగలదు.

దినం వారంచనక్షత్రం యోగం కరణమేవచ సర్వశివమయం స్మృత్వానైదికః కర్మకారయేత్.

—: వామదేవసంహితాయాం :—

నమశ్శంభవ ఇత్యాదిమంత్రస్థా మనవశ్చషట్ భవోద్భవాయ నమఇతి మనుః ప్రథమతః స్మృతః వామదేవాదిమంత్రస్థా ఏతే ఏకాదశస్మృతాః। నమస్తే అస్తుభగవన్విశ్వేశ్వర ఇతిస్మృతః నీలకంఠశ్చ సర్వేశ్వర సదాశివ ఏషచ శ్రీమహాదేవ ఇత్యేతేనమోంతానమసాస్మృతాః। అష్టావింశతి నామానికీర్తితాని మహాంతిచ ఏతై రాచమనాదీని కార్యాణ్యాహుర్మనీషిణః। శంభ్వాదిభిస్త్రిభిర్మంత్రైః పీత్వా శేషైశ్చ సంస్పృశేత్। ఓష్ఠద్వయంచ చుబుకమంగుళ్యగ్రైరనంతరం। భవోద్భవాదిభిర్మంత్రైః ద్వాదశాంగాని సంస్పృశేత్। అంగుష్ఠతర్జనీభ్యాం తునాసారం ద్వైఃస్పృశేత్క్రమాత్ అంగుష్ఠేన కనిష్ఠేననాభింకుక్షితలేనతు అంగుళ్యగ్రైశ్శిరో బాహ్వోర్మూలే వక్షస్థలం స్పృశేత్ నమస్తేస్తాదిభిర్మంత్రైః దశాంగానిచ సంస్పృశేత్ వామహస్తతలేనైవ దక్షిణంచ తలంస్పృశేత్! తథాదక్షిణహస్తేన వామహస్తతలం స్పృశేత్। పాదద్వందం పార్శ్వయుగ్మం ఉరోగండస్థలేహ్యుభే మూర్ధాంగం మునిశార్దూలతతో[illegible]వనచావ్యథా। ఏవమాచమ్య విధివత్కర్మానుష్ఠానమాచరేత్।

—: ఆహ్నిక విధానము :—

శాంభవవ్రతుఁడు బ్రాహ్మముహూర్తమున నిదురనుండి కెల్లాంచువాఁడై శివనామస్మరణమొనర్చుచు నిష్టలింగమును గనుల

కద్దుకొని ధర్మార్థచింతనమొనర్చుచు గుర్వాదుల దర్శించి నమస్కరింప వలయును. అనంతరము యజ్ఞోపవీత శివసూత్రములను మెడకు వెనుకవైపు నుంచుకొని శిరమునకు వస్త్రమును జుట్టుకొని బాహ్య దేశమున మలకర్మాదుల నిర్వర్తించుకొని పాదములను హస్తములను బ్రక్షాళనము చేసుకొని పుక్కిలించివైచి యాత్మవిద్యా శివతత్త్వముల స్వాహాంతముగ నుచ్చరింపుచు నాచమింపవలయును. పిమ్మట దంత ధావనమొనర్చుకొని యాచమనమొనర్చి శివతీర్థమునఁ బ్రాతఃస్నాన ముచేసి దేవర్షి యక్ష్మతర్పణముల నొనర్చి సూర్యునకుఁ జూపబడిన ధౌతవస్త్రముల ధరింపువాఁడై యిష్టలింగమునకు మజ్జనమిడి సంకల్ప పూర్వకముగ యాచమనమొనర్చి భస్మస్నాన భస్మోద్ధూళన భస్మావ కుంఠనముల నొనర్చుకొని యథోక్తస్థానములఁ ద్రిపుండ్రములఁ ధరింప వలయును. పునస్సంకల్ప పూర్వకముగా రుద్రాక్షముల ధరించి సూర్యుని కర్ఘ్యత్రయంబుల నొసంగువాఁడై సావిత్రిని జపించి శివా గ్నిని ధ్యానించి సాయంప్రాతఃకాలముల హోమమొనర్పవలయును. అగ్ని కార్యము నిర్వర్తింపగనే పెద్దల కభివాదమొనర్చి గుర్వాదుల శరణాగతి యొనర్పవలయును. ఇట్లు పవలెనిమిది భాగముల యందలి మొదటి భాగము గడపి రెండవభాగమున నిగమాగమముల నభ్యసిం పుచు మూడవభాగమునఁ బోష్యవర్గముయొక్కయు తనయొక్కయు రక్షణాదులకై ధనాదుల సంపాదించుకొనుచు నాల్గవభాగంబున నద్యాదుల జలమును సంస్కారమునుజేసిన తీర్థమును గావించి మాధ్యాహ్నికస్నానమొనర్పవలయును. అంత భస్మస్నానాదుల నొనర్చి రుద్రాక్షల ధరించి శైవపంచాక్షరీ సంధ్యను సావిత్రీ సం ధ్యనుపాసించి పంచమహాయజ్ఞముల నాచరించి దేవఋషి[illegible]లకుఁ దర్పణమొనర్చి పితరులకుఁ బితృతీర్థమునఁ దర్పణమొసంగి వైశ్వదేవ మొనర్చుకొని శివపూజనొనర్చువాఁడై పండితుండుగాని మూర్ఖుండు గాని పూజాంతమునవచ్చిన యతిథిని శివునిగనే భావించి పూజించి

ప్రసాదభోగానంతరము స్తోత్రాదులం బఠింపవలయును. తరువాత సాయంకాలమువఱకు సద్గోష్ఠి యత్నింపుచు భస్మస్నాతుండై సాయంసంధ్యనుపాసించి హోమకార్యమొనర్చుకొని సాయంకాలిక మగు నవసరార్చనమొనర్చుకొని వైశ్వదేవమొనర్చువాఁడై యర్ధరాత్రి పూజను గావించి యతిథి నర్చించి భోజనానంతరము శయనస్థుఁడై శివుని ధ్యానింపుచుఁ జింతాహీనుఁడై సుఖముగ నిద్రింపవలయును. నిత్యానుసరణీయమును శివప్రసాదహేతువునగు నాహ్నిక విధానమిట్లు మకుటోత్తరదివ్యాగమమునఁ బరశివునిచే భక్తుల ననుగ్రహించు నిమిత్తము ప్రకటింపఁబడినది.

## —: భక్తి :—

సూతసంహితయందు నీశ్వరునియందలి భక్తి యిట్లు వర్ణింపఁ బడియున్నది. శివజ్ఞాన శ్రద్ధయు, భస్మోద్ధూళన త్రిపుండ్రధారణ భస్మస్నాన శ్రద్ధయు, రుద్రాక్షధారణశ్రద్ధయు, షడక్షరజపశ్రద్ధయు, శివలింగార్చనశ్రద్ధయు, పూజోపకరణసంపాదన శ్రద్ధయు, మహాదేవ పదాదిస్మరణశ్రద్ధయు, శివవిద్యాభ్యాసశ్రద్ధయు, తదధ్యయనశ్రద్ధయు, గురూత్కార్థవిశ్వాస శ్రద్ధయు శివభక్తియని చెప్పఁబడుచున్నది.

కారణోత్తరమున లింగజంగమ గుర్వర్చాసాధనమగు కుటుంబము మోక్షసాధనమైనదగునని గలదు. 'అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివా యస్స్మరేత్పార్వతీనాథం సబాహ్యాభ్యంతరశ్శుచిః' అపవిత్రుఁడయినను బవిత్రుఁడయిన నెట్టి యవస్థయందున్నవాఁడును శివస్మరణముచే బాహ్యాభ్యంతరములయందును బవిత్రుఁడగును. శైవసిద్ధాంతశిఖామణియందు 'శ్రవణం కీర్తనం శంభోః స్మరణం పాదసేవనం అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం ఏవం నవవిధాభక్తిః భోక్తా' శ్రవణకీర్తన స్మరణపాదసేవన యర్చనవందన దాస్య సఖ్య యాత్మనివేదనలని శివునియందలి భక్తి తొమ్మిది విధములనై యున్నదని గలదు.

శివపురాణవాయువీయసంహితయందు బాహ్యంబగు నుపచారాదిసేవయు, మానసికంబగుసేవయు భక్తియని పండితులు నిర్దేశించియున్నారు. ఆభక్తి మరల వాక్కు మనస్సు కాయమునను సాధనత్రియభేదంబులచే మూడువిధంబులై యుండును. శివరూపాది చింతనము మానసికభక్తి, శివమంత్ర జపాదికము వాచకభక్తి, పూజాదికము కాయికభక్తి. ఈమూడువిధంబులగు భక్తియే శివధర్మమనియు, పరాత్ముండగు శివుండు శివధర్మమును తపము, కర్మము, జపము, ధ్యానము, జ్ఞానమునని యైదు విధంబులుగ నిరూపించియుండెను. అందు చాంద్రాయణాదులు తపంబులు. లింగార్చనాదులు కర్మములు. మూఁడు విధంబులగు శివాభ్యాసమే జపము. శివచింతనమే ధ్యానము. శివాగమోక్తజ్ఞానమే జ్ఞానమనియు వివరింపఁబడెను.

## — సోమవార వ్రతము :—

'సోమవారే శుచిర్భూత్వా కుర్యాన్నక్తంచయోనరః వర్షకోటి సహస్రాణి రుద్రలోకే మహీయతే' శుచియగు నెవ్వఁడు సోమవారమున నక్తమొనర్చి శివారాధనమొనర్చునో యతఁడు శివలోకమున నివసింపునని యు నాడొక భిక్షామాత్రదానముచేతనే శివానుగ్రహమునకుఁ బాత్రుఁడగుచున్నాఁడనియు నేకభుక్తుఁడై ద్వాదశవర్షకృత పాపములనుండి ముక్తుఁడగుననియుఁ గార్తీకసోమవాసరమున ద్విజులగు మాహేశ్వరుల నరవిందాదికుసుమంబులఁ బూజించియు యథాశక్తి దీపదానమొఁనర్చియు గురునర్చించియు నక్తవ్రతియగు నతఁడు సాక్షాచ్ఛంకరుఁడనియు స్కాంద మార్కండేయాది పురాణములయందుఁ జెప్పంబడినది. సోమవారవ్రతము దేవులయందు మహాదేవునివలె వ్రతములయందత్యుత్తమమగు వ్రతముగఁ బరిగణింపఁబడినది. ఈ మహావ్రతము యుపవాసము, యేకభుక్తము, నక్తము, యర్ధరాత్రి

భోజనమని నాల్గు విధములు. సోమవారమంతయు నిరాహారియై పరమేశుఁ బూజించి మఱునాఁడు భుజించుట యుపవాసమనియు, యేకభుక్తవ్రతము మాధ్యాహ్నమే శివపూజ నొనర్చి భుజించి రాత్రియందు నిరాహారియై శివారాధన మొనర్చుట యగుననియు నక్తవ్రతము నక్షత్రోదయమువఱకుగాని ఛాయానక్తముదనుక గాని నుపవసించి పరమేశు నర్చించి భుజించుటయే యగుననియు, (ఛాయానక్తమనగా షుమారు మూఁడు గడియలప్రొద్దుండగా పగలు) అర్ధరాత్రివ్రతము రాత్రి పదునొకండు గడియలలోపల శివారాధన మొనర్చి భుజించుటయు నగును. పరమోత్కృష్టమగు నీవ్రతము నారుసంవత్సరములుగాని, పండ్రెండు సంవత్సరములుగాని, యశక్తుఁడు. మూఁడు సంవత్సరములుగాని యనుష్ఠించినచో వ్రతోద్యాపన మొనర్పవలయును. దేహాంతముదనుక నిత్యసోమవారవ్రత మనుష్ఠింపువారల కుద్యాపన మొనర్పనవసరము లేదు. పరమేశ్వరునకత్యంత ప్రియమగు నీసోమవారవ్రతము మహాపాపసంచయమునుండి భక్తులఁ దరింపజేసి యైహికంబున నాయురారోగ్యైశ్వర్యాది భోగంబుల నొనగూర్చి దేహాంతమున శివసాయుజ్యప్రాప్తికిఁ గారణంబగునని శివరహస్యంబునఁ జెప్పంబడినది.

ఆదిత్యపురాణమున 'ప్రాణలింగ ప్రసాదిస్యా న్నోపవాసం సమాచరేత్। మోహాద్యస్తుచరేత్తస్య ప్రత్యవాయో మహాన్భవేత్' లింగధారి యుపవాస మెన్నఁడును జేయఁగూడదు. మోహమువలన నాచరించుచో గొప్పప్రత్యవాయము గల్గును. ఈయర్థమే చంద్రిజ్ఞానమున 'నహి శుష్కోపవాసోస్తి శివాశ్రమనిషేవిణాం ఉపవాసప్రతినిధిం నక్తభోజనమాచరేత్' శైవదీక్షితునకు శుష్కోపవాసము గూడదు, అట్టి సమయమందు దానికిబదులుగ నక్తభోజనమే చేయవలయును.

సర్వవిఘ్నాది పరిహారజనసిద్ధికై గణేశ్వరస్కంద వీరభద్ర కేదారేశ్వర ఉమామహేశ్వర దుర్గాదివ్రతముల ననుష్ఠించుటయుఁ బరమేశ్వరప్రీతికిఁ బాత్రమేయగుచున్నది. యజమాని యాజ్ఞనంది యాతని పరివారమునకు సేవనొనర్చియు నాతనికి ప్రియుఁడగు సేవకుఁడు పాత్రుఁడేయగునటుల భక్తుఁడును శివపరివారమును సేవించి శివునకుఁ బ్రియుఁడేయగునని నిర్ణయింపఁబడెను.

## —: పూజార్హపత్రపుష్పములు :—

ద్రోణపున్నాగ మందార నంద్యావర్త శ్రీయావర్తములును గన్నేరు తెల్లజిల్లేడు తామరపువ్వు కలువపువ్వు లొద్దుగ నల్లయుమ్మెత్త పాటలపుష్పము సంపెగపువ్వు మారేడుకానుకపువ్వులు కొండగోగు పువ్వు మాదీఫలపుష్పము అవిశపువ్వు ప్రియంగుపుష్పము దేవదారు కృతమాలల పుష్పములు అగ్నిమంథము జాజిపూలు మల్లెపూలు పాటిలి వికర్ణి బహుపర్ణి ఆజిత కల్హార అతసీకుసుమాదులు శివార్చన యందుత్తమములును ముఖ్యములునై యున్నవి. బిల్వము తులసి రేలగిక ఉత్తరేణుసంపెగ నేరేడు దవనము తుమ్మి మరువము హ్రీబేరము వావిలియనునాని పత్రములు పూజార్హములగును. కేతకీ చంపకములు శివపూజార్హములుగావు. 'పత్రాణామపి పుష్పాణాం సౌవర్ణానామిహాక్వచిత్ నహినిర్మాల్యతాదోషః తస్మాత్తైర్నిత్య మర్చయేత్' సౌవర్ణములగు పత్రపుష్పాదులకు నిర్మాల్యదోషము లేదు. ఈ కారణమువలన నవి నిత్యము పూజార్హములగుచున్నవి. ఈయర్థమే నిర్ణయసింధువునందునుగలదు. కరానీత వస్త్రానీతములును నాఘ్రాణించినవియు రాలిపోయినవియు కింజల్కములు లేనివియు పురువులు గలవియు ఛిద్రములు నయినవియునగు పత్రపుష్పాదులు శివపూజ కనర్హములగుచున్నవి. పుష్పములెట్లు పుట్టినవో యట్లును బిల్వమును బోర్లగిలయు లింగశిరమున నుంచవలయును. శివతత్త్వ

సుధానిధియందు 'బిల్వపత్రార్చనంకృత్వా నపునర్జన్మభాగ్భవేత్' ఈశ్వరుని బిల్వపత్రములఁ బూజించిన భక్తుఁడు తిరిగి పుట్టుటలేదు. బిల్వపూజనమునను బిల్వగంధలేపనమునను శివుఁడత్యంతప్రీయమందును. 'బిల్వమూలమృదాయస్తుశరీర ముపలుంపతి అంత్యకాలేంత కజనైస్సదూరీక్రియతేనరః' బిల్వమూలమందలి మృత్తికను దేహమున నలదుకొని మరణించిన యాతనికి నంతకభటులు దూరులైయుందురనియు లక్షబిల్వార్చనచేగల్గు ఫలమును లెక్కించుటకు లెక్కయేలేదనియును బరమేశ్వరున కత్యంతప్రియములగు పూజాద్రవ్యములలో నీబిల్వపత్రమే మొదటిదనియు బిల్వమును స్మరించినంత మాత్రమున నరుడు రాజ్యాదిభోగముల నందుననియుఁగలదు.

## —: శివశాస్త్రప్రశంస :—

వేదాగమములయందును తదర్థప్రతిపాదకములగు స్మృతి పురాణములయందును నమ్మకముగలిగియుండుటయే యాస్తిక్యమనఁబడుచున్నది. సకలశ్రేయంబులకుఁ బరమసాధనంబగు శివాగమములను భక్తవత్సలుఁడగు శ్రీకంఠుఁడు భక్తకల్యాణముకొఱకుఁ బార్వతికి బోధించెనని శివపురాణమునఁగలదు. మఱియుఁ బరాపరనామకములై సద్యోజాతాది పంచముఖోద్భవములయిన యాగమములు వేదతుల్యములనియు నందేగలదు. 'కామికాద్యాగమానాంతు యథాదేవో మహేశ్వరః' కామికాద్యాగమములకు మహేశ్వరుఁడే కర్తయని సూతసంహితయందుఁగలదు. పూజ్యులగు శ్రీకంఠ - హరదత్త - అప్పయదీక్షితులు మున్నగువారు వేదశివాగమములకు భేదములేదనియు - వేదాగమములు రెండు నేకార్థకములుగాన రెంటికిఁ బరస్పరాను సారిత్వముగలదనియు నశ్రౌత పాశుపతాగమములకును గేవల మప్రామాణ్యములేదనియు స్వీయకృతులయందు సిద్ధాంతీకరించియుండిరి. శివాగమములలోఁ గొన్నిభాగములు పశు

పాశ పతిరూప పదార్థత్రితయమును బ్రతిపాదించునవియు - కొన్ని భాగములు శివపరత్వమును బ్రతిపాదించునవియు - మఱికొన్ని భాగములు పరబ్రహ్మ త్రిమూర్తులను బ్రతిపాదించునవియు - మరికొన్ని షట్త్రింశత్తత్త్వములను జెప్పునవియు నిట్లే షడధ్వలను భస్మరుద్రాక్ష ధారణము లింగధారణము ప్రణవపంచాక్షరము శివపూజోత్సవాదులను బోధించునవియు నగుచున్నవి. ఇవియన్నియుఁ బ్రత్యక్ష వేద మూలములేగాన వీనికిఁ బ్రామాణ్యము నిరాక్షేపణముగా సిద్ధించుచున్నది. ఇందు పశుపాశపతిరూప పదార్థత్రయము వేదముల యందుఁ బ్రసిద్ధముగానున్నది. గాన నీపరిభాషామూలమగు శైవ శాస్త్రము వైదికమేయగును. ఎవఁడు పరశివానుగ్రహరూపములను - సద్యోజాతాది ముఖోద్భవములును - యోగజ్ఞాన క్రియా చర్యా నామక చతుష్పాదయుతమును శ్రౌతమునయిన యాగమముల నధిక్షేపించి నిరసించుచున్నాఁడో విద్యాపతియు కల్యాణనిలయుఁడు నయిన పరశివునిఁగూర్చియు నాతని యుత్తమగ్రంథములఁగూర్చియు దామసాదులను వాక్యముల నుచ్చరించుచున్నాఁడో యాతనికంటె రాక్షసశబ్దవాచ్యుఁడు వేరొకఁడులేడు. అతఁడు సర్వకర్మ బహిష్కృతుఁడై శివాపరాధియై దేహాంతమున మహారౌరవాదుల నందఁగలఁడని శివధర్మమునఁ బ్రకటీకృతమయినది.

—: రంగవల్ల్యాదినిర్ణయము :—

'పద్మంత్వవసరాఖ్యాయాం నవపద్మం లఘౌస్మృతం గుర్వ్యాం మహత్యామపిచ భద్రం తత్స్యం హిమండలం' అవసరపూజయం దొక్క పద్మంబును - లఘుపూజయందుఁ దొమ్మిది పద్మంబులుగల మండలంబును గురుమహాపూజలందు భద్ర[illegible]మండలములనేదియో నొకటిగాని శివపూజానమయంబున నుపయోగించుకొనవలయునని చంద్రజ్ఞానమునఁగలదు. గ్రంథాంతరమున 'అరుణోదయ కాలేతు

చతుర్దళవిరాజితం అంబుజం రచయేత్పశ్చాత్ షడ్దలంతుప్రచక్ష్యతే తపనోదయకాలేథ దశకం దళమంబుజం సంగవేతు ప్రకర్తవ్యం మధ్యాహ్నేద్వ్యధికందళ దినాంతే షోడశదళం కమలం పరిభాషితం అర్ధరాత్రేతుద్విదళం పంకజం పరికీర్తితం' అరుణోదయ కాలమున చతుర్దళపద్మమును - తపనోదయకాలమున షడ్దలపద్మమును - సంగవకాలమున దశదళపద్మమును - మధ్యాహ్నకాలమున ద్వాదశదళ పద్మమును సాయంకాలమున షోడశదళపద్మమును - అర్ధరాత్రిమున ద్విదళపద్మమును శివపూజాసమయంబుల వేయవలయుననిగలదు. దీక్షాకాలమందు గురువర్యుండు గౌరీలతామ టపమువేయవలయును.

## —: నమస్కారవిధి :—

'దక్షహస్తేన సంగృహ్య శిష్యలం లింగపేటికాం పాదాంగుష్ఠౌ గురోస్సవ్యహస్తేన పరిగృహ్యాచ సంస్పర్శయన్ నేత్రయోస్త్రీర్గుర్వా దీన్ శరణం వ్రజేత్' కుడిచేతితో లింగపేటికను బట్టుకొని యెడమ చేతితో గుర్వాదుల కాలిబొటనవ్రేళ్లను బట్టుకొని ముమ్మారు కనుల కద్దుకొని నమస్కరింపవలయునని నమస్కారవిధి చెప్పంబడి యున్నది.

## —: ప్రతిష్ఠాధికారము :—

'శివప్రతిష్ఠాంకుర్వీత శివదీక్షాపరాయణః। లింగధారణదీక్షైవ శివదీక్షేతికథ్యతే। అలింగివిహితాచారో లింగస్యపరమేశితుః వినా శాయభవేద్ద్విజః [illegible] కారణం। శివదీక్షావిహీనేన కృతం తత్కర్మ నిష్ఫలం। వేదవేదాంత తత్వజ్ఞోసలింగాంగీ శుచిద్ద్విజః। లింగస్యస్థాపనం కుర్యాత్ ప్రతిష్ఠాద్యుత్సవాదికం' లింగధారణ దీక్షయె శివదీక్షయగును. శివదీక్షాపరాయణుండే శివప్రతిష్ఠనుచేయ వలయును. శివదీక్షావిహీనునిచే నొనర్పంబడిన శివప్రతిష్ఠ చేశమున్ఛ

క్షాదులకుఁ గారణమై నిష్ఫలమునగుచున్నది. కావున వేదవేదాంత తత్త్వజ్ఞుడును - ద్విజుఁడునగు లింగాంగియే ప్రతిష్ఠాద్యుత్సవాదులఁ జేయవలయునని కారణాగమమునఁగలదు. ఈవిషయమే శివరహస్యము - కామికాగమము - మకుటాగమము మున్నగువాటియందు వివరింపఁబడియున్నది

## —: పూజాదిక విశేషములు :—

భక్తానాంగణమూర్తానాం। ప్రాణలింగాంగసంగినాం। అతిథీనాం ద్విజాగ్రాణాం ప్రాజ్ఞః సత్కారమాచరేత్ భోజయేదతిథీం నిత్యమన్నకామంద్విజోత్తమః। సకేవలం మలంభుంక్తేహ్యాతిథేర్భోజనం వినా। అతిథిర్యస్యభగ్నాశోగృహాత్ప్రతినివర్తతే సతస్మైదుష్కృతందత్త్వాపుణ్యమాదాయగచ్ఛతి. భగ్నాశుడై యెవనిగృహామునుండి అన్నకాముడగు అతిథి తిరిగిపోవునో ఆతడాగృహకర్త పుణ్యంబుల గైకొని పాపంబులొసగుననియు కావున ప్రాజ్ఞుడు అతిథి పూజనమొనర్పక భుజింపరాదనియు గృహద్వారమున నతఁడు గోదోహనమాత్రకాలము సాకాంక్షివస్వరూపుడగు అతిథికొరకై నిరీక్షింపవలయుననియు దేశాంతరాదాగతుఁడగు నాతని స్నానాన్నపానాదుల తృప్తినందింపవలయుననియు శంకరసంహితలోఁగలదు.

కాలోచితములగు నిత్యనైమిత్తికక్రియలవీడి వర్ణాశ్రమధర్మమర్యాద నెవడతిక్రమించుచున్నాడో ఆతడపాంక్తేయుడై శ్రీకంఠాఁపరాధుడగును. తస్మాల్లింగాంగసంబంధి నిత్యనైమిత్తికాశ్రయం కర్మవేదోదితంకృత్వా శివలింగం సదార్చయేత్. ఆకారణమున లింగధారియగు ద్విజుఁడు వేదస్మృత్యుదితమై నిత్యనైమిత్తికాశ్రయమగు ధర్మము నాచరింపుచు శివార్చనమొనర్పవలయును.

శివలింగస్య పూజోపకరణాని వివిధానిచ ప్రమాదేనైవవస్తూని పాదాభ్యాం నస్పృశేత్సుధీః। పూజోపకరణములగు వస్తువుల పాద

ములతో ద్రొక్కకూడదు. నేలపడిన పూజాద్రవ్యముల పూజాక్
ముపయోగింపజనదు.

భూతిరుద్రాక్ష శిఖాయజ్ఞోపవీతములు శివలింగములను
యయినను ద్విజోత్తముడగు శైవుడు సర్వకాల సర్వావస్థలయంద
నను వీడియుండరాదు అట్లొనర్చుట శివాజ్ఞోల్లంఘనమయి పాపమగ
చున్నది. గ్రంథాంతరమున ఉపనయనంబున పురుషులకును వివాహ
త్పూర్వము స్త్రీలకును (పురుషులతోకూడ) లింగధారణము చేయ
వలయుననికలదు. బాలికలకు లింగధారణమొనర్చి కన్యాదా
మొనర్చుట శైవశిష్టాచారముగనున్నది.

ఆపత్యపిదురంతాయాం గృహీమాహేశ్వరోజనః......గిరా
దురంతమగు నాపత్తునందును మాహేశ్వరుడు తన ధర్మమున
వీడకూడదు. 'పాత్రస్థం శివభుక్తం యతద్భూం జీయాదతింద్రితః
భాండస్థం నతుభుంజీయాద్యదిభుంక్తే సపాపభుక్' పాత్రస్థమై నివేదిత
మగు దానినే భుజింపవలయునుగాని భాండస్థమగు పదార్థమున
ప్రమాదముచేనైన భుజింపరాదు.

స్మృతిసారావళియందు 'మాహేశ్వరాణాం విప్రాణాం ధర్మో
యం కథ్యతేబుధైః శిఖాలింగం చోపవీతం భస్మరుద్రాక్షధారణ
స్నానసంధ్యాజపోహోమం స్వాధ్యాయం పితృతర్పణం వైశ్వదేవ
గురోః పూజాస్త్వేష్టలింగార్చనంతతః శివభావనయానిత్యం నిత్య
నైమిత్తికానిచ కుర్యాత్కర్మాణి సద్భక్త్యా శైవశాస్త్రవిధానతః
ద్విజుడగు మాహేశ్వరుడు శిఖాలింగయజ్ఞోపవీత భస్మరుద్రాక్ష
ధరించుచు స్నానసంధ్యాజపహోమస్వాధ్యాయపితృతర్పణ వైశ్వదే
యిష్టలింగారాధనముల నొనర్చుచు శైవశాస్త్రవిధి ననుసరించి స
మును శివభావనచేయుచు నిత్యనైమిత్తిక ధర్మాచరణ మొన
వలయునని విధింపబడియుండెను.

'జాతకే మృతకే చైవ సంధ్యాం పూజాం న సంత్యజేత్। ఉపాంశు సంధ్యాం పూజాంతు కుర్యాత్త్రికరణైరపి' జాతామృత శౌచములందు సంధ్యాపూజల రెంటిని విడువఁగూడదు. సంధ్య నుపాంశువుగను పూజను మనోవాక్కాయకర్మలచేత ననుష్ఠింపవలయును. 'ఉపాసనేతు విప్రాణామంగశుద్ధిస్తు జాయతే' ఉపాసనాకాలమందంగశుద్ధి విప్రులకు గల్గుచున్నదని పరాశరుఁడు చెప్పెను. శివపూజాసమయంబున సర్వథా సాంకర్యములు గలుగకుండులాగున వ్రతస్థుఁడు పాత్రాసాదనాది కర్మంబుల నప్రమత్తుఁడై యుండవలయును. పౌండరీకాదులయందువలె నాజన్మాంత దీక్షాసంస్కారముగల యువతికి రజోవత్యాదికాలములయందు శివపూజ చేయఁదగియేయున్నది. ప్రసవాద్యవస్థలయందుఁ బూజాభంగమయిన నయ్యది దోషము కానేరదు.

'షట్త్రింశత్తంతుభిః కుర్యాత్ వర్తికాం శివపూజనే' ముప్పదియారు పోగులచేఁ జేయఁబడిన వత్తులను శివపూజాకాలమందుపయోగింపవలయును.

'లఘ్వ్యామవసరాయాం వా దీప ఏకస్సమీరితః। చత్వారో వా తథా ద్వౌ వా మహత్యాంచ గురావపి' లఘ్వవసరపూజలయందొక్క దీపము వెలిగింపవలయును. మహాపూజయందును గురుపూజయందును నాలుగుగాని రెండుగాని దీపములు వెలిగింపవలయును.

మకుటోత్తరమున 'భస్మశయ్యాంచితే వామకరస్థేఽభిమంత్రితే ఇష్టలింగం సువిన్యస్య దక్షిణాస్యాభిసమ్ముఖః అంగుష్ఠతర్జనీమధ్యాభిముఖం గోముఖం యథా ఇష్టలింగం సువిన్యస్య పూజయేదవధానతః ఇష్టలింగే తథార్చాదౌ గురుదత్తే మహోత్తమే సలక్షణం పరీక్షేత గురుణా పాలితం యతః' సమంత్రితమయినదియు భస్మశయ్యతోఁ గూడిన వామహస్తమున నంగుష్ఠతర్జనుల మధ్యభాగమునకు నభిముఖముగా గోముఖముండునట్లు ఇష్టలింగముంచుకొని దక్షిణాముఖముగు

యఘోరముఖాభిముఖుఁడై భావనచేత సకలసాధనములు ప్రాణ్ణములై యున్నటుల భావించి శివపూజ నొనర్పవలయును గురువర్యునిచేఁ బవిత్రిమొనర్చి యివ్వఁబడిన ఇష్టలింగమందు లక్షణము పరీక్షింపఁగూడదు.

కర్మములవీడి శివునిఁగొల్చినవాఁడు తామసుఁడగుచున్నాఁడు. వేదవిహితకర్మంబులవీడి తాంత్రిక కర్మంబుల శివుఁగొల్చినయతఁడు రాజసుఁడనియు శ్రుతిస్మృత్యాగమోదిత నిత్యనైమిత్తికాదికర్మంబుల నాచరింపుచు శివునర్చింపునాతఁడు సాత్వికుఁడనియు నిందు నొకరి కంటె నొకరుత్తములగుదురనియు శంకరసంహితయందుఁగలదు.

'ఆగమార్థంతుదేవానాం గమనార్థఁతు రాక్షసాం కురుఘంటారవంతత్ర దేవతాహ్వానలాంఛనం ఆరంభేచాభిషేకేచ పూజాయాం ధూపదీపయోః ఘంటానాదం ప్రకర్తవ్యం...' దేవతాహ్వానలాంఛన మగు ఘంటారవము దేవతలు వచ్చుటకును - రాక్షసులు వెడలిపోవుటకును - పూజారంభమందు నభిషేకమందును - పూజయందును - ధూపదీపములయందును జేయఁబడుచున్నది.

'అరుణాద్యర్థ రాత్ర్యంతం షట్కాలాః పరికీర్తితాః తేషుకాలేషుకుర్వీత షట్కాలాష్టవిధార్చనం భూత్యాగంధాక్షతాపుష్పైః సపత్రైఃఫలదాయకైః ధూపప్రదీపనైవేద్యైర్వ్యాచాష్టవిధార్చనం' అరుణాద్యర్ధరాత్రిపర్యంత మారుకాలములగుచున్నది. భూతియు - గంధము నక్షతలు బుష్పాదులును ధూపమును దీపమును నైవేద్యమును తాంబూలమును సమగూర్చుకొని పైయారుకాలములయందును. అష్టవిధార్చనల భక్త్యైకాగ్రతలాంతముగ లింగము నర్చింపవలయునని వాతూలోత్తరమునఁగలదు.

శివసంకల్పాధ్యయనంబును రుద్రపారాయణంబును పంచబ్రహ్మపఠనంబును శివమంత్రముల జపించుటయు భక్తుల సమస్త దోషచయంబులకుఁ బ్రాయశ్చిత్తములగుననియు నిత్యకర్మభ్రంశుఁ

డగు బ్రాహ్మణుఁడు సహితము పంచాక్షరీమంత్ర పఠనంబునఁ బవి త్రుఁడగుచున్నాఁడనియు శంకరసంహితయందుఁగలదు.

పూజాసమయంబున నివేదనకుముందు లింగమువిూదనున్న పత్రపుష్పాదులఁ గొలదిగానుంచి కడమవి తీయవలయును. నిశ్శేష ముగాఁ బత్రపుష్పాదులఁ దొలగింపరాదు. లింగశిరము శూన్య ముగానుంచి నివేదింపఁజనదు. పత్రపుష్పాదులఁదీసి భస్మమునిడి నివేదింపుటయు శిష్టాచారముగఁ జూడఁబడుచున్నది

ప్రాణాగ్నిహోత్రం యఃకుర్యాత్ శివస్యైవ ప్రసాదతః అశ్వ మేధాయుతం పుణ్యం తత్క్షణాల్లభతే నరః' ప్రాణాహుతులను శివ ప్రసాదముతోఁ జేయునెడ యశ్వమేధములతో సమమగు ఫలము నందుచున్నాఁడని స్కాందమహాపురాణమునఁగలదు.

పూజాకాలమునందుఁ బిక్కిలిపట్టి బొటనవ్రేలిని క్రిందికి జార్చి లింగముచుట్టును ద్రిప్పుట ప్రదక్షిణచిహ్నమగును.

లింగనివేదనకంటెఁ బూర్వమందు నైవేద్యప్రోక్షణము ననంత రము పరిషేచనమును, గర్తవ్యములైయున్నవి. గాయత్రీ మంత్ర ముచే జలప్రోక్షణముకాని పదార్థము నివేదనార్హమును నివేదనము గాని పదార్థము భోజనార్హమును కానేరదు.

'నమకంచమకంచైవ పౌరుషం సూక్తమేవచ। జపన్నేతి మహాదేవం గృహం గృహపతిర్యథా' పూజాకాలమందు నమకచమక ములను పురుషసూక్తమును బఠించి..........దు గృహయజమాని గృహమునువలె మహాదేవునిఁజేరుచున్నాఁడు.

నీలకంఠాచార్య విరచిత శైవసిద్ధాంతదీపికయందు శాంభవ వ్రతిచేయఁదగిన కృత్యములెవ్వియను ప్రశ్నమునకు నుత్తరరూపక ముగ వైదికములు శైవములునగు సకలధర్మముల నవలంబించుటయు శైవధర్మముల విరోధింపని స్మార్త ధర్మముల నాచరింపుటయు లిం గాంగ సామరస్యంబును షట్స్థలానుభవంబును గురువచనపాలనంబును

శక్తిఁ గొలఁది మాహేశ్వరపూజయు గ్రాహ్యములనియు నితరదేవ నిర్మాల్య భక్షణంబును శివనిందయు శివభక్తినిందయు శివశాస్త్ర నిందయు శివశాస్త్రసిద్ధాచారనిందయు దేవద్రవ్యోపభోగంబును భూతహింసయు గ్రాహ్యములుకావనియుఁ గావున శివదీక్షితుఁ డిటుల విధ్యుక్తాచారతత్పరుఁడై ముక్తినొందవలయుననియు నిర్ణయింపఁబడియున్నది.

—: రంగవల్లీ విధానము :—

1. గౌరీలతాలింగమండలం :

శ్లో॥ క్షేత్రేషట్త్రింశపదీకృతే చలపదైరంభోరుహం మధ్యమే
కుర్యాద్దిక్షుచ వారివాచనపదైః పట్టంచ కుంజి గళం
కంజం పట్టక మేవలింగ మధసన్కోణేషు భూభృత్పదై
ర్వల్లిశ్చా పరమేవ మండలమిదం గౌరీలతాలింగజం॥

సీ॥ పూర్వోత్తరాగ్రమై భూమినివింశతి
కోష్టముల్ క్రమ్మఁగూర్చి నడుమ
షట్త్రింశపదముల సరసీరుహము
నాల్గుదిక్కుల షడ్వేద ద్వితయమట్ల
షడ్వేదపరసంఖ్య సరసపట్టికకంజ
గళకంజపట్టిక కలితలింగ
మడ్భాగములుదీర్చి, పట్టసదోన్నతి
నేత్రాబ్ధిపదములు నెరిగినాల్గు

గీ॥ దంగులనునాల్గు లింగముల్ రాక్షసాది
పదములేడింట వల్లులు పనుపుతోను
గౌరివార్థియుంగదీనిదా గౌరిలతల
లింగమండలమననొప్పు లీలజగతి॥

2. గౌరీలతాలింగమండలం :

శ్లో॥ క్షేత్రైర్ద్వ్యక్షిపదేకృతే రిపుపురైర్మధ్యేచ కుర్యాత్కజం
ద్వారోదిక్షుపదైర్ద్వ్యచావరవచ్చైర్లింగాని తత్పార్శ్వయోః
వీధీః పీతగతాస్త మీశ్వరపదాకోణేషు శైలైర్లతాః
పశ్చాత్కాంతమిదం భవత్యపరకం గౌరీలతాలింగకం॥

సీ॥ పూర్వోత్తరాగ్రిమై భూమినిద్వావింశ
కోష్టముల్ ముగ్గున గూర్చునపుడు
ఆమ్నాయవేదాబ్ధియగు సంఖ్యపదముల
నిండు సమసూత్రముల్ నిలిపియందు
ముప్పదారిటమధ్య ముందుకింజల్కాష్ట
పత్రాన్వితముగాను పద్మమొప్ప
పద్మాశలనుమధ్య పదములరసవేద
కరవేదషడ్వేద కలితలింగ
పట్టికాబ్జయుకంఠ పద్మపట్టికలింగ
సప్తపదోన్నతి సరవినొక్క
లింగంబుకరవేద సంగతివసురస
శశిపదంబులనిండ సరసముగను
శ్వేతారుణాశిత పీతవర్ణంబులు
పశ్చిమోత్తరయామ్య ప్రాచ్యదిశల
నాలుగులింగముల్ యరయపార్శ్వంబుల
పసుపువీధులుగాను పొసగదీర్చి

గీ॥ నవచతుస్సంఖ్యమూలల సరపిశైల
పదములందుల వల్లులు పసుపుతోను
గౌరివాప్రియంగ దీనిదాగౌరిలతల
లింగమండలమననొప్పు లీలజగతి॥

3. గౌరీలతాలింగమండలం :

శ్లో॥ సూత్రైస్సప్తదశాత్మకై రుభయతో గౌరీలతే చాన్వయం
మధ్యే వేదపదైర్విదిక్షుషు పదైర్మ్యాతాంబుజాని న్యసేత్
లింగం పట్ట సరోజకంజకమలం పట్టకస్మాద్దిక్పదై
ర్వత్తూ భూరివిసైశ్చ కోణకలితైర్యాత్తైస్స దైన్యుర్లతాః॥

సీ॥ ప్రాగుదగగ్రమై పదియేడు రేఖలు
ఋతుబాణ కరపద మితము దెలసి
తన్మధ్యభూతాబ్జదళము లొప్పగదీర్చి
తద్విదిక్కుగ (క్షుషు)ముల తత్ప్రకార
ముగ వ్రాసి పూర్వాదినగపదోన్నతముల
పీతాశితారుణ శ్వేతములను
షడ్వేదకరవేద షడ్వేదపదముల
లింగమొక్కొకదిక్కు రంగులకసి

గీ॥ వహ్ని నైరుతి ఈశాన వాయుదిశల
పంచబాణపదంబుల పసుపులతలు
గౌరివ్రాయంగ నిదియుదా గౌరిలతల
మండలంబని శైవాగమములు బలుకు॥

4 ఉమాకాంతాలతాలింగమండలం :

శ్లో॥ క్షేత్రే (రే) ఖాగ్నిపదీకృతే జలరుహం మధ్యేభనాకాబ్ధిభిః
పర్యాద్ద్వార అధశ్చదిక్షునఖరైర్లింగాని తత్పార్శ్వయోః
మధ్యేవాచవరావచైశ్చ శశినావీధి హరిద్రాగతాః
కోణేష్వద్రి పదైర్లతా ఇద ముమాకాంతాఖ్య మస్యద్భవేత్॥

సీ॥ పూర్వోత్తరాగ్రాదిగ్రి పురరేఖలుర్విపై
షట్త్రింశపదములసంఖ్యయందు
షడ్విధినేత్రాబ్జ సంఖ్యతత్పదములు
పదచతుశ్శతమధ్య పద్మమొప్పు
పద్మాశిలను మధ్యపదముల షడ్వేద
కరవేద షడ్వేద ఖటికలింగ
షడ్భాగములనేత్రి సాగరచ్ఛదముల
లింగమాశాగుణ సంగతేందు
షడ్బాహుశశికోష్ఠ సరణిద్వాదశలింగ
పదములు వేదాభ్ర బాణసంఖ్య
శ్వేతారుణాశిత పీతవర్ణంబులు
పశ్చిమోత్తర యామ్య ప్రాచ్యదిశల

గీ॥ గూర్చి పార్శ్వంబు వీధులుగూర్చి పసుపు
నవచతుస్సంఖ్యమూలలు నరసిపసుపు
లతలువ్రాయంగనిదియు మాకాంతలతల
లింగమండలమననొప్పు లీలజగతి।

5 లింగమండలం :

శ్లో॥ క్షేత్రేభూపపదీకృతే జలనిధిర్వేదాశ్చమధ్యే పదే
చోద్ధ్వేత్మ్యపతి సూర్యమాపతి రసశ్రుత్యబ్ధి వేదార్ణవాః
కంఠేషడ్దశభాను షోడశ చతుష్కద్వంద్వ కోష్ఠాన్యతః
సంరక్షోభయ పార్శ్వసంస్థితపదాన్యాలోప నాల్లింగకం॥

సీ॥ పూర్వోత్తరాంతమై భూపకోష్ఠంబుల
మధ్యాబ్ధిసాగర మనుజవిభుల
భానువిష్ణురసాబ్ధి పాదోధినీరధి
వార్ధికోణంబుల వరుసదెలిసి

కంఠషడ్దళభానుకోష్ఠతలే శార్ణవ
సాగరచ్ఛదముల సమతనిలిపి
యుభయపార్శ్వంబుల నున్నకోష్టంబులు
నూటముప్పదియారు గీలుబుచ్చి

గీ॥ శిష్టపాదాలు తండుల పిష్టమునను
వ్రాసి దానిని నెనిమిటజేసెనేని
పంచసూత్రి విఘటితమై పరిఢవిల్ల
పూర్ణలింగంబు నాగమనిర్ణయంబు॥

6 గౌరీతిలకం :

శ్లో॥ రేఖాస్తిర్యగధోర్ధ్వగాశ్చవిలిఖే దష్టౌచతుష్కోష్ఠగా
నేకీకృత్యవిదిక్షు మధ్యనవకంచైకం విదధ్యాత్సుధీః
ప్రాగాదిస్థిత మర్ధలింగ సదృశం కుర్యాచ్చతుష్కం త్విదం
ప్రాగ్గౌరీతిలకం సుపద్మరచనా మన్యేషుకుర్యాచ్ఛుభం॥

సీ॥ ప్రాగుదగగ్రమై భామలరేఖలుతిర్య
గూర్ధ్వంబుగాదీర్చి మధ్య
విధిసంఖ్యపదముల విశదాష్టదళమొప్ప
తద్విదిక్షులయందు తపనవేద
పదములొక్కటజేసి ప్రత్యగుదఙ్ముఖ
ప్రాచీయమాశల భానుకోష్ఠ
వేదోన్నతంబులై విమలార్ధలింగముల్
వసుపదంబులనిండ పౌనగలింగ

గీ॥ పట్టికాకంఠపీఠంబు పదిలపరచి
పీతనీలారుణశ్వేత రీతులరసి
పూర్వయామసోమ వరుణుల పౌనగిదీర్ప
దేవి వినుదీని శ్రీగౌరి తిలకమనగ॥

7 భద్రమండలం :

శ్లో॥ క్షేత్రే సప్తపదీకృతే నవపదే మధ్యేలిఖేత్కర్ణికాం
కింజల్కాన్విత మష్టపత్రసహితం పద్మం తదభ్యగ్రగే
వేదాశాన్విత కోష్ఠకాని మతిమాన్సంత్యజ్య శిష్టేషు
సత్కోష్ఠే స్వల్పసరోరుహాణి విలిఖేత్ స్యాద్భద్రకం మండలం

ఉ॥ అంచిత భద్రమండలము యాదట సప్తపదీకృతంబునై
మించితదీయ మధ్యమున మెచ్చగ బ్రహ్మపదంబుదానిలె
క్కించి సరోజ మష్టదళకేసరయుక్తము పంచరంగులం
దంచితమొప్పఁజేసి దిశలేంద్రపదాది చతుష్పదంబులం
దుంచి విశిష్టకోష్ఠములు నొప్పగగూర్పుము స్వల్పకంజముల్॥

—: శి వ మే ధ ము :—

'యతీనాం తద్విసంసార యోగాభావాన్న యుజ్యతే తస్మాత్సం సార సంపర్క హేతురాశౌచ సంగతేః తద్యోగాదస్తి ప్రతినా మాశౌ చమితినిశ్చినుః' సంసారసంబంధమే యాశౌచప్రాప్తికిమూలము. ఇది సన్యాసులకులేదు. కాన వారికి నాశౌచములేదు. సంసారసంబంధ ముగల శాంభవదీక్షితునకయిననో యాఆశౌచముండునని చంద్రజ్ఞాన మునఁ జెప్పఁబడినది. 'శాంభవవ్రతనిష్ఠానాం ఇష్టలింగాంగసంగినాం శివమేధం ప్రకుర్వీత దేహాంతేచ ముముక్షుభిః' శాంభవవ్రతికిదే హాంతమున శివమేధముచేయువలయును. 'శివేపరేప్రవిష్టానాం మేధ ఆరాధనాత్మకః శివమేధ ఇతిఖ్యాతః కరణీయోముముక్షుభిః' మకు టోత్తరచర్యాపాదమున శివునియందుఁ బ్రవేశించినవారి యారాధన రూపకమగు యజ్ఞమునకు శివమేధమను పేరుకలిగియుండునని యు ముముక్షువులీవిధానము నె కర్తవ్యముగా తలంపవలయుననియుఁగలదు. 'విశిష్టః పితృమేధోయం శివమేధఇతిస్మృతః' విశిష్టమగు పితృమేధము

నకే శివమేధమని పేరు. దీనినే యంత్యేష్టి
గలదు. 'వానప్రస్థం యోగినంచ లింగైక్యం
ణామాశ్రమాణాంచ రసాయాం నిక్షిపేత్
వానప్రస్థుని - యోగిని - లింగైక్యుని
సమాధిచేయుటయే శాస్త్రనిర్ణయము నాచార
భవవ్రతికిఁ బ్రేతత్వములేదు కావునఁ బ్రేత
మున నొనర్పరాదు. 'లింగధారణవిప్రస్య దా
ధారి ద్విజునకు దాహకర్మ వర్తింపదు. విధి
నర్చ్చచో నయ్యది బ్రహ్మహత్యతో సమాన
మగుచున్నది. శాంభవవ్రతినే శ్రాద్ధం సపిం
మాసప్తమంతస్య నరకే నిపతేద్ధ్రువం' శాం
శ్రాద్ధముచేసినవాఁడు యేడుతరములవరకు న
మకటోత్తరమున గలదు. మనుస్మృతియందు
శివలింగాంగసంయుతః శివేతరపరిత్యాగీ ధ్యాన
గాంగియై శివధ్యానపరుఁడును శివేతరదేవత
ధ్యానయోగియని చెప్పంబడుచున్నాఁడు.
సంగ నివృత్తస్య ధ్యానయోగరతస్యచ నతస్య
పిండోదకక్రియా' అట్టి ధ్యానయోగికి దహన
చేయఁగూడదని నిర్ణయించెను. 'బ్రహ్మచా
స్థోయతిస్తువా చీర్ణవ్రతో యదిమృతః తస్య
బ్రహ్మచారిగాని గృహస్థుఁడుగాని వానప్ర
శాంభవవ్రతుఁడు మృతిఁబొందెనేని యాతని
చేయఁగూడదు.

సర్వస్వప్రతిశివరీ:-'భూమిస్త్వేపస్థఅధిత
భక్తియోగము కలవారినుద్దేశించి మృతులకు
వుచున్నవి 'సమాధిర్మోక్షధర్మోయం' సమాధి

ంబదియునియు శాంభవదీక్షాలబ్ధమగు లింగాంగసామరస్యమువలన
భ్రమరకీటక న్యాయముచే శివసాయుజ్యము నొందినవాడు మృతినం
నప్పుడు ప్రేతత్వములేదుగాన సాపింద్యము చేయతగదనియు 'దీక్షా
ాలపరిప్రాప్త శివైక్యం జీవభావతః ఆవిర్భూతం విజానంతి' దీక్షా
ాలమున గురుండొసంగిన యీశ్వరభావము చరమదశయందు జీవ
ావమును నివర్తింపంజేసి యావిర్భవింపుననియు భక్తిజ్ఞానరహితుండై
ను శివమేధసంస్కారముచే సంస్కరింపబడినవాడు శివసాన్నిధ్యము
ొందుననియు మకుటోత్తరచర్యాపాదంబున వివరింపంబడియెను.

శివాలయ సమీపమునగాని శివారామమునందుగాని శివ
ర్ధసమీపమునగాని బిల్వమూలమునందుగాని నదీతీరమందుగాని
మాధినేర్పరచవలయును. 'చతురశ్రం పంచపాదం దీర్ఘం విస్తార
ంవచఖాతం నవపదంత్వాద్యం సోపానంచైకపాదకం ద్వితీయం ద్విప
ం ప్రోక్తం తృతీయంత్రిపదం తథా వేదికాచత్రిపాదేనతస్య దక్షిణ
ోదిశిత్రికోణం చప్రికర్తవ్యం త్రిపాదం దీర్ఘమాయతం, పొడుగు
ొడల్పు నైదేసియడుగుల చొప్పున నుండునట్లు నలుచదరముగా
ొమ్మిదియడుగుల లోతు త్రవ్వింపవలయును అందు మొదటి
ట్టొక యడుగెత్తుగను రెండవ సోపానము రెండడుగులయెత్తును
ూడవ సోపానము మూడడుగుల యెత్తును వేదిక మూడడుగుల
మెత్తును నుండవలయును. అదిగాక లోన దక్షిణదిశను మూడడు
ల వైశాల్యముండునటుల ముక్కోణముగ త్రవ్వింపవలయును.
ాయ్యది యె సమాధిలక్షణమని మకుటోత్తరమునఁగలదు.

## —: శివనామమాహాత్మ్యము :—

'నామ్నాస్తి శంభోశ్శక్త్యా పాపసంహారణేద్విజా। స్తావత్పా
ానికర్తుం నైశక్తః కోవాకలౌయుగే సదాసముచ్చరేద్ధీమాన్ శివ
ఇత్యక్షరద్వయం। సంసారసాగరం తీర్త్వా శివసాయుజ్యమాప్నుయాత్।

ప్రసంగాత్కౌతుకాత్ లోభాత్ భయాదజ్ఞానతోపివాహర ఇత్యు చ్చరన్ మర్త్యస్సర్వపాపైః ప్రముచ్యతే' శివయను నక్షరద్వయమును చ్చరించి సంసారసాగరమునుదాటి జనుఁడు శివసాయుజ్యము నందు చున్నాఁడు. ప్రసంగమువలనఁగాని సంతోషమువలనగాని లోభము నంచిగాని భయమువలనగాని యజ్ఞానమువలనగాని హరనామ ముచ్చరించిన మర్త్యుఁడు సర్వపాపవిముక్తుఁడగుచున్నాఁడు. పరమేశ్వర నామోచ్చారణవలన నెట్టిపాపములు నశింపఁగలవో యట్టి పాపము లను నరుఁడు చేయఁజాలఁడని శివతత్త్వసుధానిధియందుఁగలదు.

'కోటయో బ్రహ్మహత్యానామగమ్యాగమ కోటయః సద్యః ప్రళయమాయాంతి మహాదేవేతికీర్తనాత్' మహాదేవకీర్తనమువలన బ్రహ్మహత్యాదులవలనఁ గలిగిన పాపములే ప్రళయమును బొందు చున్నవని యభియుక్తోక్తి గలదు.

'మంత్రాణాం పరమోమంత్రః శివఇత్యక్షరద్వయం' శివ యను రెండక్షరములన్ని మంత్రములయందు నుత్కృష్టమయిన మం త్రముగ వైదికాచార నిర్ణయమున వర్ణింపఁబడినది.

'వేదేషుసార మఖిలేషుచ మంత్రతంత్ర శాస్త్రేషు సారమపి శబ్దసముద్రసారం। సారేషుసారమిదమేవ శివేతినామ యేనాపికేనస కృదుచ్చరితం సధన్యః' సమస్తవిద్యాసారమును వేదసారమునగు శివ నామ మెమానవుఁడొక్కసారి యుచ్చరించునో యాతఁడు ధన్యుఁడని పెద్దలయాశయము. 'శుచిత్వయుక్తోప్యశుచిత్వయుక్తశ్శివం స్మరన్ జంతురుపైతిసిద్ధిం' శుచియైగాని యశుచియైగాని శివుని స్మరించి మానవుఁడు సిద్ధినిఁబొందుచున్నాఁడు.

శైవమంత్రములగు అఘోర-శరభసాళ్వ-దక్షిణామూర్త్యాది మంత్రజపంబును శివకవచ పారాయణంబును శివసహస్రనామ పఠనంబును శివస్తోత్రాధ్యయనంబు పంచజాబాలోపనిషత్పారాయణం బును శైవపురాణపఠన శ్రవణాదికమును శైవాగమచింతనంబు నిహా

వకసాధకములై సర్వాభీష్టఫలప్రదములగుచున్నవి. కల్యాణస్వరూపుండగు పరమేశ్వర నామంబులు భక్తియుతుండై నిరతంబు పఠించు నాతఁడు తానెవ్వఁడయినను మరల పుట్టుటలేదని స్కాందమహాపురాణమునఁగలదు. సంసార సర్పదష్టులకుఁ జంద్రశేఖరపాదాబ్జస్మరణమే పరమౌషధమని మార్కండేయుఁడు వచించెను. మనోవ్యాధికిఁ బరమేశ్వర నామస్మరణకంటె నుపశమింపఁజేయఁగల యౌషధయోగమింకొకటి కనిపెట్టి ప్రకటింపఁబడియుండలేదు.

## —: ఉపసంహారము :—

సంసారమను క్షేత్రమునఁ గాలుడను కర్షకుఁడు జీవబీజముల నాటి పక్వములగువాటి నాలోకించి తినుచున్నాడు. 'నాస్తి మృత్యుసమందుఃఖం నాస్తి మృత్యుసమంభయం నాస్తి మృత్యుసమంత్రాసః సర్వేషామేవదేహినాం| జీవితాంతేచమరణం మహాఘోర మవాప్య వై జాయంతేయోని కూపేషు మృతాః కర్మవశాత్పునః' మృత్యువుతో సమానమగు భయముగాని దుఃఖముగాని లేదు. జీవితాంతమునందు మరణమునంది మృతుఁడు కర్మవశమునఁదిరిగి పుట్టుచున్నాఁడు. తనశరీరమందును మానవునకు స్వాతంత్ర్యమేలేదు' బుద్బుదప్రాయమగు కాయము ఫణిముఖమండూకమువోలె మృత్యుకబళితప్రాయమైయున్నది. 'నపుత్రధనదారాశ్చ సహాగచ్ఛంతి గచ్ఛత' లోకాంతరగతునకు దారపుత్రధనాదులు వెంట రావుకాని ధర్మాధర్మములను రెండే తన్ననుసరించునవియైయున్నవి. కాయము కాలక్రమమున నశించును; జరాదుల జీర్ణించును; దుఃఖాదుల కృశించును; కాని శాశ్వితముగనుండఁజాలదు. 'యావన్నాహరతిప్రాణాన్ మృత్యుర్గంధ మివానిలః తావద్వేదాదికం ధర్మంకుర్యాత్ప్రాజ్ఞః' వాయువు గంధమునెటుల హరించుచున్నదో యట్టులే మృత్యువుచేఁ బ్రాణములు హరింపఁబడకపూర్వమే ప్రాజ్ఞుఁడు వేదాదికములగు ధర్మముల నాశ్రయింపవలయును 'నదీనాముత్తమాగంగాధర్మాణాం

శంకరాశ్రియః' నదులలో నుత్తమమగు గంగవలె శంకరాశ్రయమగు ధర్మము విశేషమయినది. 'వేదోమూలంహి ధర్మాణాం వేదమూలం మహేశ్వరః తస్మాత్సర్వప్రయత్నేన వేదస్మృత్యుదితం పరం ధర్మం శివాశ్రియం ప్రాజ్ఞః నకదాపి పరిత్యజేత్' ధర్మములకు వేదమే మూలమగుచున్నది. వేదమూలము పరమేశ్వరుఁడగుచున్నాఁడు. ఈకారణముచే వేదస్మృత్యాదికమయిన నీ శివాశ్రియధర్మమును ప్రాజ్ఞుఁడనుష్ఠించి తీరవలయును. ఇట్టి పవిత్రధర్మానుష్ఠానమున 'ప్రసీదతి మహాదేవోపరమాత్మా' పరమాత్మయగు సదాశివుఁడు ప్రసన్నుఁడగును. 'ప్రసన్నేసతి దేవేశే మహానందే సదాశివే దుష్కరంకిము మర్త్యానాం' సదాశివుఁడు ప్రసన్నుఁడగుచుండగా మనుజునికి దుష్కరమైనదేముండును? పవిత్రమగునిట్టి ధర్మానుష్ఠానమున సర్వోత్కృష్టమగు శివానందము నందుచున్నాడని సర్వశాస్త్రసిద్ధాంతమై యున్నది. పరమోత్కృష్టమగు నీ శివధర్మమును శఠునకు శిష్యుఁడు కానివానికి భక్తిలేనివానికి శ్రద్ధారహితునకు నుపదేశింపఁజనదు. 'శక్తోయస్థాపితుం ధర్మముపేక్షాం కురుతే నరః సోసిపత్రివనం నామ నరకం ప్రతిపద్యతే' ఎవ్వడీ పరమ శివధర్మమును శక్తుఁడయ్యును స్థాపింపజాలఁడో యాతఁడశిపత్రివను నరకమునందుచున్నాడని నిర్ణయింపఁబడెను.

శ్లో॥ దక్షిణాన్యప్రసాదేన శైవసర్వస్వ సంగ్రహః
గ్రథితో భక్తబృందాయ జీయాదాచంద్రతారకం॥

తచ్ఛంయోరావృణీమహే గాతుం యజ్ఞాయ గాతుం యజ్ఞపతయే దైవీస్వస్తిరస్తునః। స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వంజిగాతుభేషజం శంనోఅస్తుద్విపదే। శంచతుష్పదే। ఓం శాంతిశ్శాంతి శ్శాంతిః॥

# శైవసర్వస్వము – ప్రమాణపరిచ్ఛేదము

## తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 4 | మహాదేశ | మహాదేవ |
| 10 | 22 | నను,హించు | ననుగ్రహించు |
| 13 | 1 | చ్ఛరాచర | చ్ఛరాచరం |
| | 25 | చ్ఛాయో | చ్ఛాయోగంబున |
| | 26 | ర్వ్యగంబున | ర్వ్య |
| 14 | 7 | పరాష్టా | పరాకాష్టా |
| | 10 | తస్యా కార్య | తస్యాః కార్య |
| | 11 | పదయా | పరయా |
| | 12 | మోదం | మోతం |
| 15 | 25 | పతియ | పతియు |
| 17 | 21 | ధ్యాతీ | ధ్యాతా |
| 18 | 18 | | ఏషామీ |
| 20 | 14 | మలయ | మల |
| 25 | 12 | యిష్యతి | యిష్యంతి |
| | 17 | ప్రధ | ప్రద |
| 29 | 6 | భస్మరూప | భస్మధారణరూప |
| 30 | 7 | మహాపాసు | మహాపాశు |
| 33 | 20 | ప్రశసింప | ప్రశంసింప |
| 45 | 17 | శాంత్యలీప | శాంప్యతీతప |
| 47 | 12 | మడలము | మండలము |
| | 18 | ప్రాజం | ప్రాజ్మం |
| 58 | 2 | కేశభిః | కేశంభుః |
| 59 | 9 | స్వజలై | స్వజనై |
| 60 | 7 | సహస్త్రి | సహస్రి |
| 61 | 8 | ఏఖ | ఏక |
| 63 | 18 | ససారా | సంసారా |
| 66 | 19 | గాప్రదో | గానిప్రదో |

| | | | |
|---|---|---|---|
| | 23 | సహిత | సంహిత |
| 67 | 7 | ర్వాక్య | ర్వాక్యం |
| 73 | 18 | శిలయదు | శిలయందు |
| 74 | 4 | ఆర్ధరూనా | అర్ధరూపా |
| 77 | 9 | | తద్విన శ్యతి |
| 79 | 20 | విధిపు | విధింపు |
| 86 | 7 | నట్లువినా | నట్లువినా |
| 89 | 15 | ముపాసకః | ముపాసకం |
| 88 | 1 | వాక్య | వాక |
| 92 | 2 | నాపి | నాసి |
| 99 | 1 | అధశ్చనమం | అధశ్చసమం |
| | 4 | దీర్ఘింశా | దీర్ఘికంవా |
| 104 | 3 | పిచేత్ | పిబేత్ |
| 105 | 2 | ఖోక్ప్రా | భోక్తా |
| | 14 | మనచ్న | మన్న |
| 114 | 13 | మహేశ్వ | మాహేశ్వ |
| | 15 | ,, | ,, |
| 116 | | యగ్న | — |
| 118 | 5 | పాశిత | పాశత |
| 120 | 12 | పచాచా | పంచాచా |
| | 17 | కుటుబ | కుటుంబ |
| 122 | 8 | దాశక్తి | దాసక్తి |
| 128 | 5 | సర్వశివ | సర్వంశివ |
| 130 | 23 | భోక్తా | ప్రోక్తా |
| 142 | 11 | మడల | మండల |
| 143 | 22 | నరపి | నరసి |
| 144 | 18 | లిగ | లింగ |